# శ్రీ పద్మావతీ వైభవమ్














శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

# శ్రీ పద్మావతీ వైభవమ్

తిరుమల తిరుపతి దేవస్థానముల
హిందూ ధార్మిక గ్రంథాల ప్రచురణ ప్రోత్సాహపథకంలో
టి.టి.డి. వారు అందించిన ఆర్థిక సహాయంతో
"శ్రీ పద్మావతీ వైభవమ్" ప్రచురింపబడింది.

"క్షేత్ర సాహితీ నవ వైతాళిక" - "క్షేత్ర చరిత్రోద్ధారక"

## శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

వెదురుపాక శ్రీ విజయదుర్గా పీఠం ఆస్థానకవి
క్షేత్ర సాహితి.
రామచంద్రపురము.

ప్రధమ ముద్రణ :
మార్చి : 2002
సర్వ స్వామ్యము
సంకలితము
వెయ్యి ప్రతులు







ప్రతులకు
"క్షేత్ర సాహితి"
శ్రీహరివాసము
లలితా నగర్
రామచంద్రపురము – 533 255
ఫోను: 08857 43353.
ప్రెస్: స్నేహ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్
మెయిన్ రోడ్, రామచంద్రపురం.
ఫోను: 08857 42065.

డి.టి.పి.సెట్టర్
ఆర్. ఎస్. కంప్యూటర్స్
మార్కెట్ సెంటర్, రామచంద్రపురం
ఫోను: 08857 46297.



# శ్రీ పద్మావతీ వైభవమ్

శ్రీ పద్మావతీ దేవి పాదపద్మాలకు
అంకితం

వెలమకన్ని శ్రీరామమూర్తి

# శ్రీ శుకపురం

"నమః శ్రియైలోకధాత్రై బ్రహ్మమాత్రే నమోనమః
నమస్తే పద్మనేత్రాయై పద్మ ముఖ్యై నమోనమః
ప్రసన్న ముఖ పద్మాయై పద్మకాంత్యై నమోనమః
నమో బిల్వవనస్థాయై విష్ణు పత్న్యై నమోనమః
విచిత్ర క్షౌమధారిణ్యై పృధు శ్రోణ్యై నమోనమః
పక్వ బిల్వ ఫలా పీనతుంగస్తన్యై నమోనమః
సురక్త పద్మపత్రాభకర పాదతలే నమోనమః
సురత్నాంగద కేయూర కాంచీనూపుర శోభితే
యక్షకర్దమ సంలిప్త సర్వాంగే కటకోజ్జ్వలే
మాంగళ్యాభరణైశ్చిత్రై ముక్తాహారై విభూషితే
తాటంకైరవతంసైశ్చ శోభమానముఖాంబుజే
పద్మహస్తే నమస్తుభ్యం ప్రసీద హరివల్లభే
ఋగ్యజుః సామరూపాయై విద్యాయైతే నమోనమః
ప్రసీదాస్మాన్ కృపాదృష్టిపాతైరాలోకయాబ్ధిజే
యే దృష్టాస్తే త్వయా బ్రహ్మరుదేంద్రత్వం సమాప్నుయుః"

-----వరాహపురాణం

శ్రీ లక్ష్మీస్తుతి ఇది. శ్రీ వరాహపురాణాంతర్గత శ్రీ లక్ష్మీస్తుతిలో శ్రీ మహాలక్ష్మీ దేవి సుందర స్వరూపం, సుప్రసన్న స్వరూపం ఆవిష్కరింపబడింది. శ్రీ లక్ష్మీ స్వరూపానికి ప్రతిరూపం శ్రీపద్మాదేవి దివ్య స్వరూపం. శ్రీ పద్మావతీదేవి శ్రీ అలమేలు మంగాదేవిగా భక్తుల చేత వినుతింప బడుతోంది. పద్మావతీదేవి కొలువున్న నెలవు తిరుచానూరుగా అలమేలుమంగాపురంగా పిలువబడుతోంది. సేవింపబడుతోంది. శ్రీనివాసమంగాపురం తిరుపతి క్షేత్ర సమీపంలోని శ్రీకల్యాణ వేంకటేశ్వర క్షేత్రం. నారాయణవరం పద్మావతీ పరిణయోద్యానవనం. అదీ కల్యాణ వేంకటేశ్వర క్షేత్రమే! అప్పలయ్య గుంట (తిరుచానూరు) శ్రీ ప్రసన్న వేంకటేశ్వర క్షేత్రమూ గణనీయమైనదే! తొండవాడ శ్రీ తిమ్మప్ప స్వామి క్షేత్రమూ పరిగణనీయమైనదే! తిరుమల శ్రీ వేంకటేశ్వర క్షేత్రం కొండలలో నెలకొన్న కొండల కోనేటి రాయుని క్షేత్రం. అది కొండలంత వరాలు భక్తులకు ప్రసాదించే సుప్రసిద్ధ గిరి క్షేత్రం.

అడవులు, పులులు, మలేరియా వంటి అంటు రోగాలు ఉన్న తిరుమల కొండకు పూర్వం భక్తులు యాత్ర కావించడానికి సాహసించే వారుకాదు. అందుచేత తిరుపతి క్షేత్రం సమీపంలో మైదాన ప్రాంతంలో శ్రీనివాస మంగాపురంలో, నారాయణవరంలో, అప్పలయ్యా గుంటలో (తిరుచానూరు), తొండవాడలో నాలుగు శ్రీ వేంకటేశ్వర ఆలయాలు వెలసి, భక్తుల ప్రవేశానికి సులభ సాధ్యాలుగా నిలచాయి. నేడు ఆ నాలుగు శ్రీ వేంకటేశ్వర క్షేత్రాలలో తిరుచానూరు శ్రీ పద్మావతీ దేవి ఆవిర్భవించిన దివ్య క్షేత్రంగా, శ్రీ మహాలక్ష్మీదేవి అవతరించిన లక్ష్మీస్థానంగా, లక్ష్మి కేంద్రంగా, ప్రసిద్ధమైంది. సుప్రసిద్ధ మైంది. శ్రీ మహాలక్ష్మి ఆవిర్భావ కేంద్రంగా విఖ్యాతమైంది. ప్రఖ్యాతిసంతరించుకుంది. దేవీ భక్తులకు అలమేలుమంగాపురం ఒక అపూర్వమైన వరం. తిరుచానూరు తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తులకు శ్రీవారి దేవేరి దర్శనంతో దివ్యానుభూతులు కల్పించే , కలిగించే అపూర్వమైన దేవీ క్షేత్రం. పద్మావతీ దేవి అవతరించిన దివ్య క్షేత్రం.

తిరుచానూరు లేక అలమేలు మంగాపురం తిరుపతికి సుమారు మూడు మైళ్ల దూరంలో ఉంది. తిరుచానూరునకు తూర్పున వెలసిన వరదరాజ స్వామి మూలంగా ఈ గ్రామం వరదరాజ పురంగా పదహారవ శతాబ్దంలో వ్యవహార ప్రాచుర్యం సంతరించుకొంది. వాదిరాజ పురంగా కూడా వ్యవహరింపబడింది. పురాణకాలంలో మేరు పర్వత శిఖరం పైన బ్రహ్మదేవుని అధ్యక్షతను దేవతాపరిషత్తు సమావేశమైంది. ఆ సమావేశం వేంకటాద్రి వైభవాన్ని సమీక్షించింది. ఆపరిషత్తులో పాల్గొన్న శ్రీ శుక యోగీంద్రుడు ప్రత్యక్షంగా శ్రీ వేంకటాద్రి వైభవాన్ని తిలకించి పులకించాలని ఆశించి తిరుమలకు సమీపించాడు. ఆ సమయంలో శ్రీనివాసుడు తిరుచానూరులోని పద్మసరోవర ప్రాంతంలో తపమాచరింపమని శ్రీ శుకుని ఆదేశించాడు. పద్మ సరోవర తీరంలో శ్రీ శుకుడు తపమాచరించాడు. శ్రీ శుకుడు లక్ష్మి కటాక్షానికి, లక్ష్మీపతి కటాక్షానికి పాత్రుడయ్యాడు పద్మావతీ శ్రీనివాసుల పరిణయ శుభలేఖను శ్రీనివాసునకు సమర్పించిన ధన్యుడు శ్రీ శుకయోగీంద్రుడు. పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణకారకుడై శ్రీశుకుడు లోక కల్యాణ కారణుడయ్యాడు. తాను తపస్సు కావించిన తావులో నూట ఎనిమిది ఇండ్లను శ్రీశుకుడు నిర్మింపజేశాడు. వేదవేదాంగ విధులైన పండిత వర్యులకు ఆ ఉత్తమ గృహాలను దానం కావించాడు. ఆ నూట ఎనిమిది ఇళ్ళ అగ్రహారమే శ్రీశుక నిర్మిత అగ్రహారమే శ్రీశుకపురంగా చరిత్రలో నిలచిపోయింది. శ్రీ కృష్ణ బలరాములను ప్రతిష్ఠించి

పద్మ సరోవర ప్రాంతంలో తపస్సు కావించిన శ్రీ శుకయోగీంద్రుని తపోభూమి శ్రీ శుకపురంగా పౌరాణిక ప్రాముఖ్యం పొందింది. నేడు అది తిరుచ్చోకినూరు (తిరుచానూరు) గా పిలువబడుతోంది. తిరుచుగన్ ఊరుగా కూడా వ్యవహారంలో ఉంది. పూర్వంమునులపూడి, ముండ్లపూడి, యోగులమల్లవరం, యోగిమల్లవరంగా కూడా ప్రసిద్ధమైంది. పశు సంపద కలిగిన ప్రదేశం కావడం వలన పాడిపేటగా ప్రజలు పిలిచేవారు.

## శ్రీ పరాశర క్షేత్రం

శేష పర్వతం సర్వాకృతిని సంతరించుకొన్నట్లే సువర్ణముఖరీనది కూడా నిద్రిస్తున్న సర్వాకృతిలో గోచరిస్తుంది. దాని శిరోభాగంలో శ్రీ కాళహస్తీశ్వర స్వామి నెలకొన్నాడు. కటిప్రదేశంలో అలమేలు మంగాపురంలోని శ్రీ పద్మావతీదేవి వెలసింది. పుచ్ఛముపైన త్రోకపైన శ్రీనివాసమంగాపుర మందలి శ్రీ కల్యాణవేంకటేశ్వర స్వామి ఆవిర్భవించాడు. వరాహ, స్కాంద, భవిష్యోత్తరపురాణాలు సువర్ణముఖరీ నదీ ప్రాశస్త్యం గూర్చి వర్ణించాయి. సువర్ణముఖీ నదీ తీరాన గల శ్రీ అగస్త్యేశ్వరాలయాన్ని, శ్రీ అగస్త్యాశ్రమాన్ని వానితో పెనవేసికొన్న పద్మావతీ శ్రీనివాసుల ప్రణయం, పరిణయం, గూర్చి శ్రీ వరాహ, భవిష్యోత్తరపురాణాలు విపులంగా వివరించాయి. నవవధూవరులైన కల్యాణదంపతులు పద్మావతీ శ్రీనివాసులు కొండ ఎక్కరాదన్న కారణంగా అగస్త్యాశ్రమంలో ఆరుమాసాలు విడిది చేసారు. శ్రీనివాసుని విడిది చేసిన స్థలమే శ్రీనివాసమంగాపురం. శ్రీ రాఘవేంద్ర స్వామి జననీ జనకులు, శ్రీ సొరకాయ స్వామి, శ్రీ మహాయోగిస్వామి, శ్రీవిద్యా ప్రకాశానందగిరి స్వామి ప్రభృతులు సువర్ణముఖీనది వలన తరించారు. ఎందరినో తరింపచేసారు. సువర్ణముఖీ వైభవాన్ని విశ్వవ్యాప్తం కావించారు.

భారతదేశపు మాజీ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు, లోక్‌సభ మాజీ స్పీకర్ అనంత శయనం అయ్యంగారు తమ బాల్యంలో తిరుచానూరు నుండి తిరుపతికి చదువుకోవడానికి వస్తూ వర్షఋతువులో పుస్తకాలు గట్టున పడేసి సువర్ణముఖిలో ఈదులాడిన రోజులను వారి ముసలితనంలో తలచుకుని మురిసిపోయారు. ఇట్టి సువర్ణముఖీ వైభవం, పద్మ సరోవర ప్రాభవం శ్రీ శుకపుర ప్రశస్తిని శతాధికం కావించాయి. శ్రీశుకుని తాతగారైన పరాశర మహర్షి శ్రీశుకపురానికి ఎగువనున్న ప్రదేశంలో తపస్సు కావించారు. అది పరాశర క్షేత్రంగా రూపొందింది. అచ్చట అసంఖ్యాకులైన యోగులు నివశించడం మూలంగా యోగిమల్లవరంగా పేరు పొందింది. నేటి దాని స్థానిక నామం జోగుల మల్లారం. ఆ గ్రామంలో శ్రీ తిప్పలాధీశ్వరముడయ మహాదేవ (నాయనార్) అనే శివాలయం ఉంది.

దానికే పరాశరేశ్వరాలయమని పేరు.

క్రీ.శ.1801 సంవత్సరంలో మన్రో తరువాత మిస్టర్ స్ట్రాటన్ చిత్తూరు ప్రాంతానికి కలెక్టరుగా వచ్చాడు. తిరుమల తిరుపతుల సంప్రదాయాలను, పౌరాణిక చారిత్రికాంశాలను సమాధానాలుగా స్థానికులనుండి సేకరించి సవాల్ – ఇ – జవాబ్‌ను రూపొందించాడు. సువర్ణముఖీనదీ తీరంలో యోగి మల్లవరంలో శ్రీ పరాశర మహర్షి శ్రీ పరాశరేశ్వరుని ప్రతిష్ఠించి తపస్సు చేయడంతో, అక్కడ అనేక మంది యోగులు చేరుట చేత అది యోగిమల్లవరం అయిందని సవాల్ – ఇ – జవాబ్ ప్రకటించింది. యోగిమల్లవరంగా వ్యవహరింపబడడానికి ఒక పౌరాణిక సంఘటన కూడా దోహదం చేసినట్లు భావింపబడుతోంది. అర్జునుడు యోగియై పాశుపతాస్త్రం సంపాదించడంకోసం పశుపతిని ఉద్దేశించి తపస్సు కావించిన తావు యోగివరమైంది. యోగికి వరం ప్రసాదించడానికి కిరాతరూపం వహించిన శివుడు మల్లుడై అర్జునునితో మల్ల యుద్ధం కావించాడు. అర్జునుడు యోగిగా తపస్సు చేసిన ప్రదేశం, శివుడు మల్లయుద్ధ వీరుడై అర్జునునితో పోరాడిన ప్రాంతం కావడం వలన యోగి మల్లుల పేరుతో యోగిమల్లవరంగా యోగికి మల్లుని వరం లభించిన యోగిమల్లవరంగా ప్రాచుర్యం పొందింది. యోగి మల్లవరం అర్జునుని తపోవనం. కిరాతార్జునుల విజయ విహారం యోగిమల్లవరం. గుడిలోని యోగి విగ్రహం, శివలింగం, కిరాతార్జున విజయగాథను నిరూపిస్తున్నాయి. కంచికామకోటిపీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరజయేంద్ర సరస్వతీ స్వామివారు పరాశర క్షేత్రంగా, యోగి మల్లవరంగా విలసితమైన తిరుచానూరును 'తిరు–ఈశానూరు' అని ప్రతిపాదించి ప్రకటించారు. శ్రీ తిప్పాలాధీశ ముడయ మహాదేవ (శ్రీ పరాశరేశ్వర స్వామి), యోగిమల్లన్న వెలసిన దివ్యమైన మహాశైవక్షేత్రమని శ్రీ వారు నిర్ణయించారు. ఇది క్రీ.శ. 8వ శతాబ్దం నాటికి చెందిన శైవ క్షేత్రం. చోళరాజు శ్రీ రాజకేసరి రాజరాజు పాలిస్తూన్న కాలంనాటి క్రీ.శ 1008 సం.పు శాసనంలో ప్రప్రథమంగా పరాశరేశ్వర దేవాలయపు ప్రశంస వ్యక్తమైంది. క్రీ.శ.1073 సం.పు శాసనంలో ముల్లపూడి (మునులపూడి) గ్రామపు ఆదాయం దేవాదాయంగా పరాశరదేవాలయానికి సమర్పింపబడినట్లు పేర్కొనబడింది. క్రీ.శ1094. సం.ములో 128 ఆవుల నెయ్యి ఈ దేవాలయంలో నందాదీపం కోసం సమర్పింప బడినట్లు వివరింపబడింది. శ్రీ పరాశరేశ్వరస్వామి వారి వైశాఖ మహోత్సవ ప్రారంభానికి దీపారాధనకు కావలసిన యేర్పాట్లు క్రీ.శ.1134 సం.ములో విక్రమ చోళుని కాలంనాటి దానశాసనం నిర్ణయించింది. క్రీ.శ 1223 సం.లో స్వామివారికి అర్చనలు అందించే అర్చక కుటుంబాల వారైన పండిత త్రయ కుటుంబాల వారి పోషణ కోసం, యాత్రికజన

నిత్య సమారాధన కోసం శాశ్వతమైన యేర్పాట్లు చేయడంలో భాగంగా పంట భూములు కొనుగోలు చేసి సమర్పించినట్లు శాసన సాక్ష్యం కనపడుతోంది. క్రీ.శ.1225 సం.ములో శ్రీ వీర నరసింహయాదవరాయులు తిరుచానూరు సభ వారు పరాశరేశ్వర దేవాదాయం సక్రమంగా వినియోగించడం లేదనే అభియోగంపైన న్యాయవిచారణకావించి 26 కొలంజుల బంగారం పరాశరేశ్వరాలయపు ధర్మకర్తలకు అందజేయాలని ఆదేశించి పరాశరేశ్వరాలయం సక్రమంగా నిర్వహింపబడడానికి దోహదం కావించాడు. శైవాన్ని అభిమానించిన చోళరాజుల శిల్పకళ పరాశరేశ్వరుని దేవాలయనిర్మాణంలో గోచరిస్తోంది. శ్రీ పరాశరేశ్వర దేవాలయ ప్రాంగణం నిరాడంబరంగాను, పరమ ప్రశాంతంగాను ఉంటుంది. ఈ దేవాలయంలోని నందిమండపం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. గణపతి, దక్షిణామూర్తి, సప్తమాలక, విష్ణు, కుమార, బ్రహ్మ, చండీ, బాల సుబ్రహ్మణ్య, కామాక్షీ, శుక, నవగ్రహ, పరిణయ పార్వతి, నృత్య గణపతి ఆదిగాగల వివిధ పరివార దేవతల విగ్రహాలు ఆ దేవాలయ ప్రాంతంలో దర్శనీయమై భక్తులను అలరిస్తాయి. క్రీ.శ.1248 సం.ములో కుంటుపడిన ఆదేవాలయపు నిర్వహణ నేడు నామమాత్రావశిష్టంగా కొనసాగుతోంది.

## తిరువిలాన్ కోయిల్

ఆనాటి పరాశర క్షేత్ర శోభితమైన తిరుచానూరు, శక వర్షపు 1235 సం.ము నాటి శాసనంలో తిరుక్కుడవూరునాడుగా ప్రసిద్ధమైంది. తిరుచానూరు గ్రామం శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి ఒకనాటి గుడి మాన్యం. క్రీ.శ. 7వ శతాబ్దం నాటికే తిరుచానూరులో శివాలయం ఉన్నట్లు భావింపబడింది. క్రీ.శ. 8వ శతాబ్దం ప్రారంభంలో వైష్ణవదేవాలయం వెలసినట్లుగా ఊహింపబడుతోంది. తిరుపతి పట్టణపు ఉనికి లేని కాలంలో తిరుమలతో సమానమైన ప్రాచీనత గల ప్రాంతంగా తిరుచానూరు విలసిల్లింది. సామాన్యులకేకాదు మాన్యులైన సంపన్నులకు, ప్రజలకేకాదు, ప్రముఖులకు, ప్రభువులకు కూడా తిరుమల రాయుడైన అకొండల కోనేటి రాయుడైన ఏడుకొండల వాని దర్శనం దుర్లభంగా ఉండేది. యాత్రికులు, భక్తులు ఎదుర్కొంటూన్న ఆ సమస్యను పరిష్కరించడం కోసం క్రీ.శ. 826 సం.ములో తిరుచానూరులో తిరువిలాన్ కోయిల్ నెలకొల్పబడింది. అది పల్లవ రాజైన విజయదంతి విక్రమవర్మ కాలంలో నిర్మింపబడింది. తిరుమలలోని శ్రీవారి బింబానికి ప్రతిబింబం ఆ బాలాలయంలో సుప్రతిష్ఠితమైంది. ఇది ఆళ్వారులలో తిరుమంగై ఆళ్వారు కాలంలో వెలసింది. తిరువెంకటనాథుని దేవాలయంలోని దీపంనుండి ఒక అఖండ జ్యోతిని

ప్రతిష్ఠించి తిరుచానూరు శ్రీ వేంకటేశ్వర సన్నిధానంలో స్థాపించారు. ఆవిధంగా తిరుచానూరులో స్థాపింపబడిన శ్రీవారి ప్రతినిధి స్వామి తిరువేంగడత్తుప్పెరుమానడిగళ్ గా వ్యవహరింపబడినట్లు క్రీ.శ.826 నాటి శాసనం ప్రకటిస్తోంది. తిరువేంగడత్తుప్పెరుమానడిగళ్ మూలమూర్తికి ఉత్సవమూర్తిగా తిరువిలాన్‌కోయిల్ పెరుమానడిప్పగల్‌కు ప్రత్యేక ప్రవేశం లభించింది. ఈరెండు మూర్తులకు తోడుగా మూడవమూర్తి తరువాత కాలంలో చేరినట్లు విజయాదిత్యుని నాటి శాసనంలో ప్రకటింపబడింది. ఆమూడవ మూర్తి పేరు తిరుమంత్రశాల పెరుమానడిగల్. ఈ స్వామి మతము మార్పిడి చేయు మందిరంలో కొలువు తీరిన స్వామి. సర్వ వైష్ణవ కార్యక్రమాలకు వైష్ణవ దీక్షా కలాపాలకు ప్రధాన కేంద్రంగా తిరుచానూరు ప్రముఖ పాత్రవహించింది. శైవ ప్రచార కేంద్రంగా పరాశరేశ్వర దేవాలయం నిలిచింది. అళవందారు కాలంలో తిరుమలకు వైష్ణవ దీక్షా శిబిరం తరలింపబడింది. తిరుచానూరులో శైవ వైష్ణవ సిద్ధాంత సౌరభాలు విరజిల్లి ఆరెండు శాఖలు శాంతియుత సహజీవనం సాధించాయి. శైవ వైష్ణవ మత సామరస్యం స్థిరపడింది. వారు సహపంక్తి భోజనాలలో పాల్గొని నూతన ఆదర్శాన్ని సృష్టించారు. తిరుచానూరులో ప్రదక్షిణపు గోడలతో ఇనుపపటకటాలతో మూయబడిన ఒక మండపం తిరువిలాన్ కోయిల్ గా భావింపబడింది. తిరుచానూరులోని శ్రీ వరదరాజ స్వామి వారి శిథిలాలయమే తిరువిలాన్ కోయిల్ కావచ్చని సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీసాధు సుబ్రహ్మణ్యం గారు ఊహించారు. కాగా కొందరు అప్పలయ్యగుంటలోని శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి వారి దేవాలయమే తిరువిలాన్ కోయిల్ గా ప్రకటిస్తున్నారు. అప్పలయ్య గుంట తిరుచానూరుకు సుమారు 5 మైళ్ళ దూరంలో ఉంది. క్రీ.శ. 830 సం.పు శాసనం తిరుచానూరులో శ్రీవారు పూజింపబడినట్లు తెలుపుతోంది. అప్పలయ్య గుంట దేవాలయపు అధికారులు, అర్చక స్వాములు తిరుచానూరును ప్రధాన కేంద్రం గా చేసికోవడం వలన ఆశాసనం తిరుచానూరులో వెలువడింది. అందుచేత అప్పలయ్య గుంటలోని శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి వారి దేవాలయమే తిరువిలాన్ కోయిల్ గా స్వీకరింపబడింది. అప్పలయ్య అప్పు ఉన్నాడని ఎవరో వ్యాజ్యం తెచ్చారుట. తాను అప్పు చేయలేదని శిలపై వ్రాయించి కోనేటిలో వదలితే ఆశిల కోనేటి నీటిలో తేలిందట. అందుకే అప్పులేనయ్య గుంటగా అది పిలువబడి నేడు అప్పలాయిగుంటగా పిలువబడుతోంది. పెండ్లి ఖర్చుకై కుబేరుని వద్ద అప్పు చేసిన శ్రీ వేంకటేశ్వరస్వామి అప్పులస్వామిగా, శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామిగా, అప్పులేనయ్యగుంటలో వెలసాడు.

ఈ అప్పు లేని గుంటకే అన్ఘణ సరోవరం అన్నది నామాంతరం. శ్రీకార్యకర్తలు ( ధర్మకర్తలు) తిరుచానూరు క్షేత్రపాలన కావించారు. క్రీ.శ. 1000 సం.ము తరువాత తిరువిలాన్‌కోయిల్ ప్రశస్తి తగ్గింది. క్రీ.శ. 1248 సం.ము తరువాత పరాశరేశ్వర క్షేత్ర ప్రాముఖ్యం వెనుకపడింది. కాగా తిరుచానూరులోని తిరువిలాన్‌కోయిల్ ను బాల ఆలయంగా వ్యవహరించేవారు. తరువాత వైష్ణవులు తిరువిలాన్ కోయిల్‌ను బాలకృష్ణుని దేవాలయమని ప్రచారం కావించారు. శైవులు బాల సుబ్రహ్మణ్యం ఆలయంగా ప్రకటించారు. ఈవిధంగా తిరుచానూరు పౌరాణిక, చారిత్రక ప్రాముఖ్యతను సంతరించుకొని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుల దృష్టిలో ప్రఖ్యాత క్షేత్రంగా పరిగణింపబడుతోంది.

## లక్ష్మీ ప్రసన్నం – పద్మావతీ సాక్షాత్కారం

"ఈశానాం జగతోస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్కాన్తి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వన్దే జగన్మాతరమ్"

---------శ్రీ లక్ష్మీస్తవమ్ నుండి

శ్రీ మహాలక్ష్మి సకల లోకాలకు రాణి. శ్రీ వేంకటాచలపతి వక్షఃపీఠానికి అలంకారమైన మహారాణి. శ్రీనివాసుని హృదయంలో కాపురం చేస్తూ స్వామి సౌందర్యానికి వింతకాంతి, వినూత్న ప్రకాశం సంతరిస్తోంది. పద్మాసన భూషితురాలు శ్రీలక్ష్మి. ఆమె వేదసన్నుత. శాస్త్ర వినుత. పద్మాలంకృత పాణిపల్లవ సౌందర్య శోభిత. వాత్సల్య వితరణాది సద్గుణ విరాజిత. జగన్మాత యైన శ్రీ మహాలక్ష్మీమాత జనులనుతులకు, స్తుతులకు, ప్రస్తుతులకు యోగ్యురాలైన పాత్రురాలు. ఈవిధంగా శ్రీ వందనంతో, శ్రీనివాస వందనంతో సదా లక్ష్మీదాసులు లక్ష్మీకటాక్ష పాత్రులవుతూంటారు.

శ్రీహరి లక్ష్మి దర్శనం కోసం విరహమూర్తియై, వియోగ మూర్తియై పరితపించి మహాలక్ష్మి విలాసవీక్షణం పొందిన వివరాలు శ్రీ పద్మపురాణమందలి శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యంలో దేవతల దేవదర్శన సంవాదం అందిస్తోంది. వరాహ, భవిష్యోత్తరపురాణాలూ లక్ష్మీనారాయణుల వియోగ, సమాగమాలను గూర్చిన సమాచారాన్ని సమగ్రంగా విపులీకరించాయి. పూర్వకాలంలో నైమిశారణ్యంలోని మునులు త్రిమూర్తుల గుణభేదాల్ని పరిశీలించి, పరీక్షించి సమీక్షించి తమకు నివేదిక అందించమని భృగుమహర్షిని

అర్థించారు. భృగుమహర్షి మునిపరిషత్తు అభ్యర్థనను అంగీకరించి త్రిలోకాలను దర్శించాడు. త్రిమూర్తులను సందర్శించాడు. తనరాక విషయంలో త్రిమూర్తుల ప్రతి స్పందనను భృగు మహర్షి ఆకళింపు కావించుకున్నాడు. బ్రహ్మ దేవుని రజోగుణ ప్రధానునిగా భావించాడు. శివుని తమోగుణ ప్రధానునిగా పరిగణించాడు. సత్యలోకంలో పొందిన అవమానం, కైలాసంలో ఎదుర్కొన్న మానభంగం తలచుకొని అతపోధనుడు, మానధనుడు తపించిన స్థితిలోవైకుంఠంలోనికి ప్రవేశించాడు. శ్రీ హరి భృగువు రాకను గమనించలేదు. భృగువు పిలుపును వినలేదు. కదలలేదు. మారుపలకలేదు. వాణీపతి, గౌరీపతి వద్ద ఎదురైన నిరాకరణను సహించలేకపోయాడు. జరుగుతూన్న నిరాదరణను భరించలేకపోయాడు. భృగుమహర్షిలోని ఆందోళన ఆవేదనగా, ఆవేదన ఆగ్రహంగా రూపుదాల్చింది. జలజాతాసన వాసవాది సురపూజా భాజనమై తనర్చులతాంతాయుధు కన్న తండ్రి వక్ష స్థలాన్ని భృగువు తన్నాడు. భృగువు పాద తాడనంతో శ్రీనివాసుడు లేచి ఆదరంతో మునిని పూజించాడు. భృగువు శ్రీ మహావిష్ణువును శుద్ధ సత్వ గుణ సంపన్నుడని నిర్ణయించుకున్నాడు. తన నిత్య నివాస స్థానమైన శ్రీనివాసుని వక్ష స్థలాన్ని ఆవేశంతో, అహంకారంతో, ఆగ్రహంతో కాలతన్నడాన్ని శ్రీ మహాలక్ష్మి భరించలేక, సహించలేక, క్షమించలేక అవమానంతో, ఆవేదనతో, ఆత్మాభిమానంతో వైంకుఠాన్ని వదలి పాతాళానికి తరలిపోయింది. పాతాళంలో కపిలమహర్షి తపస్సు కావించే స్థలంలోనికి శ్రీ మహాలక్ష్మి ప్రవేశించింది. కపిలమహర్షి శ్రీ మహా లక్ష్మీదేవికి భక్తిపురస్సరమైన ఆహ్వానం అందించాడు. సాదరంగా స్వాగత సన్మాన వచనాలు పలికి సముచితమైన నివాసస్థానం ఆమెకు కల్పించాడు. సభక్తికంగా మహాలక్ష్మికి సేవలు కావించాడు. పాదపూజలు అందించాడు. ఆవిధంగా కపిల మహర్షి పూజలు పొందుతూ శ్రీ మహాలక్ష్మి పాతాళలోకంలో ప్రవాసజీవితం గడుపుతోంది.

శ్రీ పతి శ్రీసతి ఎడబాటును భరించలేకపోయాడు. వైకుంఠంలో నిలువలేకపోయాడు. లక్ష్మిలేని వైకుంఠన్ని ఊహలో కూడా భరించలేకపోయాడు. లక్ష్మీ వియోగానికి లొంగిపోయాడు. లక్ష్మీవియోగ దుఃఖంతో కృంగిపోయాడు. లక్ష్మి ఉన్నచోట కనబడదు. కనిపించిన తావులో ఉండదు. ఇది జనులకు అనుభవమే. ఇదే అనుభవం శ్రీనివాసునకూ ఎదురైంది. శ్రీమహాలక్ష్మి అన్వేషణకోసం నీళాదేవిని వైకుంఠంలో నిలిపి, భూదేవితో భూలోకానికి శ్రీహరి బయలుదేరాడు. శంఖ, చక్ర, గదా, కుంతాద్యాయుధపాణియై శ్రీమహావిష్ణువు బహువిధరూపాలు ధరించి శ్రీ మహాలక్ష్మిఅన్వేషణ సాగించాడు. యాభై ఆరుదేశాలలో విరివిగా సంచారం కావించి

లక్ష్మిని కనుగొనలేకపోయాడు. శ్రీమహాలక్ష్మి కోసం భూమండలమంతా భ్రమించి, పరిభ్రమించి చివరకు కొల్హాపురానికి చేరుకున్నడు. మహాలక్ష్మి అగస్త్య మహాముని చేత కొల్హాపురంలో సుప్రతిష్ఠింపబడింది. చిరకాలం అర్చారూపంలో మహాలక్ష్మి అగస్త్య మహర్షి సమార్చనలు స్వీకరిస్తూ అక్కడ నెలకొంది. మునుల తపోధనుల, భక్తమహాజనుల ఆరాధనలు అందుకొంటూ వారి కోరికలు మన్నిస్తూ, అనుగ్రహిస్తూ కొల్హాపుర మహాలక్ష్మిగా ప్రసిద్ధికాంచింది. కొల్హాపుర మహాలక్ష్మి దర్శనంకావించిన శ్రీమన్నారాయణుడు మునులతో కలసి పది సంవత్సరాల పాటు లక్ష్మీపూజకావించాడు.

"నమస్తేస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే
శంఖ చక్ర గదాహస్తే మహాలక్ష్మి నమోస్తుతే
నమస్తే గరుడారూఢే కోలాసుర భయంకరి
సర్వపాపహరే దేవీ మహాలక్ష్మి నమోస్తుతే
సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరి
సర్వపాపహరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే
సిద్ధిబుద్ధిప్రదే దేవి భక్తి ముక్తి ప్రదాయిని
మంత్రమూర్తే సదాదేవి మహాలక్ష్మి నమోస్తుతే
ఆద్యంత రహితే దేవి ఆదిశక్తి మహేశ్వరి
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోస్తుతే
స్థూల సూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే
మహాపాప హరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే
పద్మాసనస్థితే దేవి పరబ్రహ్మ స్వరూపిణి
పరమేశి జగన్మాతర్మహాలక్ష్మి నమోస్తుతే
శ్వేతాంబరధరే దేవి నానాలంకారభూషితే
జగస్థితే జగన్మాతర్మహాలక్ష్మి నమోస్తుతే" ----మహాలక్ష్మి అష్టకం.

ఈవిధమైన స్తోత్రాలతో సేవింపబడే శ్రీ మహాలక్ష్మి పూజలోనిమగ్నమైన శ్రీహరికి అశరీరవాణి ఈదిగువ సందేశం అందించింది. "శ్రీ మహావిష్ణు దేవా! సుప్రసన్నుడవై వ్యవహరింపుము. నీవు లక్ష్మీదేవి దర్శనానికి అన్వేషిస్తూ నిరీక్షి స్తున్నావు. ఈ కొల్హాపురానికి దక్షిణంగా కృష్ణానది ఉంది. కృష్ణానదికి దక్షిణంగా ఇరవైరెండు యోజనాల దూరంలో సువర్ణముఖరీ నది ఉంది. ఆ సువర్ణముఖరీ నదికి ఉత్తరతీరంలో తపోసంపన్నులకు నిలయమైన ఒక పవిత్ర స్థలంలో సరోవరం నీవు నిర్మించాలి. దేవలోకంనుండి

స్వర్ణకమలాలను తీసికొనివచ్చే యేర్పాటు కావించి, వానిని ఆసరోవరంలో నెలకొల్పాలి. జాజి, విరజాజి, మొగలి, కడిమి, అశోకం, సంపంగి, కరవీరం, మందారం, పొన్న, సురపొన్న, కాంచనం, పొగడ, కొండగోగు, తెల్లగోరింట, పచ్చగోరింట, కృతమాలం ఆదిగాగల నానాసూనవితానాలు, వివిధ కుసుమ వాసనలు సరోవర సమీపంలోని సుందరమైన ఉద్యానవనం నుండి వ్యాపిస్తూంటాయి. ఆ ఆరామం సకల జనమనోభిరామమై వర్ధిల్లుతూంటుంది. పుష్పాలతో లతలతో అలరారుతూంటుంది. అట్టి రమణీయమైన, కమనీయమైన, మహనీయమైన ప్రకృతి శోభ, ఆరామ శోభ నేపథ్యంగా ఉన్న సరోవరతీరంలో ద్వాదశ వర్ష ప్రమాణంగా మహాలక్ష్మిని స్థాపించి, పూజిస్తూ నీవు తపస్సు కావించాలి. త్రికాలలో స్వర్ణకమలాలతో మహాలక్ష్మికి సహస్రనామార్చన విధివిధానంగా నిర్వహించాలి. నీ తపస్సు ఫలిస్తుంది. మహాలక్ష్మి ఆవిర్భవిస్తుంది. స్వర్ణకమలంలో స్వర్ణకమలం వలె పదహారుసంవత్సరాల కన్యవలె నీకు కనబడుతుంది. ఆవిధంగా నీ లక్ష్మీ దర్శన కాంక్ష నెరవేరుతుంది. నీకు లక్ష్మీ ప్రసన్నం కలుగుతుంది".

## అవతరించిన అలమేలుమంగ అభినవరూపం

ఈవిధమైన ఆకాశవాణిని విన్న శ్రీ మహావిష్ణువు గరుడారూఢుడై నిర్దేశిత సువర్ణముఖరీ తీరానికి చేరుకున్నాడు. సువర్ణముఖీ తీరానికి చేరడానికి ముందు వివిధనదులను, గిరులను, ప్రదేశాలను తిలకించాడు. వరాహక్షేత్రాన్ని సేవించాడు. అంజనాద్రిని తిలకించాడు. స్వామి పుష్కరిణిలో స్నానం కావించాడు. రాజురూపం ధరించి గరుడునిపై ఎక్కి స్వర్ణకమలాలతో నిండిన సువర్ణముఖరీ నదీతీరానికి వెళ్ళాడు. ఒక పరమ పవిత్రమైన ప్రదేశాన్ని నిర్ణయించుకొని అచ్చట భూమిని కుంతంతో త్రవ్వి సువిశాలమైన సరోవరాన్ని నిర్మించాడు. విస్తారమైన జలరాసితో ఆసరోవరం సుందరంగా అలరారేటట్లు కావించాడు. వాయుదేవుని దేవలోకానికి వెళ్ళి ఇంద్రుని అనుమతి పొంది దేవలోకం నుండి స్వర్ణకమలాలను సేకరించుకొని రమ్మని శ్రీహరి ఆజ్ఞాపించాడు. వానిని తాను స్వయంగా నిర్మించిన సరోవరంలో స్థాపించి వానితో శ్రీమహాలక్ష్మికి పూజచేయడానికి అవసరమని వాయుదేవునికి వివరించాడు. 'స్వర్ణముఖిలోనే బంగారు తామరపువ్వులు లభిస్తున్నాయి. వానిని సేకరించడానికి దేవలోకానికి ఎందుకు తరలి వెళ్ళాలి' అని వాయుదేవుడు విష్ణుదేవుని ప్రశ్నించాడు. 'నేను కొల్హాపురంలో లక్ష్మీ పూజ చేస్తున్నాను. ఆకాశవాణి నన్ను దేవలోకం

...క్ష్మిని పూజించమనే' హితవచనం వినిపించింది.

వాయువు వెంటనే దేవ లోకానికి వెళ్ళి దేవేంద్రుని అనుమతి పొంది స్వర్ణ కమలాలు తెచ్చి శ్రీ హరికి సమర్పించాడు. వాయువు కొనివచ్చిన స్వర్ణ కమలాలను సరోవరంలో స్థాపించాడు. అవి ఎప్పుడూ ముకుళింపక సదా వికసించి ప్రకాశించడంకోసం కమలమిత్రుని ప్రకాశంకోసం సరోవరపు తూర్పుతీరంలో శ్రీ సూర్య భగవానుని ప్రతిష్ఠించాడు. లక్ష్మిని పొందాలని, లక్ష్మి ప్రసన్నాన్ని అందుకోవాలనే దృఢనిశ్చయంతో, సత్సంకల్ప బలంతో శ్రీ సూర్య నారాయణమూర్తి ముందు భాగంలో శ్రీ మహావిష్ణువు ఆసీనుడై తపోదీక్ష వహించాడు. త్రికాలలలో మహాలక్ష్మిని వేయి తామరపువ్వులతో పూజించేవాడు. క్షీరాన్ని మాత్రమే స్వీకరిస్తూ, నిరాహారుడై, పన్నెండు సంవత్సరాలు శ్రీలక్ష్మీదేవిని ఉద్దేశించి తీవ్రమైన తపస్సు కావించాడు.

ఈవిధంగా రాజు రూపంలో కఠోరమైన తపస్సు కావిస్తూన్న సమయంలో విష్ణుమాయా మోహితుడైన ఇంద్రుడు అప్సరలను పిలిచి అఖండ భూమండలంలో అంజనాద్రి వద్ద కల స్వర్ణముఖీనది ఉత్తర తీరాన అగస్త్య మహాముని ఆశ్రమం ఉంది. దానికి తూర్పున బంగారు తామర కొలను నెలకొంది. ఆ కొలను చెంత సూర్యదేవుని కోవెల ఉంది. ఆ కోవెలముందు ఒక రాజు నాలుగు చేతులతో మూడు లోకాలలోని లక్ష్మిని అందుకోవాలని ఆశిస్తూ తపస్సు కావిస్తున్నాడు. మీ శృంగార భావాలు, చేష్టలు ఆరాజర్షిపై ప్రదర్శించి నృత్యగీతాదులతో మోహింపజేసి తపోభంగం కావించడంలో విజయం సాధించమని" ఆజ్ఞాపించాడు. అంత అప్సరలు వసంతునితో కలసి ఆ సరోవరతీరంలోనికి ప్రవేశించారు. మన్మథుని సహాయంతో తపోభంగం కావించడానికి వారు ముందుకు సాగి వారి ప్రయత్నాలు ముమ్మరం కావించారు. ఆసరోవర ప్రాంతం వసంతశోభతో ప్రభవించింది. పరిమళించింది. ఆదేవలోకపు నాట్యకత్తెలు తమ శృంగార విలాసాలతో తపస్సు కావిస్తున్న రాజును మోహింపజేసి తపోభంగం కావించడానికి శతవిధాలుగా ప్రయత్నించి విఫలమనోరథులై దేవలోకానికి మరలిపోయారు. రాజు తపోభంగంకావించడంలో వారు శృంగ భంగం పొందారు. భగవానుడు నిశ్చలంగ, నిర్మలంగా తన తపోదీక్షను ద్వాదశవర్షప్రమాణంగా విజయవంతంగా కొనసాగించాడు.

శ్రీనివాసుని తపోదీక్ష పదమూడవ సంవత్సరంలోనికి ప్రవేశించింది. అఖిలోకమనోహరమైన, దివ్యసుందరమైన, అపూర్వమైన అతిరమణీయమైన దివ్య సరోవరతీరంలో శ్రీనివాసుడు యమనియమాలతో,కఠోరదీక్షతో సాగించిన ద్వాదశవర్ష ప్రమాణమైన తపస్సు ఫలించింది. ఆకాంక్ష నెరవేరింది. ఆశయం సిద్ధించింది. అది కార్తీక మాసం. శుక్లపక్షం. శుక్లపంచమీ శుభసమయం. ఉత్తరాషాడా నక్షత్రయుక్త శుభముహూర్తం.

ఆనాడు మంగళ ప్రదమైన శుక్రవారం. అది మిత్రముహూర్త శుభ సమయం. అట్టి మాస, పక్ష, తిథి, వార, నక్షత్ర యుక్తమైన పుణ్య సమయంలో పద్మరథంపై, పద్మకాంతులతో, పద్మనేత్రయై,పద్మ వదనయై పద్మ కిరీటధారియై, పద్మశరీరయై, పద్మపాణియై, పద్మ ఊరుయై, పద్మ పాదయై పద్మాలంకృతయై, పద్మసరోవరంలోని మహాపద్మంనుండి పద్మావతీదేవియై శ్రీ మహాలక్ష్మి ఆవిర్భవించింది. ప్రాదుర్భవించింది. శ్రీనివాసుని ముందు సాక్షాత్కరించింది. మధురభావంతో, మనోహరమైన దృష్టితో మాధవుని సాదరంగా వీక్షించింది. ఆదివ్య దృశ్యం చూచిన దేవతలు దేవదుందుభులు మ్రోగించారు. గంధర్వులు గానం చేశారు. అప్సరలు నాట్యం కావించారు. వాణీపతి, పార్వతీపతి, శచీపతీ, సప్తఋషిపుంగవులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాధిపతులు, సనక సనందనాది యోగిపుంగవులు ముక్కోటి దేవతలు ఆ మహాలక్ష్మి కటాక్షం కోసం, ఆ మహాలక్ష్మి దర్శనం కోసం పద్మ సరోవర సమీపంలోని పద్మనాభాశ్రమంలో సమావేశమయ్యారు. విద్యాధరాదులు పూలవానకురిపించారు. దానవులు, నాగులు లక్ష్మి తమనే వరిస్తుందని ఆశించి ఆశాభంగం పొందారు. ప్రణయపారవశ్యంతో, పరమభక్తి పారవశ్యంతో శ్రీ మహాలక్ష్మి అలమేలు మంగగా తన గళసీమలోని తామరపూవుల మాలతో శ్రీనివాసుని కంఠసీమను అలంకరించింది. అతని హృదయసీమను చేరుకుంది. ఈ దివ్య దృశ్యాన్ని వీక్షించిన బ్రహ్మాదిదేవతలు ఆదిగా గలవారు వారి స్థావరాలకు తరలి వెళ్లారు. ఈ విధమైన లక్ష్మీ సాక్షాత్కార వైభవ దృశ్యాన్ని శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళిలోని ఓం అచిరన్నాపరిష్వక్త వక్షసే శ్రీ వేంకటేశాయనమః, ఓం రుక్మాబ్జ సరసీకుల లక్ష్మీకృత తపస్వినే శ్రీ వేంకటేశాయనమః, ఓం లస లక్ష్మీ కరాంభోజదత్త కల్హారకస్రజే శ్రీ వేంకటేశాయనమః అనే నామాలు ఆవిష్కరిస్తున్నాయి. శ్రీనివాసుని తపోదీక్షా విజయాన్ని నిరూపిస్తున్నాయి.

తన హృదయ స్థానం[illegible] పద్మావతిని అలంకరించుకున్న శ్రీనివాసుడు తాను ఏ సరోవర తీరంలో తపస్సు కావించి, తపోసిద్ధుడయ్యాడో, ఆ సరోవరాన్ని ఉద్దేశించి "నా మనోవాంఛితాన్ని నెరవేర్చిన సరోవరానివి నీవు. లక్ష్మీపూజకు మూడువేళలా సహస్రాధిక స్వర్ణకమలాలు సమకూర్చి నాకు సహకరించావు. నీ తీరంలో నేను తపస్సు కావించి పద్మావతిని పొందగలిగాను. నీవు నేటినుండి త్రిలోకాలలో పద్మావతీ పద్మ సరోవరంగా ప్రసిద్ధిని పొందుతావు. నీలో స్నానం చేసిన వారు పాప విముక్తులవుతారు. కోరిన కోరికలు పొందుతారు". అని వరప్రదానం కావించాడు. శ్రీనివాసుని వక్షస్థలంలో నిలచివెలసిన అలమేలుమంగ అభినవ రూపం చూస్తున్న స్వామివారి కన్నులు క్రొత్త

అందాలతో వెలిగిపోతున్నాయి. శ్రీవారి నేత్రాలలో అమ్మ అలమేలు మంగమ్మ ప్రతిబింబం ప్రతిఫలించిన మూలంగా ముగ్ధ సుకుమార సౌందర్య సంపదను సంతరించుకున్నాయి. శ్రీనివాసుని హృదయంలో నేకాదు, వదనంలోనేకాదు, దృష్టిలోకూడా అలమేలు మంగ అభినవరూపం కదలుతూ భక్తుల హృదయ ఫలకంలో ఆమె ప్రతిరూపం అభివ్యక్తమవుతూ మధురమైన దివ్యానుభూతిని కలిగిస్తుంది.

"అలమేలుమంగ నీ – అభినవరూపము
జలజాక్షు కన్నులకు – చవులిచ్చేవమ్మా
గరుడాచలాధీశు – ఘనవక్షముల నుండి
పరమానంద సంభరితవై
నెరతనములు చూపి – నిరంతరము నాథుని
హరుషించగ – చేసితి గదమ్మా
శశికిరణములకు – చలువల చూపులు
విశదముగా మీద –వెదచల్లుచు
రసికత కెంపున కరగించి యెప్పుడునీ
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా
రట్టడి శ్రీ వేంకట రాయనికి నీవు
పట్టపురాణివై పరగుచు
వట్టిమాకులిగిరించు వలపుమాటల విభు
జట్టిగొని వురమున సతమైతివమ్మా ––––అన్నమయ్య

## వేదవతియే పద్మావతి
## పద్మావతీ పరిణయం

శ్రీనివాసునకు తిరుచానూరులో పద్మసరోవరతీరంలో ఏ పద్మావతీదేవి సాక్షాత్కరించిందో దానికి నిదర్శనంగా నేడు తిరుచానూరులో పద్మావతి సుప్రతిష్ఠితమై భక్తులకు తన దర్శన భాగ్యం ప్రసాదిస్తూ వారి సేవలను, పూజలను అందుకొంటూంది. ఇది పద్మావతీదేవి ఆవిర్భావం గూర్చిన పద్మ పురాణాంతర్గతగాథ. వరాహ, భవిష్యోత్తరపురాణాలలో కూడ పద్మావతీ వృత్తాంతం ప్రస్తావితమైంది. ఋషుల యజ్ఞఫల సమర్పణకోసం భృగువు త్రివ ర్తులను పరీక్షించాడు. ఫలితంగా లక్ష్మీనారాయణులకు

వియోగం కలిగింది. లక్ష్మి అన్వేషణ లో శ్రీనివాసుడు తిరుమలపై వల్మీకగతుడయ్యాడు బ్రహ్మ గోరూపం, శివుడు గోవత్సరూపం ధరించగా లక్ష్మి ఆగోవత్సాలను చోళరాజుక విక్రయించింది. ఆగోవు శ్రీనివాసుని తన క్షీర ధారలతో పోషించేది. ఇది పసికట్టిన గోపాలుడు గోవు శ్రీనివాసునకు క్షీర సేచనం కావిస్తూండగా చూచి గోవుపైకి తన చేతిలోని గొడ్డలిని విసరగా అది శ్రీనివాసునకు తగిలి గాయమైంది. ఆగాయపు రక్త స్రావం చూచి గోపకుడు మరణించాడు. అప్పుడు చోళభూపతిని శ్రీనివాసుడు పిశాచరూపం ధరించమని శపించాడు. చోళరాజు ప్రార్థింపగా 'నీవు ఆకాశరాజువై జన్మించిపద్మావతినిచ్చి నాకు కల్యాణం కావిస్తావు. నీవు ఆకాశరాజువై జన్మించడానికి ముందునీ పిశాచరూపం తొలగి పోతుంది.' అని శ్రీనివాసుడు అనుగ్రహించాడు.

అది త్రేతాయుగం. అది పరమ పవిత్రమైన హిమవత్పర్వత ప్రాంతం. అందుపైన ఒక తపోవనం. ఆతపోవనంలో కుశధ్వజుడనే ఋషి వేదమార్గంలో శ్రీ హరి ప్రీతికోసం తపస్సుకావిస్తున్నాడు. అతడు వేదాధ్యయనం చేస్తూన్న సమయంలో వేద మాత అతనికి ఒక పుత్రికను ప్రసాదించింది. అతడు ఆమెకు వేదవతి అని పేరుపెట్టాడు. ఆమె పెరిగి పెద్దదైంది. ఆమె సౌందర్యం చూచి దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుషాదులు మోహించారు. ఆమెను వివాహం కావించుకోవాలని భావించారు. వారు కుశధ్వజునితో ఆవిషయం ప్రస్తావించారు. అతడు వారి కోరికను సున్నితంగా తిరస్కరించాడు. పితృ దేవునికి వేదవతి నిత్యం పాదసేవలు కావించేది. నిత్యం అతడు "శ్రీపతి నీ పతి అవుతాడు" అంటూ వేదవతిని దీవించేవాడు. దంబుడనే రాక్షసుని దృష్టి వేదవతిపై పడింది. ఆరాక్షసుడు వేదవతిని పొందాలని నిశ్చయించుకొన్నాడు. కుశధ్వజుని కలసికొన్నాడు. తనకు వేదవతితో వివాహం కావించమన్నాడు. "అసురాంతకుడైన శ్రీ కాంతునకే ఆమె జీవితం అంకితమైంది. నీవంటి రాక్షసునకు ఆమె భార్యకాదు" అని కుశధ్వజుడు రాక్షసుని ఆపేక్షను ఉపేక్షించాడు. ఆమాటలు విన్న దంబుడు కుశధ్వజుణ్ణి సంహరించాడు. వేదవతి తండ్రి అకాలమరణానికి చింతించి, పితృదేవుని సత్సంకల్పం నెరవేర్చాలనే స్థిర సంకల్పంకావించుకొంది. తండ్రి దీవెన ఫలించాలని భావించుకొంది. శ్రీనివాసుని తనమనోనాయకుని కావించుకోవాలని నిశ్చయించుకుంది. అందుకోసం తపించి, పరితపించి ఆ ఆశయసాధన కోసం తపస్సు కావించింది.

నాలుగు తలలున్న బ్రహ్మను మెప్పించి, మూడుకన్నులున్న శివుని ఒప్పించి దశకంఠుడు వరాలు, విభూతులు పొందాడు. సురనాయకుడైన మహేంద్రుని జయించాడు. కుబేరుణ్ణి దోచుకొన్నాడు. అతని పుష్పక విమానాన్ని అపహరించి

స్వంతంకావించుకొన్నాడు. లంకాధిపతి నిరంతరం పుష్పకవిమానంలో ఆకాశసంచారం చేస్తూ విహారయాత్రకావిస్తూ మునులకు తపోభంగం, బలవంతులకు ప్రాణభంగం, పతివ్రతలకు మానభంగం చేస్తూ వినోదించేవాడు. ఇట్టి రాక్షస వినోదం అనుభవిస్తూన్న రావణుని దృష్టికి తీవ్రంగా తపస్సు చేస్తున్న మహా సౌందర్యవతి వేదవతి గోచరించింది. రావణుని పుష్పకవిమానం వేదవతి ఆశ్రమభూమిలో నిలచింది.

"ఇది నిర్జన పర్వత ప్రాంతం. సాంద్రారణ్యం. నావంటి వారిని అనుగ్రహించవలసిన సౌందర్యదేవతవు నీవు. నీవు ఏ దేవత అనుగ్రహం కోసం తపస్సు కావిస్తున్నావు? నీవు కుమారివా? శ్రీమతివా? నీ తల్లి తండ్రులెవరు? నీ చరిత్ర...."అంటూ విమానం దిగిన రావణాసురుడు వేదవతిపై ప్రశ్నల వర్షం కురిపించాడు.

"నేను ఒంటరిని. కన్యను. నాతండ్రి కులద్విజుడు. నా పితృదేవుని వేదగానంలో జన్మించాను. వేదవతిని. తండ్రి నన్ను శ్రీనివాసునకు సతిని కమ్మని దీవించాడు. ఆ శ్రీపతిని పతిగా పొందాలని తపస్సుచేస్తున్నాను." అని వేదవతి తన సమాచారం సమగ్రంగాను సమాధానంగాను రావణునకు తెలిపింది.

"దయచూపనిశ్రీపతి కోసం, శ్రీపతిని పతిగా కావించుకోవడంకోసం నీవు తపస్సు చేయడం వ్యర్థం. అవివేకం. నిన్నుగాఢంగా ప్రేమించే ఈ లంకాధిపతిని ఆ శ్రీపతిగా భావించి నీ పతిగా స్వీకరించడం నీకు సర్వదా శ్రేయస్కరం. అదే వివేకవంతమైన నిర్ణయం"అన్నాడు రావణుడు. 'నీవు శ్రీహరిని నిందించడం నేను సహించను. శ్రీపతి లోకాధిపతి. నీవు కేవలం లంకాధిపతివి. శ్రీనివాసుని పవిత్రమైన నామాన్ని స్మరించడానికి నీవు అనర్హుడవు. నీవు వచ్చిన దారినే వెళ్ళడం నీవు చేయవలసిన పని. తక్షణం నీవు నిష్క్రమించవలసిందిగా హెచ్చరిస్తున్నాను. అంటూ వేదవతి రావణుని మందలించింది. అవమానభారంతో ప్రతీకారం తీర్చుకోవడానికై రావణుడు తన ఎడమ చేతితో వేదవతి శిరోజాలను పట్టుకున్నాడు. ఆమె శ్రీనివాసుని స్మరించుకుని తనకుడి చేతిని కత్తిగా మార్చుకొని రావణుడు బిగపట్టిన తన తలవెంట్రుకలను ఖండించింది. వేదవతిని పరాభవించే ప్రయత్నంలో రావణుడే పరాభవితుడయ్యాడు. తాను పొందిన అవమానాన్ని ఆగ్రహంగా మార్చుకుని రావణుడు వేదవతిని బలవంతంచేయడానికి పూనుకున్నాడు. ఆ ప్రయత్నంలో ముందుకు వెళ్ళగా ఆమె తన తపోమహిమతో రావణుని గమనాన్ని నిరోధించడానికి అగ్నిని జ్వలింపచేసింది. అతడు వజ్రాయుధంతో మంటలను చల్లారుస్తూ ఆమెను సమీపించాడు. 'నేను అబలను. నాకు తపోభంగం కావించావు. నన్ను మానభంగానికి గురిచేయాలని చూస్తున్నావు. నావంటి అబల మూలంగానే మహా బలవంతుడవైన నీకు ప్రాణభంగం

కలుగుతుంది. ఇది తథ్యం' అని వేదవతి కఠినంగా రావణుని శపించి తాను సృష్టించుకున్న అగ్నిలో ప్రవేశించి అదృశ్యమైపోయింది. రావణుడు భంగపడ్డాడు. ఆశా భంగంతో ఆకాశంలోనికి పుష్పకవిమానంతో అదృశ్యమయ్యాడు. అగ్ని హోత్రుడు తనలో ప్రవేశించిన వేదవతిని తన భార్య స్వహాదేవి రక్షణలో ఉంచాడు. ఆవిధంగా ఆదంపతులు ఆమె సంరక్షణ వహిస్తూన్నారు.

అయోధ్యా పాలనం చేయవలసిన రాముడు పితృవాక్యపాలనం కోసం అరణ్యపాలనానికి పయనమయ్యాడు. సీతా, సౌమిత్రి అతణ్ణి అనుసరించారు. మారీచుని పైడిలేడిని చేసి మాయచేసి సీతను రావణుడు లంకకు ఎత్తుకొని పోతున్నాడు. అగ్ని దేవుడు రావణుని ఆపి ' నిజమైన సీత నావద్ద ఉంది. మాయతో మారీచుని మాయలో నీవు మాయసీతను తీసికొని పోతూ నీవు మాయకులోనై మోసపోతున్నావు. ' అని హితవు చెప్పాడు. తన సంరక్షణలోని వేదవతి చేత సీతారూపం ధరింపజేసి ఆమెను రావణునితో లంకకు సాగనంపాడు. అసలు సీతకు స్వాహాదేవి వద్ద రక్షణ కల్పించాడు. రాముడు రావణ సంహారం కావించి సీతను అగ్నిప్రవేశంకావింపజేసాడు. అగ్నిహోత్రుడు ఇద్దరు సీతలను రాముని ముందు నిలిపి నిజమైన సీతను స్వీకరించమన్నాడు. శ్రీరాముడు నిజమైన సీతను పోల్చుకొని ఎంచుకొనలేకపోయాడు. అప్పుడు అగ్ని మాయాసీతను వేదవతిని కావించాడు. 'వేదవతి సీతకోసం త్యాగం చేసి లంకలో బాధలు పడింది. శ్రీరామా! నీవు వేదవతికి వరం అనుగ్రహించాలి' అని అగ్ని శ్రీరాముని ప్రార్థించాడు. 'నాథా! నానిమిత్తంగా వేదవతి రావణుని వేదనలకులోనైంది. ఈవేదవతి నీకు చెలి, సీతకు చెల్లెలు కావాలి. శ్రీరామా! నీవు ఆవిధంగా వేదవతిని అనుగ్రహించాలి.' అని సీతా దేవి వేదవతిని వివాహం కావించుకొనమని శ్రీరాముని అర్థించింది. ఇరవై ఎనిమిదవ కలియుగంలో వేదవతి సీతవలె భూజాతగా అవతరిస్తుంది. పద్మావతియై ఆకాశరాజునకు యజ్ఞ భూమిలో లభిస్తుంది. పుత్రికగా గగన భూపాలుని రాజ ప్రాసాదంలో ప్రవేశిస్తుంది. నేను శ్రీనివాసునిగా వేంకటాచలంపైన అవతరిస్తాను. వేదవతి చేసిన తపస్సునకు ఫలం ఆనాడు లభిస్తుంది. ఈ నాటి సీతాదేవి అభీష్టం ఆనాడు పద్మావతీదేవి పరిణయరూపంలో నెరవేరుతుంది. అగ్నిహోత్రుని ఆశయం శ్రీనివాసుని కల్యాణమై సిద్ధిస్తుంది. పద్మావతీ శ్రీనివాసుల దివ్యవివాహమహోత్సవం లోకకల్యాణానికి నాందీ గీతం పాడుతుంది.'

అని శ్రీరాముడు వేదవతికి వరం ప్రసాదించాడు. సీతకు ప్రీతికలిగించాడు. అగ్నిని ఆవిధంగా అనుగ్రహించాడు.

# పద్మావతి పరిణయం

బ్రహ్మ తండ్రియైన విష్ణుమూర్తి శాపంమూలంగా చోళభూపతి పిశాచ పతియై సుధర్ముని పుత్రునిగా గగనపతియై జన్మించాడు. అతడే ఆకాశరాజు. పూర్వం మాధవుడు అధర్మవర్తునుడై, శీలహీనుడై, ఉన్మత్తుడై పోయాడు. అతడు తిరుమలయాత్రకువచ్చి సుదర్శన తీర్థంలో స్నానం కావించి ఉన్మత్తస్థితినుండి విముక్తుడయ్యాడు. అతడు ఏడుకొండలూ ఎక్కడం ప్రారంభించాడు. అతని శరీరం నుండి అగ్ని జనించి అతని పాపాలను దహించివేసింది. ఆఅపూర్వమైన దృశ్యం చూచిన దేవతలుపుష్పవృష్టి కురిపించారు. విష్ణుమూర్తి కుమారుడైన బ్రహ్మదేవుడు 'మాధవా! నీవు తిరుమల యాత్రద్వారా సర్వపాపాలను తొలగించుకున్నావు. శ్రీనివాస సేవాభాగ్యం వలన దర్శన విశేషంవలన ముందు జన్మలో నీవు ఆకాశరాజువై పుట్టి తొండమండలాన్ని నారాయణపురం రాజధానిగా చేసికొని సుప్రసిద్ధుడౌతావు. జగన్మాత మహాలక్ష్మి పద్మావతియై నీకు పుత్రికగా లభిస్తుంది. పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణం కావించినీవు ధన్యుడవవుతావు' అంటూ మాధవునకు పద్మవదనయై వరమనుగ్రహించాడు. శ్రీనివాసుని శాపం మూలంగాను, బ్రహ్మదేవుని వరం మూలంగాను ఆకాశరాజు ఉద్భవించాడు. అతని సహధర్మచారిణి ధరణీదేవి సంతాన భాగ్యం కోసం బృహస్పతి ఉపదేశంతో ఆకాశరాజు పుత్రకామేష్ఠియాగం సంకల్పించాడు.

ఆకాశరాజు నారాయణపుర సమీపంలో ప్రవహించే అరణీ నదీ తీరంలో యజ్ఞవాటిక ప్రారంభించాడు గగన భూపతికి యజ్ఞ భూమి సంస్కరణలోనే యజ్ఞఫలం లభించింది. యజ్ఞ భూమిని బంగారు నాగలితో దున్ని నవధాన్యాలు జల్లుతున్న భూమిలో ఆకాశరాజునకు అపూర్వ సౌందర్య శోభితమైన అనన్య సామాన్య సౌరభభరితమైన సహస్రపత్రకమలం సాక్షాత్కరించింది. ఆ మహాపద్మంలో పద్మశయ్యపై పద్మగాత్రయైన ఒక శిశువు కనబడింది. పద్మపాదయై పద్మ ఊరుయై, పద్మ శరీరయై, పద్మ పాణియై, పద్మాలంకృయై, పద్మ నేత్రయై, పద్మ కిరీటధారయై, పద్మ శయ్యపై ఆబాలిక మహా పద్మంలో గోచరించింది. ఆరాజ దంపతులు ఆ పద్మంలో లభించిన బాలికకు పద్మావతి అను నామకరణం చేసి పెంచి పెద్ద చేసారు. శ్రీనివాసుడు శ్రీవరాహస్వామి తనకు వేంకటాచలముపై కేటాయించిన పాదశత పరిమితమైన స్థలంలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నాడు. వకుళాదేవి శ్రీనివాసుని తన తనయునిగా పోషించసాగింది. శ్రీనివాసుడు ఆకాశ ఉద్యానవనంలో పద్మావతిని తిలకించాడు. వారు పరస్పరం

ప్రేమించుకున్నారు. శ్రీనివాసుని మనోగతం గ్రహించిన వకుళ వివిహారాయభారం కాపించి ధరణీ దేవీ అంగీకారం పొందింది. పద్మావతీ శ్రీనివాసుల వివాహా నిశ్చయం కాపించడంలో కృతకృత్యురాలైంది. శ్రీ శుకుడు పద్మావతీ శ్రీనివాసుల వివాహం కావించమని ప్రోత్సహించాడు. కలియుగాన విళంబి సంవత్సర వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారం నాడు ఉత్తర ఫల్గుణీ నక్షత్ర యుక్త శుభసమయంలో ప్రాద్దుకుంకిన 13 ఘడీయలకు పద్మావతీ పరిణయానికి సుమూహూర్తం నిశ్చయమైంది. పద్మావతి ది అత్రి గోత్రం. మృగశీర్ష జన్మ నక్షత్రం. శ్రీనివాసునిది వశిష్ఠ గోత్రం. జన్మ నక్షత్రం శ్రవణం. నవ వధూవరులైన పద్మావతీ శ్రీనివాసులకు మిత్ర పరమ మిత్ర తారలయ్యాయి. ఆ శుభ లగ్నానికి పద్మావతీ శ్రీనివాసుల వైవాహిక మహోత్సవం వైభవోపేతంగా నిర్వహింపబడింది. శ్రీ పద్మావతీ పరిణయం పుడమి తల్లి ప్రమోదానికి నాంది. పునాది. జనతకు, జగతికి శాంతిని ప్రశాంతిని ప్రసాదిస్తోంది.

"గరుడధ్వజం బెక్కె కమలాక్షు పెండ్లికి
పరుషలదివో వచ్చె పైపై సేవించను
పాడిరి సోబానదే భారతియు గిరిజయు
ఆడిరి రంభాదులైన అచ్చర లెల్ల
కూడిరి దేవతలెల్ల గుంపులైశ్రీ వేంకటాద్రి
వేడుకలు మీరగ శ్రీ విభుని పెండ్లికిని.
కురిసె పువ్వుల వాన కుప్పలైయెందు చూచిన
మొరసె దేవదుందుభి మ్రోత లెల్లను
బెరసె సంపదలెల్ల పెంటలై శ్రీ వేంకటాద్రి
తిరమై మించిన దేవదేవుని పెండ్లికిని
వేసిరి కానుకలెల్ల వేవేలు కొప్పెరల
పోసిరదె తలబాలు పుణ్యాసతులు
ఆసల శ్రీవేంకటేశు అలమేలుమంగ తాను
సేసలు వెట్టినయట్టి సింగారపు పెండ్లికి" ----అన్నమయ్య

"పసిడి యక్షంతలివెపట్టదో వేగమే రారో
దెసల పేరంటాండ్లు దేవుని పెండ్లికిని
శ్రీవేంకటేశ్వరునికి శ్రీమహాలక్ష్మికి
దైవికపు పెండ్లి ముహూర్తము నేదు

కావించి భేరులు మ్రోసె గరుడధ్వజం బెక్కె
దేవతలు రారో దేవుని పెండ్లికిని
కందర్ప జనకునికి కమలాదేవికి పెండ్లి
పందిరి లోపల తలబాలు నేడు
గందమూ విడెమిచ్చేరు కలువడాలు కట్టిరి
అందుక మునులు రారో హరి పెండ్లికిని
అదె శ్రీవేంకటపతికి అలమేలు మంగకును
మొదలి తిరుణాళ్ళకు మొక్కేము నేడు
యెదుట నేగేరు వీరేయిచ్చేరు వరములివె
కదలి రారో పరుషఘనులు పెండ్లికిని" ----- అన్నమయ్య

పద్మావతీ పరిణయం ఆత్మ కల్యాణం, సమాజ కల్యాణం, లోక కల్యాణం, ప్రసాదిస్తుందని అన్నమయ్య భావించాడు. సంభావించాడు. ఆకల్యాణం దర్శించడం పుణ్య ప్రదమని అన్నమయ్య ప్రకటించాడు. ఆ పద్మావతీదేవి పెండ్లి వేడుకల్ని చూచి మనస్సులను పండించుకోమని, కన్నుల పండుగ కావించుకోమని అన్నమయ్య మనల్ని ఆహ్వానించాడు. నవవధూవరులైన ఆపద్మావతీ శ్రీనివాసమూర్తుల దివ్య సుందర స్వరూపాలను, మంగళమోహన రూపాలను అన్నమయ్య మనకన్నుల ముందర సాక్షాత్కరింపజేసి తాను ధన్యుడయ్యాడు. మనలను ధన్యులను కావించాడు. తిరుచానూరులో వెలసిన పద్మావతీదేవి పవిత్ర గాథ పురాణాలలో ప్రకటితమైన వివరాలు గ్రహించాము. ఈవిధమైన అలివేలుమంగాపురిపు అలివేలు మంగమ్మ తల్లి అమృతగాథ భక్తులకు స్మరణీయం. అమృతవల్లిని, ఆకల్పవల్లిని, ఆ పలుకు తేనెల తల్లిని దర్శించుకోవడం, సేవించుకోవడం మనకు సదా అనుసరణీయం.

## అలమేలు మంగ అండనుండే శుక్రవారపు సొగసులవాడు

శ్రీనివాసమూర్తి చిరుదరహాసాలు చిందించే సుందరమూర్తి. సాలగ్రామ శిలామూర్తి శ్రీ వేంకటరమణమూర్తి. ఆగమనియమాలకు, ప్రతిమా లక్షణాలకు అతీతమైన మహోన్నతమైన విగ్రహం శ్రీనివాసుని విగ్రహం. శ్రీవారి మూర్తి **9-10** అడుగులు మధ్య ఎత్తు ఉంటుంది. స్వామి వారి వక్షస్థలపు కొలత **36``-40``** మధ్య ఉంటుంది. నడుము

కొలత 24``-27``మధ్య ఉంటుంది. ప్రపంచంలో అజంతాలోని మొదటి గుహలోని బోధి సత్వ పద్మ పాణి చిత్రం మహాసౌందర్యవంతమైనదిగా పరిగణింపబడుతోంది. ఆ సౌందర్యాన్ని మించిన మహాసౌందర్యంతో శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహం అలరారుతోంటూంది. శ్రీ వారి దివ్య మనోహరమూర్తి వంటి మూర్తి భారతదేశంలోగాని, ప్రపంచంలోని ఏ దేశంలోగాని కానరాదు. శ్రీవారి సర్వావయవాలకు, ఆయుధాలకు అలంకృతమైన స్వర్ణాభరణాలు, రత్నాభరణాలు, వజ్రాభరణాలు, నవరత్నాలంకారాలు స్వామివారి విగ్రహగత సౌందర్యంతో సహస్రాధికమైన సౌందర్య సంపదను సంతరించుకొంటున్నాయి. శ్రీ వత్సలాంఛనయుక్తమైన శ్రీనివాసప్రభుని దక్షిణవక్షస్థలంలో విగ్రహగతంగా ఆవిర్భవించిన శ్రీ మహాలక్ష్మి దేవి దివ్యాకృతితో వామవక్షస్థల భాగంలో అమర్చబడిన బంగారు అలమేలు మాంగాంబికాదేవి సుందరాకృతితో శ్రీ వేంకటేశ్వరుడు ఒకపరికొకపరి ఇయ్యారమై మొకమునన్ కళలెల్లా మొలచినట్లు భక్తజన మనోహరుడై నేత్ర పర్వం కావిస్తూంటాడు.

"మెఱయ శ్రీ వేంకటేశ మేన సింగారముగాను
తఱచయిన సొమ్ములు ధరియింపగా
మెఱగు బోడి అలమేలు మంగయు తాను
మెఱపు మేఘముగూడి మెఱసినట్లుండె" ------- అన్నమయ్య

ఆపుత్తడిబొమ్మ అలమేలు మంగమ్మ స్థిరసౌదామనిగా శ్రీనివాసుని హృదయంనుండి దివ్యకాంతిని భక్తులపై ప్రసరిస్తూ వారి హృదయాలను స్థిరమైన జ్ఞాన దివ్య జ్యోతుల కాంతులతో నింపుతూ జ్ఞానమార్గంలో ముందుకు నడిపిస్తూంటుంది.

"ద్విభుజా వ్యూహలక్ష్మీః స్యాద్ధ పద్మాసన ప్రియా
శ్రీనివాసాంగ మధ్య సతతాం కేశవ ప్రియా"

శ్రీ మద్రామానుజాచార్యులవారు క్రీ.శ. 1017-1137సంవత్సరాల మధ్య 120 సంవత్సారాలు జీవించారు యతిరాజుల వారు శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవాలయపు సంపద అభివృద్ధి పొందడంకోసం కరద్వయంతో కూడిన వ్యూహలక్ష్మి అనే అలర్మేల్మంగైనాచియారు అనే బంగారు విగ్రహాన్ని చిత్తానక్షత్రయుక్త రత్నమంజరికా యోగంతో కూడిన శుద్ధద్వాదశీ శుక్రవారం నాడు శ్రీనివాస ప్రభువు వక్షస్థలంలో అమర్చి అర్చనలు కావించారు. వైఖానసాగమ ఆనంద సంహితాను సారంగా స్వామివారికి శుక్రవారపు అభిషేకం రామానుజులు నిర్దేశించారు. ఈ సమాచారం 'తిరుమలై ఒళుహు' లేక తిరుపతి ఐతిహ్యమాల' వలన తెలుస్తోంది. ప్రతీ శుక్రవారం తిరుమలపైన శ్రీ

వేంకటేశ్వరస్వామివారికి తత్‌దక్షిణవక్షస్థల నిత్య వాసరసికురాలైన శ్రీదేవికి (శ్రీలక్ష్మీదేవికి) అభిషేకం పంచసూక్తాలు, పంచోపనిషత్తులు పఠిస్తూండగా మనోహరంగా నిర్వహిపబడుతుంది. శ్రీనివాసుని పాదాలకు, వక్షస్థలంలోని శ్రీభూదేవులకు నమస్కరించి అర్చకస్వాములు అనుమతి పొందుతారు. శ్రీవారి దక్షిణవక్షస్థలంలో విగ్రహగతంగా నెలకొన్న శ్రీదేవితో శ్రీ రామానుజాచార్యులవారు శ్రీనివాసుని వక్షస్థలపు వామ భాగంలో అమర్చిన అలమేలు మంగ (భూదేవితో) శుక్రవారపు సొగసులస్వామి అభిషేకాన్ని అందుకుంటాడు. పరిమళద్రవ్యాలతో, ఆకాశగంగతో, గోక్షీరంతో, బంగారుబావిలోని జలంతో శ్రీవారికి విధివిధానంగా అభిషేకం జరుగుతుంది. తరువాత వెండిగిన్నెలో నీళ్ళలో కలిపిన పసుపుతో శ్రీవారి వక్షస్థలంలోని శ్రీమహాలక్ష్మికి అభిషేకం జరుగుతుంది. శ్రీభూదేవులతో శ్రీవారిని ఆతిరుమంజన సమయంలో దర్శించుకోవడం మరువలేని మదురానుభూతి. ఆదివ్య దృశ్యంలో భక్తులకు కన్నులలో వైకుంఠం, కలియుగవైకుంఠం ప్రత్యక్షమవుతుంది. అభిషేకానంతరం భక్తులకు శ్రీవారి నిజపాద దర్శనం లభిస్తుంది.

"కంటి శుక్రవారము గడియలేడింట
అంటి అలమేల్మంగ అండనుండే స్వామి" అనే అన్నమయ్య సంకీర్తనం భక్తుల హృదయాలలో ధ్వనించి ప్రతిధ్వనిస్తుంది.

భక్తుల నిజపాదదర్శనానంతరం కులశేఖర పడివద్ద తెర పడుతుంది. స్వామివారికి ఊర్ధ్వపుండ్రధారణం, వస్త్రాలంకరణం, ఆభరణ సమర్పణం జరుగుతాయి. అప్పుడు శ్రీవారి వక్షస్థలంలోని అలమేలు మంగకు అభిషేకం జరుగుతుంది. ధ్రువమూర్తినుండి వేరుచేసిన తరువాత అలమేలు మంగకు అభిషేకం జరుగుతుంది. అభిషేకానంతరం బంగారు అలమేలుమంగను శ్రీవారి వక్షస్థలంలో యధాతథంగా అలంకరిస్తారు. పిమ్మట స్వామివారికి కిరీటం అలంకరిస్తారు. బంగారు అలమేలుమంగ సవరింపు, అభిషేకం, అమరిక భక్తులు దర్శింపలేరు. తెరమరుగున రహస్యంగా ఇవి జరుగుతాయి. శ్రీవేంకటేశ్వరస్వామి వారికి తోమాల సేవ, అర్చన నివేదన జరుగుతాయి. కోటి సూర్య ప్రభలతో కూడిన శ్రీవారి దర్శనం భక్తులకు లభిస్తుంది. శ్రీలక్ష్మిని శ్రీ అలవేలుమంగను సమదృష్టిని చూస్తూ తన వక్షస్థలంలో నిలుపుకొన్న శ్రీనివాసుడు సమదృష్టి భంగిమతో భక్తులను అలరిస్తూంటాడు. శ్రీ భూదేవుల దయాదృక్కులు భక్తులపై ప్రసరిస్తూంటాయి. "పులుకడిగిన యట్టి పురుషోత్తముడు వేడే, ఎలమి నారతులు మీరెత్తరే దేవునికి", మని చెప్పుదుమమ్మ యీతని సౌభాగ్యము, కోమలపు జవ్వనము గుఱుతైనట్టుండె' అంటూ అన్నమయ్య శుక్రవారపు అభిషేకపు సొగసుల వాడైన ఏడుకొండలవాడిని గూర్చి సంకీర్తనలు ఆలాపించాడు.

భోగశ్రీనివాసమూర్తికి నిత్యపాదాభిషేకం, మూలమూర్తికి నిత్యపాదాభిషేకం 10వశతాబ్దంనుండి ప్రారంభమయ్యాయి. క్రీ.శ. 1380 సం.ములో శ్రీ దేవీ భూదేవీ సమేతుడైన మలయప్పస్వామికి ప్రప్రథమంగా తిరుమంజనోత్సవం ప్రారంభమైంది. శ్రీవారి శుక్రవారపు అభిషేక కార్యక్రమం క్రీ.శ 1465సం.ములో ప్రారంభమైంది. దీనికి కందాడైరామానుజజీయ్యంగారు అంకురార్పణ కావించారు. క్రీ.శ 1517సం.ములో శ్రీకృష్ణదేవరాయలు పులుగు కాప్పుకు యేర్పాటు చేసి నేటికీ నిరంతరాయంగా అభిషేకం నిర్వహింపబడడానికి యేర్పాటు కావించారు. శ్రీనివాసుని వక్షస్థలంలో అలంకృతమైన అలమేలు మంగతాయారు ప్రస్తావన ప్రప్రథమంగా 22-5-1477 నాటి శాసనం ప్రస్తావించింది. తరువాత 31-8-1495నాటి శాసనంలో అలర్ మేల్ మంగాదేవి ప్రశంస కనపడుతోంది. శ్రీనివాసుని వక్షస్థలంలోని అలర్‌మేల్ మంగతాయారునకు సంకుమపువ్వుతో అభిషేకం 21-2-1496 లో శుక్రవార అభిషేక సమయంలో ప్రారంభమైనదట. 1-3-1506 సం.ము నుండి 7తులముల పసుపుతో అభిషేకపు యేర్పాటు మంగతాయారునకు జరిగి నేటికీ అది కొనసాగుతోంది. కొండ క్రింది దిగువ తిరుపతి సమీపానగల తిరుచానూరులో పద్మ సరోవర ప్రాంత మందలి దేవాలయంలో ఏవిధంగా భక్తుల సేవలు, పూజలు అందుకొంటూందో అదే విధంగా కొండలపై నెలకొన్న కొండల కోనేటి రాయుని గుండెలో – గుండె గుడిలో అలమేలు మంగమ్మ శ్రీనివాసునితో సమానంగా శ్రీనివాసదాసుల అర్చనలు, సమార్చనలు అందుకొంటూంది.

మాందీన మనాథం పాహి రమే మకుటాలంకృత కల్హారకుసుమే మాం దేవీ కృతార్థం కురు పరమే మంజుల చంద్రస్ఫురదురు సుషమే తుభ్యం మంగళ మధిగతపుణ్యే తుభ్యం మంగళ మతి లావణ్యే తుభ్యం మంగళ మూర్తిశరణ్యే తుభ్యం మంగళ మభిజన గణ్యే శ్రీ వరలక్ష్మి జనని నమస్తే క్షీరాంబుధి సజ్జనని నమస్తే భావ భవాబ్జజ జనని నమస్తే పాహిమాం జగజ్జనని నమస్తే.

కలిగి చెలగు శ్రీ వేంకటనిలయుని ఘనవక్షస్థల సింహాసనమున నెలకొని అలమేల్మంగా దివ్య వినిర్మల నామమునందగు ప్రియమున సకల జగమ్ముల బొజ్జను నిడికొని సాకిన తల్లిని నిను కొనియాడెద ముకుళిత కరకములడనై నీపదన్ బ్రొమ్మెక్కెద నిత నాలేములు వీడెద

– – – – శ్రీ వేంకటేశ్వర లఘుకృతులలోని అలమేలుమంగా స్తవమునుండి.

ఇన్ని రాసుల యునికి యింతి చెలువపురాశి
కన్నెనీరాశి కూటమి కలిగినరాశి
కలికి బొమలిండ్లు గల కాంతకును ధనురాశి

కులుకు కుచకుంభములు కొమ్మకును కుంభరాశి
వెలుగు హరిమధ్యకును సింహరాశి
చిన్ని మకరారిపుబయ్యెద చేదకు మకరరాశి
కన్నె ప్రాయపు సతికి కన్నెరాశి
వన్నెయై పైడి తులతూగు వనితలకుం తులరాశి
తిన్నని వాడి గోళ్ళ సతికి వృశ్చికరాశి
అముకొను నొరపుల మెరయు అతివకు వృషభరాశి
గామిడి గుట్టు మాటల సతికి కర్కాటకరాశి
కోమలపు చిగురు మోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతి కలిసె ప్రియ మిధునరాశి

---- అన్నమయ్య

మానవులంతా జన్మించేది పన్నెండు రాశులలోనే. ఆపన్నెండురాశులే మానవుల భూత భవిష్యద్వర్తమానాల ను నిర్దేశిస్తాయి. అన్నమయ్య శాస్త్రీయమైన ఉత్తమ జాతి స్త్రీ లక్షణాలు, మేషాదిరాశులు సమన్వయమై అలమేలుమంగను ఆశ్రయించినట్లు భావన చేసాడు. పన్నెండు రాశులలో జన్మించే జీవులను రక్షించే చల్లని తల్లిగా అలమేలు మంగమ్మ తల్లిని సంభావించాడు. పన్నెండు రాశులలో కలసిన అందాల రాశియైన ప్రియ సతియైన అలమేలు మంగను ప్రేమమూర్తియైన వేంకట పతితో మిధునరాశిలో అన్నమయ్య కలిపి నమస్కరించి తాను ధన్యుడయ్యాడు. అలమేలు మంగను దర్శించి, సేవించవలసిన తీరును తన సంకీర్తనలో మనకు తెలిపి మనలను ధన్యులను కావించాడు.

## అన్నమయ్య పాట – అలమేలు మంగమ్మ ఆట

శ్రీ వేంకటేశ్వర స్వామిని తన సంకీర్తనలతో కీర్తించడానికి జన్మించిన కారణజన్ముడు అన్నమయ్య. ఆడిన మాటెల్ల అమృత కావ్యం కావించుకొన్న పదకవితాపితామహుడు అన్నమయ్య. పాడిన పాటెల్ల పరమగానం కావించుకొన్న ఆది వాగ్గేయకారుడు, శ్రీహరి సంకీర్తనాచార్యుడు అన్నమయ్య. అన్నమయ్య ఆచారం శ్రీవేంకటేశ్వర సంకీర్తనం. అన్నమయ్య ప్రచారం భాగవత ధర్మం. అన్నమయ్య ప్రబోధం సతతపూర్ణునికి శరణ్యం . ఈ త్రివేణీ సంగమం అన్నమయ్య జీవితం. కలలో కనపడి అన్నమయ్యను అనుగ్రహించాడు శ్రీవేంకటేశ్వరుడు. విశాఖ నక్షత్రంతో కూడిన వైశాఖ పూర్ణిమ అన్నమయ్య జయంతి. 9-

5-1408 గా కొందరు,1424 సం.ముగా కొందరు అన్నమయ్య జన్మసంవత్సరంగా భావిస్తున్నారు. అన్నమయ్య వర్థంతి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి (23-2-1503).

"అన్ని మంత్రములు నిందే ఆవహించెను
వెన్నతో నాకు కలిగె వేంకటేశ మంత్రము"

అన్నాడు అన్నమయ్య. ఆ శ్రీవేంకటేశ్వర మంత్ర సిద్ధి పొంది పరమంత్రములు ముప్పది రెండు వేలు సృష్టించాడు. తన పదహారవయేట అన్నమయ్య తిరుమలయాత్రకు బయలుదేరాడు. మెట్లు నిట్టనిల్వుగా చాలా ఎత్తుగా ఉండే పెద్ద యెక్కుడు దాటి వెళ్ళాడు. మోకాళ్ళ పర్వతం చేరుకున్నాడు. అది సాలగ్రామ శిలామయపర్వతం. ఆనాడు పాదాలతో కాక మోకాళ్ళతో ఆపర్వతం ఎక్కేవారట. కావున ఆపర్వతం మోకాళ్ళ ముడుపుగా పిలువబడేది. అన్నమయ్య తెలియక చెప్పులతో కొండ ఎక్కుతూ మోకాళ్ళ ముడుపు వద్దకు చేరుకొని అలసి బడలికతో ఇంక కొండ ఎక్కలేక ఆ మోకాళ్ళ ముడుపువద్ద ఉన్న ఒక వెదురు పొద క్రింద ఒక బండ రాయిపై నిద్రించాడు. అలమేలు మంగ అన్నమయ్యకు దర్శన భాగ్యం ప్రసాదించింది. చెప్పులు విప్పి కొండ ఎక్కమని తెలిపింది. అలసిపోయిన అన్నమయ్యను ఉరడించి దివ్య ప్రసాదాలు ప్రసాదించి ఆరగించి ఆకలి తీర్చుకొనమని ఉపదేశించి అదృశ్యమైంది.

"[illegible]రిసెలు నూనె బూరియలు నౌగులు చక్కెర మండెగల్ వడల్
[illegible]లు పాలమండెగలపూపములయ్యలమేలుమంగనీ
[illegible]గవిందు వెట్టు పరమాన్న శతంబుల సూపకోట్లతో
[illegible]నిర్మలాన్నముల నేతుల సోనల వేకటేశ్వరా" ---అన్నమయ్య

"[illegible]మ్మాఅలమేలుమంగా! శ్రీవేంకటేశ్వర స్వామికి అర్పించిన దివ్య ప్రసాదాలు నా ఆకలితీరి [illegible] నిండేలాగ అనుగ్రహించావు తల్లీ! నీ ఆదేశం శిరసావహిస్తాను. నీవు చెప్పినట్లు [illegible]రక్షలు వదలి పాదచారినై కొండ ఎక్కి శ్రీవారి అనుగ్రహానికి పాత్రుడనవుతాను. నాకు దివ్యమైన ఆహారం సమకూర్చావు. నీకు శతకహారం సమర్పించుకొంటున్నాను" అంటూ అన్నమయ్య అలమేలు మంగాంబికా స్తుతి పరంగా ఆసువుగా శ్రీ వేంకటేశ్వర సంబోధనతో శతకం చెప్పాడు.

పల్లవపాణి విశ్వగురుభామిని యిట్టి ప్రపంచమంతకున్
తల్లి సమస్త జీవుల నిదాచుమ శ్రీయలమేలుమంగ! నీ
చల్లని చూపు చిల్కి వెదచల్లుగ పుణ్యుల మైతిమి యంద్రు భూ
మెల్లను నీవధూమణి ననేక విధంబుల వేంకటేశ్వరా!

నెఱినలమేలు మంగకును నీకును పద్మ భవాండభాండమే
మెఱసిన బొమ్మరిల్లు తగు మేడలు మీదటి లోకముల్ ప్రభల్
తెఱలగ మించు నయ్యినుడె దీపము గుజ్జెనగూడు చంద్రుడే
తొఱలిన దేవసంఘములె తొత్తులు బంట్లును వేంకటేశ్వరా!
ఆతడె నీవు నీవనగ నాతడె నీపలుకే తలంపగా
నాతని పల్కు నీ హృదయ మాతడె యోయలమేలు మంగ నీ
చేతిదె సర్వజంతువుల జీవన మంతయు నంచు సన్నుని
వ్రాతము సన్నుతించు ననివారణ నీసతి వేంకటేశ్వరా!
యోగ్యతలేని కష్టుడ నయోగ్యుడ నల్పిట జూడ గర్భని
ర్భాగ్యుడ నీ కృపామతికి ప్రాప్తుడ నోయలమేలు మంగ నీ
చూచు కృపానిరీక్షణమె చూచెద నంచును నీ ప్రియాంగనన్
పూచిన వాక్ప్రసూనముల పూజలు చేసెద వేంకటేశ్వరా!
అమ్మకు తాళ్ళపాక ఘనుడన్నడు పద్యశతంబు సెప్పెకో
కొమ్మని వాక్ప్రసూనముల కూరిమితో నలమేలు మంగకున్
నెమ్మది నీవు చేకొని యనేక యుగంబుల బ్రహ్మకల్పముల్
సమ్మద మంది వర్ధిలుము జవ్వని లీలల వేకటేశ్వరా !

----తాళ్ళపాక అన్నమయ్య వేంకటేశ్వరశతకం నుండి

అలమేలుమంగమ్మ అనుగ్రహానికి పాత్రుడై, ఆమె అనుగ్రహంతో అందించిన అమృతాన్నాలు, దివ్య ప్రసాదాలు ఆరగించి భక్త్యావేశంతో, కవితా.వేశంతో, పదకవితావేశంతో ఎన్నో, ఎన్నెన్నో సంకీర్తనలు అలమేలుమంగమ్మపై అన్నమయ్య గానం చేసాడు. అన్నమయ్య పాడితే శ్రీవేంకటేశ్వరుడు శ్రీ వారికి నైవేద్యంగా సమర్పించిన పాలు, వెన్నను ఆప్యాయంగా ఆరగించేవారట. జోఅచ్యుతానంద అంటూ జోలపాడితే స్వామి వారు పసిబిడ్డడై హాయిగా పవ్వళించేవారట. అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనలు పాడితే విన్న స్వామి వైరాగ్య వేంకటేశ్వరస్వామిగా మారిపోయేవారట. అలమేలు మంగ వైరాగ్య వేంకటేశ్వరుని చూచి దిగులు పడుతూంటే అన్నమయ్య శృంగార సంకీర్తనలు కావించేవాడట. అలమేలు మంగ సౌందర్యం అతిలోకమనోహరమైనది. అసాధారణమైనది. అమ్మ చూపులు, చేతలు, పలుకులు, పలకరింపులు అన్నీ శ్రీనివాసుని పరవశింపచేసేవే! పద్మావతీదేవి మహాసౌందర్యాన్ని చాంగు – భళా అంటూ అన్నమయ్య ప్రస్తుతించాడు.

"చక్కని తల్లికి చాంగు భళా తన

చక్కెరమోవికి చాంగు భళా!
పలుకుల సొంపుల పతితో కసరె
చలముల అలుకకు చాంగుభళా! ---అన్నమయ్య

ఈ చాంగుభళా సంకీర్తనపాడి అలమేలు మంగముగ్ధ మనోహర సౌందర్యాన్ని వేంకటపతి కన్నులవుందు ఆవిష్కరించి అన్నమయ్య స్వామిని రసానందంలో ఓలలాడించాడు.

"ఏమని పొగడుదుమే యిక నిన్నును
ఆమని సొబగుల అలమేల్మంగ
తెలికన్నుల నీ తేటలే కదవే
వెలయగ విభునికి వెన్నెలలు
పులకల మొలకల పొదులివి గదవే
పలుమరుపువ్వుల పానుపులు
తియ్యని నీమోవి తేనెలే గదవే
వియ్యపు రమణుని విందులివి
ముయ్యక మూసిన మొలక నువ్వుగదె
నెయ్యపు కప్రపు నెరిబాగాలు
కైవసమగు నీకాగిలే గదవే
శ్రీవేంకటేశ్వరు సిరినగరు
తావుకొన్న మీకమత ములే కదే
కావించిన మీ కల్యాణములు"

అలమేలుమంగ నవయవ్వన శృంగారాలు ఆమని సొగసులు అత ల్లి వసంత విలాసవిభ్రమాలు స్వామి వారికి మొలక పులకింతలు. ఆమె తెలికన్నుల తియ్యదనాలు వేంకటవిభునకు వెన్నెల పాన్పులు. ఆదివ్య దంపతులు, నవలావణ్య మూర్తులైన పద్మావతీ శ్రీనివాసుల ప్రణయలీలలు భక్తుల పాలిట అనంత కల్యాణ లీలలు. వానిని పదిలంగా, పరమ పవిత్రంగా భావించుకొంటూ ఆ కల్యాణ అనుభూతుల్ని ఆ పచ్చని, వెచ్చని, నులివెచ్చని జ్ఞాపకాలను, తీపి గుర్తులను నెమరు వేసికొంటూ భక్తులు. ఆనంద తన్మయత్వంతో పరమానంద సంభరితులవుతూంటారు.

"అలరులు కెరియగ నాడెనదే

అలకల కులుకుల అలమేలు మంగ
అరవిరి సొబగుల అతివలు మెచ్చగ
అరతెర మరగున ఆడెనదే
వరుసగ పూర్వపు దువాళపు తిరుపుల
హరి కరిగింపుచు అలమేలుమంగ
మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెంపు దళుకులు
అట్టిటు చిమ్ముచు అలమేలుమంగ
చిందులపాటల శిరిపాల యాటల
అందెల మ్రోతల ఆడెనదే
కందువ తిరువెంకటపతి మెచ్చగ
అందపు తిరుపుల అలమేలుమంగ" -- అన్నమయ్య

"అలమేలు మంగ అలక అల్లల లాడినది. కురులలోని విరులు జలజలరాలినవి. నర్తకి రంగస్థలపూజ నిర్వహించినట్లైనది. ఆమెకు అడ్డముగా చలికత్తెలు తెరపట్టగా అరతెరమరగున ఆడినది. అరవిరిసిన అందాలపూల బాల వలె తోచినది. వనిత పూర్వదువాళపు తిరుపులను ప్రదర్శించింది. అతివఅశిధిల లయబంధములైన అంగవిక్షేపాలను ప్రకటించినది. అవి తిరుమల దొరను కరగించినవి.
ఆమదమరాళగమన పదములు లయాను గతులను విస్తరించినవి. కాలిమట్టెలు తాళ గతులను తెలిపినవి. అందెల మెరగులు మట్టెల రవళులతో పందెములాడినవి. నృత్తగీతాలు చెలరేగినవి. అంగనామణి అనంగ శృంగారములనే ఒలకబోసినది. ఆమె శిరిపాలయాటలనే ఆడినది. అలమేలు మంగ అభినవ శృంగారములకు అంగజగురుడు మురిసినాడు. ఆ శ్రీనివాసరసికుడు సిరివురిపెవునకు మెచ్చినాడు. ఇది భావలయం. ఇది నాదాలయం. ఇది శ్రీనివాసపదకవితాలయ".

శ్రీకామిశెట్టి శ్రీనివాసులు శెట్టి 'శ్రీ అన్నమాచార్య సార స్వత కళారాధనము 'నుండి.( జూలై 76సప్తగిరిలో ప్రచురితము)

ఇది అన్నమయ్య శృంగార పదానికి అలమేలు మంగమ్మ కావించిన దివ్య నృత్యం. ఆ దివ్య నృత్యం తిలకించిన శ్రీ వేంకటేశ్వరుడు మంచి ప్రాయపువాడై, శృంగార రాయుడై, కొండల కోనేటి రాయుడై అమ్మ అలమేలు మంగమ్మను అలరించినాడట.

శ్రీనివాసరసికుడూ ఆనంద నృత్యం చేస్తూ అలమేలుమంగను అలరించినట్లు గానే అన్నమయ్యనూ అనుగ్రహించేవాడట.

"దాచుకో నీపాదాలకు దగనే చేసిన పూజలివి
పూచి నీ కీరితిరూపు పుష్పములివియయ్యా
ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షింపగా
తక్కినవి భండారాన దాచి వుండనీ" ---అన్నమయ్య

అన్నమయ్య కావించిన అసంఖ్యాకములైన సంకీర్తనలలో అలమేలుమంగపై కావించిన సంకీర్తనలు శృంగారరస భరితమై శ్రీ వేంకటపతిని మెప్పింప జేసినాయి. "అలరులు కురియగ నాడెనదే
అలకల కులుకుల నలమేలు మంగ" అన్న అన్నమయ్య సంకీర్తన ఒక్కటే తనను రక్షించి, మోక్షం ప్రసాదించడానికి చాలునని అతడు భావించాడు. అలమేలు మంగపై ఆ ఒక్క సంకీర్తనే చాలు. అదే భక్తులకు పదివేలు. అదే శ్రీ వేంకటేశ్వరునకు, వేంకటేశ్వరుని భక్తులకు ముప్పది రెండు వేలు. 'నేను ఒక్కండ లేకపోతే నీ కృపకు పాత్రంబెక్కడ' అంటూ అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని ప్రశ్నించాడు. ఆ విధంగా ప్రశ్నించే శక్తి, భక్తి అమ్మ అలమేలు మంగమ్మ దయవలన అన్నమయ్యకు లభించింది. శ్రీ వేంకటనాథుని కృపకు పాత్రుని కావించింది. అమ్మ అలమేలు మంగమ్మ కృప మనపై ప్రసరిస్తే మనకు అన్నీ లభించినట్లే. అలమేలు మంగమ్మ శ్రీ వేంకటేశ్వర భక్తుల పాలిట ముంగొంగు బంగారం. అలమేలు మంగాదేవి వరాల సిరులు భక్తులపై కురిపించే కామధేనువు. కల్పవృక్షం. ఆమె భక్తుల పిలుపు వినక ముందే పలికే తల్లి. భక్తులు అడగకనే అన్నీ అందించే కల్పవల్లి. మనకు ఏది అవసరమో మనకు తెలియదు. మనము ఏమి అడగాలో మనకు తెలియదు. భక్తుల అవసరాలు గుర్తించి, గ్రహించి అలమేలు మంగ ఆదుకొంటుంది. అలమేలు మంగ అనుగ్రహానికి పాత్రులైన భక్తులకు ఈ అనుభవాలు, అనుభూతులు, ప్రత్యక్ష నిదర్శనాలు కోకొల్లలు. ఆ చల్లని చూపుల తల్లిని, ఆపలుకు తేనెల తల్లిని సదా మన మనస్సులో నిలుపుకొందాము. తలపులో పిలుచుకొందాము. కొలుచుకొందాము.

## ప్రత్యక్షమై సాక్ష్యం చెప్పిన అలమేలు మంగ

అన్నమయ్య చనవరిసుతుడు పెద తిరుమలాచార్యులు. ఇతడు క్రీ.శ.**1460-1547** మధ్య జీవించాడు. శ్రీనివాసుడు ఇతని భక్తికి మెచ్చి మూడుపురు షాంతరాలవరకు ప్రత్యక్షి

మవుతాను. ఏడుపురుషాంతరాల వరకు మోక్షమిస్తాను అని వరమిచ్చాడు. సంకీర్తనలు, శతకాలు, వచనాలు శ్రీ వేంకటేశ్వరునిపై తిరుమలాచార్యుడు సంతరించాడు. "అలుగకు కాంత మీరు మొగమై యటు చూచిన దర్పణంబునన్ భిళకక నీ మొగంబు ప్రతిబింబము గానగవచ్చె నంతలో గలకల నీవు నవ్వితిని కాంతయు నవ్వెను మీకు నద్దమే యలుకలు తీర్చె తోడి చెలులచ్చరువందగ వేంకటేశ్వరా"!

భక్తుడు తన మనస్సును అద్దంగా ఉంచుకొంటే దానిలో పద్మావతీ శ్రీనివాసులు నవ్వుతూ ప్రతిబింబిస్తారని పెదతిరుమలాచార్యుడు మనకు సందేశం అందించాడు. పెదతిరుమలాచార్యునకు ఐదుగురు పుత్రులు. వారందరూ సుప్రసిద్ధులు. పంచ పాండవులకు రుక్మిణీ పతి సహాయపడినట్లు ఈ ఐదుగురు అన్నదమ్ములకు సదా శ్రీ అలమేలుమంగాంబికా ప్రియ వల్లభుడైన శ్రీనివాసుడు తోడ్పడేవాడట. వీరికి విచిత్రముక్తాతపత్ర రత్నకిరీట ముద్రికా ప్రచండ మణిమండిత మకరకుండలోత్కర హార దీపికా పాదుకాది కానుకలను శ్రీనివాసుడు అనుగ్రహించాడట. పెదతిరుమలాచార్యుని నాల్గవ కుమారుడు చిన్నన్న. పెదతిరుమలాచార్యుని కుమారులలో చినతిరుమలాచార్యుడు, చిన్నన్న సుప్రసిద్ధులు. చిన్నన్న ద్విపద రచనలో సిద్ధహస్తుడు. 'దినములోననే వేయి ద్విపదలింపొంద వినుత వర్ణనలతో విరచించు'వాడు. 'జలజాతవాసిని చనుబాలపుష్టిచే కవితలు అల్లడం ప్రారంభించినవాడు'. సకల వైష్ణవ పాదసంసేవ కాబ్ధ సదనావధూలబ్ధ సరసకవిత్వ విదిత మానసుడు చిన్నన్న. రత్న శుంభదనుపమ శ్రీవేంకటాద్రీశ దత్త మకరకుండల యుగ్మ మండిత కర్ణుడితడు. అన్నమయ్య చరిత్ర, అష్టమహిషీ కల్యాణం పరమయోగివిలాసం, ఉషాపరిణయం, ఆదిగాగలవి చిన్నన్న రచనలు.

"వాణీశనుతకును వ్రతకక్షివిచల దేణికి శ్రీవేంకటేశురాణికిని సారసగేహకు చారుబాహకును సారలావణ్యకు సకలగణ్యకును పరమకల్యాణికి భ్రమరవేణికిని, తరుణేందుఫాలకు దారశీలకును రామాభిరామ అప్రతిమధామకును హైమ సంవ్యానకును, హంసయానకును నింద్రభావితకు గజేంద్రసేవితకు చంద్రికా హాసకు చారునాసకును నగసుతానతకు పన్నగతల్ప యుతకు మృగమదాంబకు అలమేలుమంగకును నంకితంబుగను" అని చిన్నన్న శ్రీ వేంకటేశ్వరుని పట్టపు రాణియైన అలమేలు మంగకు ప్రణతులర్పిస్తూ అష్ట మహిషీకళ్యాణం అంకితం కావించాడు. శ్రీవధూవర లబ్ధ సిద్ధవాక్ ప్రౌఢిమా విర్భవన్మతిస్వాంతుడై చిన్నన్న అతులిత హేమాంగ అలమేలు మంగకు ఉషాపరిణయం అంకితంకావించాడు. శ్రీనివాసుని ఆదేశంతో వరకృపాపాంగ శ్రీ అలమేల్మంగకు, శ్రీవేంకటేశ్వరునకు [illegible] విలాసం రచించి చిన్నన్న అంకితం

కావించాడు. నూలు నేయు పద్మసాలీ వారికి ఆచార్య పురుషుడై, వారి వంశమర్యాదలకు రక్షకుడై వర్ధిల్లిన మహాపురుషుడు చిన్నన్న. అన్ని వర్ణాలవారు సహపంక్తిలో భోజనం చేసే వన భోజన మహోత్సవ మనే ఉత్తమ సంప్రదాయాన్ని నెలకొల్పిన సంఘ సంస్కర్త పేద తిరుమలాచార్యుడు. చిన్నన్న లో ఉత్తమ సంస్కారాన్ని, సంస్కర్తను దర్శించిన పద్మసాలీలు తమకు జాండ్రవారకు వచ్చిన తగాదా విషయంలో నిష్పక్షపాతంగా న్యాయ నిర్ణయం కావిస్తాడని భావించి వారు చిన్నన్నను తీర్పుచెప్పమని అర్థించారు. జాండ్రవారు కూడా చిన్నన్న సక్రమ నిర్ణయం కావిస్తాడని విశ్వసించి అతని తగవు తేర్చే మధ్యవర్తిగా అంగీకరించారు. మేము శ్రీవేంకటేశస్వామి వారి దేవేరి పద్మావతమ్మ వంశం వారమని పద్మసాలీలు, జాండ్రవారు వివాదపడ్డారు. పద్మావతి వారిలో ఎవరి ఆడపడచో నిర్ధారణకావాలని చిన్నన్నను వారు ప్రశ్నించారు.

అప్పుడు చిన్నన్న 'అలమేలు మంగను అడుగుతాను. ఆమె సమాధానం చెప్తుందని వారిని సమాధానపరచాడు. ఒక శుభదినాన మంగాపురంలో ఉభయపక్షాలకు చెందినవారిని సమావేశానికి ఆహ్వానించాడు. తోడుగా తిరుమల తాతాచార్యుల వారిని తోడ్కొని వచ్చాడు. చంద్రగిరి రాజు పురుషోత్తమరాయలను ఆహ్వానించాడు. అందరూ ఉచితాసనాలపై ఆసీనులయ్యారు. చిన్నన్న అలమేలుమంగను ప్రార్థించాడు. ఆ సమావేశంలో సాక్షాత్కరించి ప్రత్యక్షంగా సాక్ష్యం ప్రకటించి ఉభయ పక్షాలవారి సందేహాన్ని నివృత్తి కావించి వారికి ఊరట, ఉపశమనం కలిగించమని మనసా నివేదించుకొన్నాడు. అప్పుడు అలమేలుమంగ అలర్ – మేల్– మంగ– తామర గద్దెపై వెలసిన తల్లి – లక్ష్మి ఆ సమావేశంలో ప్రత్యక్షమై దివ్య కాంతులు ప్రసరింపజేసింది. చిన్నన్న కోరికను మన్నించి తాను ఏకులానికి చెందిన ఆడపడచో వివరిస్తూ విసస్పష్టంగా ఈవిధంగా ప్రకటించింది.

"పద్మసాలీల మూలపురుషుడు భృగు మహర్షి. శ్రీ మహాలక్ష్మిని భృగుమహర్షి పుత్రికగా పురాణాలు ప్రకటిస్తున్నాయి. ఆ మహాలక్ష్మిని నేనే! నేను కలియుగంలో పద్మావతిగా అవతరించాను". ఆ విధంగా నేను పద్మసాలీల కులానికి చెందిన ఆడపడచును. ఈ ప్రకటన చేసిన అలమేలుమంగ శ్రీనివాసమంగాపుర సమావేశ స్థలంనుండి అదృశ్యమైంది. చిన్నన్న పిలుస్తే ప్రత్యక్షమై పలికిన పలుకు తేనెల తల్లి పద్మావతిదేవి పలుకులను విన్న పద్మసాలీలు శ్రీ తాళ్ళపాక చిన్నన్నకు పాదపూజ చేసి ఇరవై వేల వరహాలు కానుకగా సమర్పించుకొన్నారు. స్వంతంగా వారు పదివేల వరహాలు సమకూర్చుకొని మిగతా పది వేల వరహాలు దేవరవారి భండారాన్నుంచి తెప్పించి

పురుషోత్తమ రాయల సమక్షంలో, తాతాచార్యుల వారి ఆధ్వర్యంలో ఒక దివ్యమైన దేవాలయం నిర్మించమని చిన్నన్నకు పాదకానుకగా ఆమొత్తాన్ని సమర్పించుకొని ధన్యులయ్యారు. పద్మావతీ శ్రీనివాసుల పరిణయోద్యానవనం నారాయణ వరంలోని వారంతా పద్మసాలీలే. తిరుచానూరు సమీపంలో యోగివుల్లవరంలోని వారూ పద్మ సాలీలే. శ్రీనివాసమంగాపురంలో క్రీ.శ. **1542** వ సంవత్సరంలో పద్మావతి సాక్షాత్కరించి తాను పద్మసాలీల వంశానికి చెందిన ఆడపడచునని ప్రకటించుకుంది. ఆనాటి సమావేశంలో పాల్గొని అలమేలుమంగ దర్శన భాగ్యం పొంది. ఆమె దివ్యమైన వాక్కులు విన్న అప్రేక్షక మహాజనులు అదృష్టవంతులు. చిన్నన్న తనకు పద్మసాలీలు సమర్పించిన ఇరవైవేల వరహాలతో తొండవాడలో తిమ్మప్ప దేవాలయాన్ని నిర్మింపజేశాడు. తిమ్మప్ప స్వామి అంటే శ్రీ వేంకటేశ్వర స్వామి. తిరుమల + అప్పడు= తిరుమలప్పడు. అతడే తిమ్మప్పుడు. అంటే వేంకటేశ్వరుడు. 'కొండమీది తిమ్మప్పని వంటి కావ్యపతి యబ్బుట యబ్బురము' అంటూ కాకుమాని మూర్తికవి తన రాజవాహన విజయంలో ప్రస్తావించి తిమ్మప్పను తిరుపతి శ్రీవేంకటపతికి అన్వయించాడు.

పద్మావతి తాను పద్మసాలీల ఆడపడచునని ప్రకటించుకొన్న వివరాన్ని రాయదుర్గం పట్టణంలోని శ్రీప్రసన్న వేంకటేశ్వర దేవాలయంలో అనుచానంగా కొనసాగుతూన్న ఆచారం, సంప్రదాయం ధృవీకరిస్తోంది. ఆ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం సుమారు మూడు వందల సంవత్సరాల ప్రాచీన చరిత్ర గల దేవాలయం. గతకొన్ని సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం స్థానికంగా ఉండే ఒక పద్మ సాలీకన్యతో శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి వారి విగ్రహానికి వివాహం కావించే ఆచారం ప్రాచుర్యంలో ఉంది. విగ్రహంతో పెళ్ళి ఒక వింత. అది అరుదైన ఘట్టం. సాధారణంగా వధువు వయస్సు**15** సంవత్సరాలుకు మించదు. పద్మసాలీలలో ఆరవా అనే తెగకు చెందిన కన్యను పద్మావతిగా భావిస్తారు. పద్మసాలీల మూల పురుషుడైన భృగు మహర్షి పుత్రిక మహాలక్ష్మి కలియుగంలో పద్మావతిగా ఉద్భవించి శ్రీనివాసుని పరిణయం కావించుకొంది. ఒకప్పుడు పద్మసాలీలకు చెందిన వేరొకతెగవారు పద్మావతి తమ తెగకు చెందిన కన్యగా ప్రకటించి తమ తెగకు చెందిన అమ్మాయితోనే శ్రీనివాసకళ్యాణం కావించాలని వివాద పడ్డారట. అప్పుడు కొంకణ ప్రభుత్వం విష్ణుపురాణం, శ్రీనివాస కళ్యాణం వంటి ప్రాచీన గ్రంధాలను పరిశీలించి అరవ తెగకు చెందిన కన్యకు మాత్రమే స్వామిని వివాహం చేసికొనే హక్కు ఉందని తీర్పు చెప్పింది. తిరుమల దేవస్థానంలో ప్రాచీన కాలంలో ఒక విజయ దశమినాడు పండితుల సమక్షంలో పురాణాల పరిశీలన ద్వారా ఈ వివాహపు తంతు నిర్ణయమైనట్లు గ్రంధాలలో ఆధారాలు ఉన్నాయని ధృవపరుస్తూ రాయదుర్గం పట్టణానికి చెందిన పద్మసాలీ ప్రముఖుడు శ్రీ కాసుల

నరసింహప్ప 16-8-85తేదీన ప్రకటన కావించారు. అనాటి కొంకణ ప్రభుత్వపు తీర్పుననుసరించి తరతరాలుగా సాగుతూన్న వివాహసంప్రదాయాన్ని పరిరక్షించడం కోసం ఆ వివాహాన్ని కొనసాగిస్తున్నట్లు 1985సం.ము నాటి రాయదుర్గం శ్రీవేంకటేశ్వర దేవస్థానం ట్రస్టుబోర్డు చైర్మన్ శ్రీ జయంతి రాధాకృష్ణ చెప్పారు.

శ్రీ వేంకటేశ్వరుని విగ్రహానికి సరూప కన్యకు జరిగే పెండ్లి నిశ్చితార్థం మొదలు, మంగళసూత్రధారణ వరకు హైందవ సంప్రదాయం ప్రకారం జరుగుతుంది. ఈ పెళ్ళికి ముందురోజున వరుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి వారి పక్షాన పెళ్ళి పెద్దలుగా పురప్రముఖులు మేళతాళాలతో శ్రీవారి దేవాలయం నుండి (వరుని గృహంనుండి) పద్మసాలీల కుల దేవాలయమైన మార్కండేయస్వామి వారి ఆలయానికి (వధువు గృహం) చేరుకుంటారు. అక్కడ పద్మసాలీల కులపెద్దలు వధువు తరపున వీరిని ఆహ్వానించి శ్రీ మార్కండేయుని సన్నిధానంలో నిశ్చయ తాంబూలాలు ఇచ్చి పుచ్చుకుంటారు. అప్పుడే అక్కడే వివాహ ముహూర్తం నిర్ణయించుకొంటారు. ప్రతి సంవత్సరం సాధారణంగా వైశాఖ బహుళ తదియ నాడు వివాహం చేస్తారు. వివాహ ముహూర్తానికి పద్మసాలీ కన్యను నూతన వధువుగా అలంకరిస్తారు. పుర ప్రముఖులు వరుని పక్షాన ఊరేగి మేళతాళాలతో మార్కండేయుని దేవాలయానికి వస్తారు. ముత్తయిదువలు పెండ్లికుమార్తెను కలశాలతో వరుని గృహమైన శ్రీవారి దేవాలయానికి ఊరేగిస్తూ తీసికొనివస్తారు. స్వామివారు పెండ్లికుమారునిగా అలంకారాలు అందుకొని ముహూర్తంకోసం సిద్ధంగా ఉంటారు. పురోహితులు వివాహమంత్రాలు పఠిస్తారు. వధూవరులకు పూలదండలు మార్చబడతాయి. మంగళ సూత్రధారణతో మాత్రం పెండ్లికుమార్తె మెడలో కట్టి జరిగినట్లు భావించేందుకై మంగళసూత్రాలను ఆమె మెడకు తాకిస్తారు. తరువాత పూజారుల ద్వారా పద్మావతీ విగ్రహానికి మంగళసూత్ర ధారణ జరుగుతుంది. తలంబ్రాలు, ఒడికట్టు అన్నీ అసలు వధువుకే జరుగుతాయి. పద్మావతీ శ్రీనివాసుల ఉత్సవ విగ్రహాలను నవ వధూవరులుగా ఊరేగిస్తారు. తరువాత ఆడపెండ్లివారు. మగపెండ్లివారు కలసి వివాహ భోజనం చేస్తారు. దేవునితో పెండ్లి జరగడంవలన ఆ అమ్మాయికి ఉత్తముడైన, యోగ్యుడైన వరుడు లభిస్తాడనీ, త్వరగా వివాహం జరుగుతుందని అమ్మాయి తరపువారి విశ్వాసం. 16-5-1985 నాటి ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురితమైన 'చిన్నారికి దేవునితో పెళ్ళి' రచనవలన పై వివరాలు తెలుస్తున్నాయి. అన్నమయ్య పుత్రికగా అలమేలు మంగను భావించి, తాళ్ళపాకవారి ఇంటి ఆడపడుచుగా పరిగణించి పద్మావతీదేవి వైవాహికోత్సవాన్ని తాళ్ళపాకవారు నిర్వహించే యేర్పాటు కావించారు. ఈ పెండ్లి తిరునాళ్ళను చైత్రమాసంలో ఐదురోజులు

జరిపించే యేర్పాటు తాళ్ళపాక తిరువెంగళనాథయ్యా క్రీ.శ. 1546సం.ములో కావించారు. రేవణూరి వేకటాచార్యుడు తన శకుంతలా పరిణయంలో అలమేలు మంగ తాళ్ళపాకవారి ఆడపడచని, అన్నమయ్యకు అభిమాన పుత్రికని వివరించాడు. అందుకే శ్రీ వేంకటేశ్వరుడు అన్నమయ్యను 'మామా' అని సంబోధించేవాడట. 'నే నొక్కండ లేకుండితే నీ కృపకు పాత్రమేది? పూని నావల్లనే కీర్తి పొందేవు నీవు' అంటూ అన్నమయ్య శ్రీ అలమేలు మంగా ప్రియ వల్లభునకు నిత్య సన్నిహితుడయ్యాడు.

## పలుకు తేనెల తల్లి అలమేలు మంగమ్మ తల్లి

"పలుకు తేనెల తల్లి పవళించెను
కలికితనముల విభుని కలసినదిగాన
నిగనిగని మోముపై నెఱలు గెలకుల జెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనెగాన
కొంగుజారిన మెఱుగు గుబ్బలొలయగ తరుణి
బంగారుమేడపై పవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
అంగజగురునితో అలసినదిగాన
మురిపంపునటనతో – ముత్యాల మలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిట కలసి
అరవిరై నునుజెమట నంటినదిగాన. ––అన్నమయ్య

"ఇది అలమేలుమంగశయనలీలను గూర్చిన అన్నమయ్య మధురభక్తి నివేదనం. అమలిన శృంగార రసాయనం. ఈ అన్నమయ్య సంకీర్తనం పలుకుతేనెల తల్లి అలమేలు మంగకు సమర్పించుకొన్న" శ్రీ శృంగార భక్తి కవితానీరాజనం.

'తన చిన్నారి తల్లి, కలిమి లేమ ఎక్కడ కందిపోవునో అని సంకీర్తనాచార్యుడు పలుకుతేనెల తల్లి పవ్వళించుటకు ముత్యాల పాన్పునే అమర్చినాడు. అపరంజి మేడలో శయనమందిరమును సృష్టించినాడు. తెలతెలవారినది. అలమేలుమంగ పడక దిగలేదు. సఖులు శయన మందిరం చేరి ముసిముసి నగవులతో గుసగుసలాడసాగినారు. ఆ

భామ నిగనిగలాడు మోమునకు ఇరువైపుల వినీల కుంతలములు చెదరినవి. కొంగు జారినది. చనుగుబ్బల మెరగులు వ్యాపించనవి. ఆమె కనుగొనలు ఎర్రవారినవి. అవి చెంగలువల తొలకిన సింగారాలు. వనిత మురిపాల నటనతో ముత్యాల పాన్పుపై పవ్వళించినది. ఆమె తారుణ్య లావణ్యములు పరచినట్లున్నవి. చెలి పగలైన దాక పడక వదలలేదు. వదలుట ఎట్లు? కలికి తనముల విభుని కరగించుటేకాదు తన జవ్వనమునే జన్నెవట్టి జగదేకపతి మనస్సును లోగొన్నది. కలిమి కాంతకు స్వాధీనముకానిదేమున్నది. విభుడు సామాన్యుడా! అంగజగురుడు. సరసములు ప్రొద్దుపోవువరకు సాగినవి. వేంకటేశ్వరుని బిగి కౌగిళ్ళలో నలగిన అలమేలుమంగ అలసినది కాబోలు. పగలైన దాక పవ్వళించినది. శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టి శ్రీ అన్నమాచార్య సారస్వత కళారాధనము నుండి. ( ఆగస్టు 1976 సప్తగిరి లో ప్రచురితము)

ఆపలుకు తేనెల తల్లిని పరవశింప చేయడానికై నడిరేయి ఏజాములోనో తిరమల గిరి శిఖరాలు దిగి వచ్చి అలిపిరిలోని పాదరక్షల మండపం వద్ద గల పాదరక్షలు ధరించి స్వామి తిరుచానూరుకు తరలిపోతారు. పూర్వకాలంలో తిరుమల కొండనే భక్తులు తిరుమలేశునిగా భావించి సేవించేవారు. ఆపర్వత పాదాన్ని శ్రీవారి పాదంగా పిలుస్తూ ఆరాధించేవారు. స్వామివారి పాదాలకు చెప్పులు కుట్టి, పర్వతపాదం వద్ద ఉంచి శ్రీవారి మెట్టు (శ్రీవారి పాదం) అని వ్యవహరించేవారు. ఆవిధంగా చంద్రగిరి కాలిబాటకు శ్రీవారి మెట్టుదారి అనే పేరు వచ్చింది. అలిపిరిలో నేటికీ ఈ సంప్రదాయం కొనసాగుతోంది. దీనికి గొల్లవారు మిరాశిదారులు. మ్రొక్కుబడులు కలవారు శ్రీవేంకటేశ్వరస్వామి వారికి వివిధరకాల పాదరక్షలు వివిధములైన కొలతలతో కూడినవి నేటికి సమర్పించుకొంటున్నారు. భక్తులు ఏనాడు నూతన పాదరక్షలు అలిపిరి మండపంలో సమర్పించి నిలుపుతారో ఆనాటినుండి సంవత్సరానికి అవి అరిగిపోతాయి. శ్రీవారు ఆ చెప్పులుధరించి తిరుచానూరులోని అలమేలుమంగ వద్దకు వెళ్ళి తిరిగి వచ్చి ఆ చెప్పులు అక్కడ వదలి పిమ్మట కొండ ఎక్కి స్వస్థానానికి చేరుకుంటారు. అలపిరిలోని పాదాల మండపంలో శ్రీవారికి ఉద్దేశించి సమర్పించబడిన అసంఖ్యాకములైన క్రొత్త చెప్పుల జతలు, శ్రీవారు ఉపయోగించగా అరిగిపోయిన చెప్పుల జతలుగా మిగిలి ఉంటాయి. ప్రతి సంవత్సరం వార్షికంగా అలిపిరిలో శ్రీవారి పాదాల మండపంలో మెట్ల ఉత్సవం జరుగుతుంది. ఈ మెట్ల ఉత్సవంలో ఆంధ్ర, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలకు చెందిన సుమారు ఐదువేల మంది భక్తులు 150 భజన బృందాలుగా పాల్గొంటారు. శ్రీవారి మెట్లకు టెంకాయ కొట్టి సమర్పించి కర్పూరహారతి వెలిగించి నీరాజనం కావించి భజన బృ

ందాలు, భక్త బృందాలు గోవింద సంకీర్తనం కావిస్తూ మెట్ల దారిగుండా ఏడుకొండలూ ఎక్కి ఏడుకొండలవాణ్ణి దర్శిస్తారు. ఇదే మెట్ల ఉత్సవం.

శ్రవణా నక్షత్రం శ్రీ వేంకటేశ్వరుని జన్మ నక్షత్రం. శ్రవణా నక్షత్ర ప్రధానమైన శ్రావణమాసపు శనివారాల లో శ్రీవేంకటేశ్వరుని భక్తులు పిండి దీపారాధనలు కావిస్తారు. తొండమండలంలో ఉత్తరపు చివరను శ్రీకాళహస్తి అగ్రహార ప్రాంతంలో ఉండే చెప్పులు కుట్టే కులానికి చెందిన ఒక దళిత భక్తుని ఇంటిలో పిండిమీద శ్రీవేంకటేశ్వరస్వామి వారి దక్షిణ పాదముద్ర (కుడిపాదపు ముద్ర) పడుతుంది. అదేవిధంగా తొండమండలానికి దక్షిణంగా ఉన్న కాంచీపురంలోని ఒక దళిత భక్తుని ఇంటిలో పిండిమీద శ్రీవేంకటేశ్వరస్వామి వారి వామ పాదముద్ర ( ఎడమ పాదపు ముద్ర) పడుతుంది. శ్రీవారి పాద ముద్రల కొలతలు ఆరెండు ప్రాంతాలకు చెందిన దళిత భక్తులు తీసి చర్మంతో శ్రీవారకి పాదరక్షలుతయారు చేస్తారు. ఆ చెప్పులకు కుచ్చులు, కుళ్ళాయిలు అన్నీ అమర్చి అందంగా తయారు చేస్తారు. కాళహస్తికి చెందిన చర్మకారుడు శ్రీవారి కుడిపాదపు చెప్పును నెత్తిన పెట్టుకొని పాద చారియై అలిపిరికి వస్తాడట అదేవిధంగా కంచినుండి చర్మ కారుడు స్వామివారి ఎడమ పాదపు చెప్పును శిరసున ధరించి యాత్రగా అలిపిరికి చేరుకుంటాడట. ఆ ఇరువురు కూడబలుకుకున్నట్లు ఒకరోజునే అలిపిరిలో పాదుకుల పూజా మందిరంలో ఉంచి భక్తి శ్రద్ధలతో వానికి పూజలు కావిస్తారుట. కుడి పాదపు చెప్పు ఒకరు, ఎడమకాలి చెప్పు ఒకరు వేరువేరుగా ఒకరికి తెలియకుండా ఒకరు కుట్టినా ఒకడే కొలతలుతీసి కుట్టినట్లు ఆరెండు చెప్పుల కొలతలు సక్రమంగా సరిపోతాయట. ప్రత్యక్షంగానే శ్రీవారి పాదాల ముద్రల కొలతలు అచ్చుట వెలసాయని నమ్మాలి. ఇది శ్రీనివాసుని పాధుకా లీలగా ఒక భావన. గర్భాలయంలో శ్రీవారి దివ్య మనోహర విగ్రహం సుమారు **9**అడుగుల ఎత్తు ఉంటుంది. వారి ఛాతీ చుట్టుకొలత **36**నుండి **46** అంగుళాల వరకు ఉంటుంది. స్వామివారి నడుము కొలత **24**నుండి **27**అంగుళాలవరకు ఉంటుంది. అంతటి భారీ విగ్రహపు పాదాల కొలతలూ భారీగానే ఉంటాయి. శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్య పాదాలు భక్తులకు సదా శిరోధార్యాలు. అది సాధ్యంకాదు కనుక కనీసం స్వామి వారి పాదరక్షలనైనా భక్తులు అలిపిరిలోని పాదాల మండపంలో తమ శిరస్సులపై ధరించి దివ్యానుభూతి పరంపరలు పొందుతారు. శ్రీవేంకటేశ్వర స్వామి వారు రాత్రి కొండదిగి వచ్చి ఈ చెప్పులు ధరించి తిరుచానూరు వెళ్ళి అలమేలుమంగను శృంగారలీలలో తేలింపచేసి సరస సల్లాపాలు సాగించి ఉదయం పాదరక్షలు అలిపిరి మండపంలో విడచి కొండ ఎక్కుతారట. సంవత్సారానికి ఆ చెప్పులు రోజూ శ్రీవారు ఉపయోగించడం మూలంగా అరిగిపోయి పాత చెప్పులుగా మిగిలిపోతాయి. అవే పాదాల

మండపంలో భక్తుల పూజలు అందుకొంటున్నాయి. భక్తులకు సదా శిరోధార్యాలవుతున్నాయి. శ్రీనివాసుని ఈ పాదరక్షల కథ పద్మావతీ శ్రీనివాసుల ప్రణయకథను భక్తుల కన్నుల ముందు సాక్షాత్కరింప జేస్తుంది. ఆచెప్పులను తలపై పెట్టుకొన్నవారి తలపులో పద్మావతీ శ్రీనివాసులు ప్రణయమూర్తులుగా నిలచి ప్రసన్నమూర్తులై వారిని సదా అనుగ్రహిస్తారని నమ్మిక.

అయ్యదయ కావాలంటే అమ్మదయను మనం ముందు పొందాలి. రామదాసు రాముణ్ణి అర్థించి, ప్రార్థించి కృతార్థుడు కాలేని సమయంలో సీతమ్మను శ్రీరామునకు తన మొర వినిపించమన్నాడు. 'పలుకే బంగార మాయెనా కోదండపాణి పలుకే బంగార మాయె పిలచిన పలుకవేమి?' అంటూ రామదాసు శ్రీరాముణ్ణి వేడుకొన్నాడు. 'ఏ తీరుగ నను దయ చూచెదవో ఇన వంశోత్తమ రామా?' అంటూ గోపన్న రాముణ్ణి దీనాతిదీనంగా ప్రార్థించాడు. రాముని మనసు కరగలేదు. 'ఇక్ష్వాకు కుల తిలక ఇకనైన పలుకవె రామచంద్రా?' అంటూ నిలదీసి రాముణ్ణి రామదాసు ప్రశ్నించాడు. రాముని దయ రాలేదు. 'రామచంద్రులు నాపై చలము చేసినారు సీతమ్మ చెప్పవమ్మా' 'నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ' అని అమ్మ సీతమ్మకు గోపన్న విన్నవించుకొని ప్రసన్నురాలిని కావించుకొన్నాడు. సీతానుగ్రహంతో శ్రీరామానుగ్రహాన్ని ఆ విధంగా సీతారాముల అనుగ్రహానికి రామదాసు పాత్రుడై కారాగార విముక్తుడయాడు. ప్రపంచమనే పెద్దబందిఖానానుండి ముక్తి పొందాడు. ఆవిధంగానే శ్రీనివాసుని కృపకు పాత్రం కావాలంటే ముందుగా అలమేలు మంగాంబిక దయకు మనం పాత్రం కావాలి. శ్రీనివాసుని వక్షస్థలంలో కాపురముండే అలమేలు మంగభక్తుల పక్షం వహిస్తే అప్పుడు శ్రీనివాసుడు భక్త పక్షపాతిగా భక్తులపై కటాక్ష వీక్షణాలు ప్రసరించి ఆదుకొంటాడు.

నడిరేయి ఏజాములో స్వామి నిను చేర దిగివచ్చునో
తిరుమల శిఖరాలు దిగివచ్చునో
మముగన్న మాయమ్మ అలమేలుమంగమ్మ
పతిదేవు ఒడిలోన మురిసేటివేళ
స్వామి చిరునవ్వు వెన్నెలలు కురిసేటివేళ
విభునకు మామాట వినిపించవమ్మా!
ప్రభువుకు మామనవి వినిపించవమ్మా!

ఏడేడు శిఖరాలు నేనడువలేను
ఏపాటి కానుకలందించలేను
వెంకన్న పాదాలు దర్శించలేను
నేను వివరించి నాబాధ వినిపించలేను
అమ్మా మముగన్న మాయమ్మ అలమేలు మంగా
విభునికి మామాట వినిపించవమ్మా!
ప్రభువుకు మామనవి వినిపించవమ్మా!
కలవారినేగాని కరుణించలేడా?
నిరుపేద మొరలేవి వినిపించుకోడా?
కన్నీటి బ్రతుకుల కనలేని నాడు
స్వామి కరుణామయుండన్న బిరుదేలనమ్మా?
అడగవెమాతల్లి అనురాగవల్లీ
అడగవే మాయమ్మ అలమేలు మంగా!" ---మహాకవి దాశరథి

'నా తెలంగాణా కోటిరత్నాలవీణ' అన్నాడు దాశరథి అలమేలుమంగను వేడికొన్న దాశరథి పాట శ్రీవేంకటేశ్వర స్వామి వారి భక్తులకు మాణిక్యవీణ. అలమేలు మంగదయకు సన్నిహితుల్ని చేసే ఆ పాట నిజంగానే శతకోటి రత్నాల వీణ కవి పేదల బీదల పాట్లను అలమేలు మంగను, వెంకన్నకు ఎరుకపరచమన్నాడు. నిరుపేదల కన్నీటి కథలు స్వామికి విని పించమన్నాడు. కన్నీటి బ్రతుకుల జాలిగాథలు తెలుపమన్నాడు. ఏడుకొండలూ ఎక్కి, ఏ పాటి కానుకలు అందిచలేని దీనుల ఆవేదనా రవాలు స్వామి వీనులలో పలికించమన్నాడు. వెంకన్న పాదాలు దర్శించలేని అసహాయుల, అశక్తుల నిరాశలను వివరించమన్నాడు. నడిరేయి ఏ జాములోనో సప్తగిరీశుడు సప్తగిరులు దిగివచ్చి మురిసేవేళ, తనచిరునవ్వు వెన్నెలలు పరచేటి వేళ నీ నాథునికి అనాథల బాధలు చెప్పి నివారింపజేయమని అలమేలు మంగకు దాశరథి విన్నవించుకొన్నాడు. వ్యథితుల, పతితుల, బాధా సర్పద్రష్టుల కన్నీళ్ళు, కడగండ్లు తొలగించమన్నాడు. బాధ కలిగినా, కష్టం వచ్చినా, నష్టం సంభవించినా ఎవ్వరైనా అమ్మా అంటారు. "అమ్మా! అలమేలుమంగా! మా అమ్మవు నేవే! నీ విభుడైన శ్రీవేంకటేశ్వరుడు మాకు ప్రభువు. నీవిభునకు, మా ప్రభువునకు మావేదన, ఆవేదన, నివేదన చేసి స్వామి మా సమస్యల పరిష్కారం పట్టసానుకూలంగా ప్రతిస్పందిచేటట్లు అనుగ్రహింపమని" దాశరథి పాటతోమనం శృతికలిపి అలమేలుమంగను ప్రార్థించి తల్లి చల్లని దీవెనలు అందుకొందాము.

# శ్రీ సూర్యనారాయణ స్వామి

పూర్వం తిరుపతి యాత్ర కావించేవారు తిరుచానూరు వెళ్ళి పద్మావతీ పద్మ సరోవర తీర్థంలో స్నానం చేసి సమీపంలోని శ్రీసూర్యనారాయణమూర్తిని దర్శనం కావించి అలివేలు మంగమ్మను ఇతరదేవతలను సేవించి, దిగువ తిరుపతిలోని గోవిందరాజస్వామి, కపిలేశ్వర స్వామి, కొదండరామస్వాములను దర్శించి చివరగా శ్రీవేంకటేశ్వర దర్శనంతో తిరుపతి యాత్రముగించేవారు. కాని నేడు శ్రీవారిని సేవించి దిగువతిరుపతిలోని దేవతామూర్తులను పూజించి చివరగా అలమేలుమంగాపురం వెళ్ళి సూర్యనారాయణ స్వామిని, వరదరాజ స్వామిని, సుందరరాజ స్వామిని, బలరామకృష్ణులను,శ్రీపద్మావతీ దేవిని దర్శించుకొని తిరుపతి యాత్రపరిసమాప్తంకావించుకొంటున్నారు. అలమేలు మంగాపురం చేరగానే భక్తులు పద్మాసరోవరంలో పవిత్ర స్నానం కావించి శ్రీనివాసుడు ప్రతిష్ఠించిన శ్రీ సూర్యనారాయణమూర్తిని దర్శించి పూజిస్తారు. శ్రీనివాసుడు మహాలక్ష్మి సాక్షాత్కారం కోసం పద్మసరోవరం నిర్మించి, దానిలో దేవలోకంనుండి స్వర్ణకమలాలు రప్పించి స్థాపించి ప్రతిరోజు మూడు పూటలా సహస్ర కమలాలతో లక్ష్మీపూజ కావించాడు. పన్నెండు సంవత్సరాలు అమెకోసం తపస్సుకావించాడు. కమలబాంధవుడైన శ్రీసూర్యనారాయణుని శ్రీహరి పద్మసరోవరంలోని స్వర్ణకమలాల వికాసంకోసం ప్రతిష్ఠించాడు.

ధ్యాయేత్సూర్య మనంత కోటికిరణం త్రైలోక్య చూడామణిమ్
భక్తానామ భయ ప్రదం దినకరం జ్యోతిర్మయం శంకరమ్
ఆదిత్యం జగదీశ మచ్యుత మజంత్రై యర్థసారం రవిమ్
భక్తాభీష్ట ఫలప్రదం ద్యుత నిభం మార్తాండ మాద్యం విభుమ్.

----సూర్యధ్యానమ్

శ్రీ సూర్య భగవానుడు కర్మసాక్షి, ధర్మ సాక్షి. సర్వసాక్షి. లోకసాక్షి. శ్రీ నిత్యమూర్తి ప్రత్యక్ష దైవతామూర్తి. మార్తాండుడు మానవుల మన్ననలు, పూజలు పొందుతున్న మహిమాన్వితుడు. జగతికి, జనతకు ప్రాతః స్మరణీయుడు, ప్రథమవంద్యుడు, ఆదిపూజ్యుడు భానుడు. ప్రజాపతి తపస్సు కావించి సృష్టి ప్రారంభించాడు. 'ఏవాహ్యేవ అని దోసిలిని నీరుతో నింపి ప్రజాపతి సూర్యుణ్ణి, తూర్పు దిక్కును సృష్టించాడు. క్రమంగా అగ్నిని, దక్షిణ దిక్కును, వాయువును, పశ్చిమదిక్కును, ఇంద్రుని, ఉత్తరదిక్కును, భూమిని, దేవతల్ని సృష్టించాడు. సృష్టి, స్థితి లయాలకు

మూలహేతువుగా, కారణ ధాతువుగా విధాత ప్రప్రథమంగా సూర్యుణ్ణి తూర్పుదిక్కును ఉద్భవింపజేసాడు. అందుచేతనే ఆదిమమానవుడు ఆదిత్యుని, భూదేవిని ఉపాసించారు.

ఓమ్ మీదినీ దేవీ వసుంధరా స్యద్వసుదాదేవీ
వాసుబ్రహ్మ వర్చసః పితృణాం అంటూ భూసూక్తాన్ని మనం నిత్యం స్మరిస్తాంటాము. ఉదయాన్నే మేల్కొంచిన మనం కాళ్ళు భూమాతపై మోపవలసివచ్చినందుకు క్షమాపణ చెప్పుకొంటూ నిత్యం ఈవిధంగా ప్రార్థిస్తాము.

సముద్రవసనే దేవీ పర్వత స్తనమండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే
ద్విభుజం పద్మహస్తంచ వరదం మకుటాన్వితం
ధ్యాయేద్దివాకరం దేవమ్ సర్వాభీష్ట ఫలప్రదమ్

భూమాతను సేవించిన పిమ్మట–పైవిధంగా సూర్యనమస్కారం చేస్తాము.

ఆదిత్యా మంబికాం విష్ణుం గణనాధం మహేశ్వరం
ఉపాసనం పంచవిధం బ్రహ్మోపాసనమేవ తత్ అని మనపూర్వాచార్యులు ప్రవచించారు. "ఋషయశ్చభిన్నాః" "మతయశ్చభిన్నాః" అన్నవి పంచాయతనదేవతారాధన గూర్చిన విశేషణలు పంచాయతన దేవతార్చన మనకు విధిగా నిర్దేశింపబడింది. కావేరీనదిలో లభించే స్ఫటికశిల ఆదిత్యునిగా ఆరాధన అందుకుంటాడు. స్వర్ణముఖీనదిలో దొరికే పంచలోహశిల అంబిక. గండకీనదిలోని సాలగ్రామశిల విష్ణువు నర్మాదానదిలో దొరకు బాణలింగం లేక శిల ఈశ్వరుడు. ఇవీ పంచాయతన దేవతలు. పంచాయతన దేవతారాధనలో అది ఆరాధన అందుకొనేవాడు ఆదిత్యుడు. సోనభద్రలో లభించే అరుణశిల గణపతి.

చీకటిని పోగొట్టేవాడు సూర్యభగవానుడు. ఆదిత్యుడశ్వవాహుడు. తమోహారిగా ప్రాణులచేత ప్రస్తుతింపబడుతున్నాడు. మార్తాండుడు దేవతోత్తమ ప్రకాశుడు. దేవతాస్తోత్రపాత్రుడు అని యజుర్వేదం లోని 2వ అష్టకం ఆదిత్య తత్త్వం, సూర్యోపాసనం గూర్చి వివరించింది. "సూర్యుడు భూలోకానికి జీవన దాత. సృష్టికి నేత. సూర్యుడు తన పురుష కారాన్ని భూమిని పండించడానికి పంపును. అట్టి సూర్యుడు మాకు జీవం. జీవనం. ప్రాణం. సూర్యోదయంతో చీకటేకాదు మృత్యువు తొలగిపోతుంది అని అధర్వణవేదం (17-3-30) ప్రకటించింది. "విష్ణువు బాలుడుగా ఉన్నప్పుడు కళ్ళు తెరువగా సూర్యాగ్నులు ఆవిర్భవించాయి" అన్నది మత్స్యపురాణవచనం. తైత్తరీయ భృగువల్లి ఆదిత్య మండల గత మహాపురుషుడైన సూర్యనారాయణుని "సువర్ణజ్యోతీః" అని అభివర్ణించింది.

సూర్యుడు గాయత్రికి ఆరాధ్య స్వరూపం. భానుడుసర్వదే వాత్మకుడు.

త్రిమూర్త్యాత్మకుడు.

"బ్రహ్మా స్వరూపము దయే మధ్యాహ్నేతు మహేశ్వరః
సాయంకాలే సదావిష్ణుః త్రిమూర్తిస్తు దివాకరః"

ఈవిధంగా దివాకరుడు ఉదయం బ్రహ్మగా, మధ్యాహ్నం మహేశ్వరునిగా, సాయం సమయంలో విష్ణువుగా పాలిస్తున్నాడు. ఇట్టి త్రిమూర్తి స్వరూపుడైన సూర్యుడు జంగమ స్థావరాదులకు ఆత్మస్వరూపుడై ప్రకాశిస్తున్నాడు. ఇతడు త్రిమూర్త్యవతార స్వరూపుడు మాత్రమేకాదు. త్రిమూర్తినీ స్వరూపుడు కూడా. వేద త్రయీస్వరూపుడు సూర్యనారాయణుడు. బ్రహ్మణీ, సావిత్రి, రౌద్రి, సరస్వతీ స్వరూపి. ఓంకార ఆకారుడు. సవితఅంటే సూర్యుడు. అ+ఉ+మ అనే త్రివర్ణాత్మక త్రివిధాత్ముడు సూర్యుడు. ఉదయ, మధ్యాహ్న, సాయం సమయాలలో బాల, సావిత్రి, రుద్రాణి రూపాలను ఆదిత్యుడు ధరిస్తాడు. ఆదిత్య తేజం రుద్రతేజం. అందుచేత మనం–ప్రాతః సమయంలో "ఐం పరబ్రహ్మణే సూర్యాయ ప్రాతః సంధ్యాయైనమః"అని మధ్యాహ్న సమయంలో "క్లీం రుద్రాయ సూర్యాయ మధ్యాహ్న కసంధ్యాయైనమః" అని, సాయం సమయంలో "సౌం విష్ణవే సూర్యాయ సాయం సంధ్యాయైనమః" అని స్తుతిస్తాము. ప్రస్తుతిస్తాము. ఇట్టి త్రిమూర్త్యాత్మకుడైన సూర్యనారాయణుని, ప్రత్యక్ష ప్రమాణస్వరూపుడైన వేదపారాయణుని స్మరించి, సేవించి, పూజిస్తే సకల దేవతల్ని ఆరాధించిన పుణ్యఫలం పొందగలుగుతాము. ముక్కోటి దేవతల దీవెనలు అందుకొనగలుగుతాము. "భాస్కరాయ విద్మహే మహద్యుతి కరాయ ధీమహి తన్నో ఆదిత్యః ప్రచోదయాత్" అని జపించడంద్వారా ఆదిత్యుని అనుగ్రహానికి పాత్రులం కాగలుగుతాము.

సూర్యమండలం ఋగ్వేద స్వరూపం. సూర్యమండలాంతర్గత హిరణ్మయస్వరూపుడు యజుర్వేద ప్రతిపాద్యుడైన పరబ్రహ్మస్వరూపుడు. సూర్యమండలంలోని అగ్నివేదస్వరూపం. ఈవిధంగా ఆదిత్యమూర్తి ఋగ్యజుస్సామవేదాలనే త్రయీ విద్యాస్వరూపునిగా ఉపాసిస్తారు. సూర్యోయాత్మాజగతః అని ప్రమాణవచనం. జగతికి సూర్యుడు ఆత్మ స్వరూపుడు. "అగ్ని ప్రథమోదేవతా" అగ్ని ముఖావైదేవి అన్నవి శ్రుతి పురాణవచనాలు. సర్వకర్మలకు అగ్ని ప్రధానమైంది. సూర్యుడు వేదాగ్ని స్వరూపుడు. సూర్య దేవతారాధన వలన అగ్నిహోత్రోపాసన, వేదపూజా ఫలితాలు కలుగుతాయి. జగతికి, జనతకు సూర్యభగవానుడు సర్వకార్య కారణ భూతుడై వెలుగొందుతున్నాడు.

"రవిబింబంబుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

------ భాగవతం.

ఇది త్రివిక్రమావతారగాధ. ఇది వామనావతార చరిత్ర. క్రాంతివృత్తంగుండా బయటకు వెళ్ళి లోకాల్ని ఆక్రమించే సూర్యకిరణ ప్రసారమే త్రివిక్రమావతారగాధ అని వేదవ్యాఖ్యానకర్తలు వివరించారు. సూర్యనారాయణుడు సహస్ర కిరణుడు. భూలోకాన్ని 300 కిరణాలతోను, భువర్లోకాన్ని 300 కిరణాలతోను, స్వర్గలోకాన్ని 300 కిరణాలతోను, పాతాళ లోకాన్ని 100 కిరణాలతోను తపింపచేస్తున్నాడట. సూర్యుని సహస్ర కిరణాలలో సుషుమ్నం, హరికేశం, విశ్వకర్మ, సూర్యుడు, విష్ణువు, నసత్త్వం, సర్వబంధువు అనే ఏడు కిరణాలు ముఖ్యమైనవి. ఇవి జగత్తులోని సమస్త జీవులకు జీవనం ప్రసాదించి, ప్రాణాధారంగా నిలచి రక్షిస్తున్నాయి. సూర్యుడే సవితాసావిత్రులుగా మిధున జంటగా సృష్టికి ఆధారమయ్యారు. సప్తకిరణాలు సప్త సాగరాలను సప్త ఊర్ధ్వ లోకాలను, సప్త అధోలోకాలను కాపాడుతున్నాయి. జీవులలోని సప్తధాతువులను పోషిస్తున్నాయి. విష్ణువు, ధాత, భగుడు, పూషుడు, మిత్రుడు, ఇంద్రుడు వరుణుడు, అర్యముడు, వివస్వంతుడు, అంశుమంతుడు, త్వష్ట, పర్జన్యుడు అనే ద్వాదశాదిత్యులు సంవత్సరంలోని మాసాలకు అధిష్ఠాన దేవతలై లోకపాలన చేస్తున్నారు. కాలాన్ని పరిపాలిస్తున్నారు.

మన శాస్త్రాలన్నీ సకలదేవతల్ని మార్తాండమండల మధ్యగతులుగా భావించి కీర్తిస్తున్నాయి. సౌర సహస్రనామావళిలో సూర్యనారాయణుని శ్రీమన్నారాయణునిగా కీర్తించే విశేషణాలు, నామ విశేషాలు అశేషంగా ఉన్నాయి. స్థాణుడు, కపర్ధి, త్ర్యంబకుడు, శ్రీకంఠుడు, నీలలోహితుడు, పినాకి, వృషభధ్వజుడు అనే శివపరమైన నామాలు గోచరిస్తున్నాయి. గణపాయ, గణేశాయ అనే గణేశనామాలు, బ్రహ్మావాచకాలు సౌర సహస్రనామం సూర్యమండల మధ్య స్థాయైనమః అని దేవిని వర్ణించడం మన అనుభవంలోనిదే! సూర్యగతి వలన జగతికి కాలగతి యేర్పడింది. నిమేషంనుండి అనిమేషం వరకు అనంతమైన కాలగమనాన్ని కొలువగలుగుతున్నాము. కాలాయ, కాలకర్త్రే, కాలఘ్నాయ, కాలహన్త్రే అనే నామాలు సూర్య సహస్రపనామాలలో సార్థకనామాలై కాలనిర్ణేతగా, యోగ నిర్ణేతగా సూర్యుణ్ణి నిర్దేశిస్తున్నాయి. సూర్యుని వలన నక్షత్రాలు, మాసాలు, ఋతువులు, ఆయనాలు, సంవత్సరాలు యేర్పడి అంతమై పోతున్నాయి. కాలాః

సర్వాధారాః సూర్యుడు కాలాధారుడు. సర్వకాలాధారుడు. గీత చెప్పినట్లు సూర్యతేజం అగ్ని, చంద్రులలో ప్రవేశించడం ప్రకాశించడమేకాదు వాయు వాహకత్వం వహిస్తోంది. సహస్రాదిత్య తీక్షతతో ప్రళయం సృష్టించేవాడు సూర్యుడే! అగ్ని, జలప్రళయాలకు సూర్యుడే కారకుడు. సృష్టికి, సృష్టి పోషణకు, రక్షణకు సూర్యభగవానుడే మూలకారకుడు. ఆదిత్యుడే ఆది ఆద్యుడు.

విరోచన సూర్య, సవితృ, రవిలోచన ఆదిగాగల నామాలు విష్ణు సహస్రనామాలలో కనపడుతున్నాయి. ఈ నామ విశేషణాలు శ్రీమన్నారాయణుని సూర్యనారాయణునిగా ఆదినారాయణునిగా ఆదిత్య నారాయణునిగా ఆవిష్కరిస్తున్నాయి. ఇహపరాలకు, ఇహంలో పరానకి సూర్యోపాసనమే ఉత్తమసాధనం. సౌరోపాసక మూల మంత్రం గాయత్రీ మంత్రం సర్వమంత్రాలకు మాతృస్థానంపై అలరారుతోంది.

" ఓం తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియోయోనః ప్రచోదయాత్"

ఇదే గాయత్రీమంత్రం. సౌరోపాసనామంత్రం. ఇదే సర్వదేవతా స్తోత్ర మంత్రం. ఆదిత్యుని అనుగ్రహాన్ని అందరికి అందించే దివ్య మంత్రం. ఋషులు జపించిన మహామంత్రం ఇది. మనకు తెలియని కాలంలో కూడా సూర్యోపాసన అందరికీ తెలిసిన విషయం అని మనకు తెలియజెప్పే తిరుమంత్రం ఇది. "ఒక సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచుపోలిక" అంటూ పోతన పరమేశ్వరుని సర్వవ్యాపకత్వాన్ని సూర్యుని సర్వవ్యాపకత్వంతో పోల్చాడు. పరమేశ్వర తత్త్వం. సౌరతత్త్వమని, సౌరతత్త్వమే పరమేశ్వరతత్వమని భక్తమహాకవి పోతన ప్రవచించాడు. ఆదినారాయణుని తత్త్వమే ఆదిత్యనారాయణుని తత్త్వమని ఆవిష్కరించాడు. ఒక సూర్యనమస్కారం సర్వదేవతాసమారాధనం. ఆదిత్యవందనం అందరుదేవతలకు అభివందనం. అందుకే ఈ సూర్యనమస్కారం. మానవహృదయమందలి అనాహత పద్మానికి ఉండేదళాలు పన్నెండు. పన్నెండు మాసాలలో సూర్యునికి గల పన్నెండు కళలకు అనాహత పద్మదళాలు ప్రతీకలు. ఆవిధంగా భానుడు పద్మప్రియుడు, పద్మబాంధవుడు అయ్యాడు. ఆ పద్మప్రియునకు మన హృదయాలలోని అనాహతపద్మాలను సమర్పించి అర్చించుకొందాము.

"వైకర్తనో వివస్వాంశ్చ

మార్తాండో భాస్కరో రవిః
లోక ప్రకాశకః శ్రీమాన్
లోకచక్షుర్ గ్రహేశ్వరః
లోక సాక్షీ త్రిలోకేశః
కర్తా హర్తా తమిస్రహా
తపనో తాపనశ్చైవ శుచి
స్సప్తాశ్వ వాహనః
గభస్తి హస్తో బ్రహ్మాచ
సర్వదేవ నమస్కృతః"

శ్రీనివాసుడు పద్మ సరోవరంలోని ఏపూజా స్వర్ణకమలాలవికాసంకోసం శ్రీసూర్యనారాయణుని ప్రతిష్ఠించాడో ఆపద్మప్రియుడైన శ్రీ సూర్యనారాయణ భగవానునికి మన హృదయాలలోని అనాహత పద్మాలను సమర్పించి సమార్చనలు, సుమార్చనలు కావించుకొందాము.

శ్రీరామునకు రావణునిపై విజయం కలిగించినవాడు సూర్యభగవానుడు. శ్రీరాముడు రావణసంహారసమయంలో శ్రమకులోనై ఆలోచిస్తూండగా అగస్త్యుడు ఆగమించి ఆదిత్య హృదయం ఉపదేశించాడు. దీనిని ఆచమనంచేసి మూడు సార్లు పఠించమని చెప్పాడు. శ్రీరాముడు భక్తి శ్రద్ధలతో ఆదిత్య హృదయం పారాయణకావించగా సూర్యుడు ప్రత్యక్షమై శత్రుజయం, రావణవిజయం సాధిస్తావని ఆశీర్వదించాడు.

పౌలస్త్యవధ సాధించిన ఆదిత్య హృదయ మందలి మంత్రం రహస్యమైనది. పఠితలకు శత్రుభయం తొలగిస్తుంది. జయం నిశ్చయం కావిస్తుంది. ఇది విశేష ఫలప్రదాయకమైనది. మంగళములకే మంగళదాయకమైనది. మహాపవి.త్రమైనది. శరీర పీడలను, మనోవ్యాధులను నిర్మూలిస్తుంది. ఇది ఆయువును వృద్ధిచేస్తుంది. సూర్యమండలంలోని శ్రీమన్నారాయణుడే పరదైవం. ఆ భానుమండలవర్తి జగమంతా నిండి ఉన్నాడు. సూర్యకిరణాలు మలినహరాలు. సూర్యుడు త్రిమూర్తి స్వరూపుడు. ఇతడే సుబ్రహ్మణ్యుడు. అష్ట దిక్పాలకులు సూర్యుని ఆజ్ఞానువర్తులు. పితృదేవతలు, అష్ట వసువులు, అశ్వినీ దేవతలు, మరుత్తులు సూర్య కార్య నిర్వాహకులు. సూర్యుడు ఋతుకర్త. నవగ్రహాధి పతి. అదితిపుత్రుడు. శత్రుహంత. అజ్ఞానాంధకార విధ్వంసకుడు. సప్తాశ్వరథారూఢుడు. చలిని హరించేవాడు. వర్షం కలిగించేవాడు. కాంతికి కాంతినిచ్చేవాడు. పరాక్రమవంతుడు. స్వర్ణ ప్రకాశం కలవాడు. యజ్ఞకర్త. సృష్టి కారకుడు. పోషకుడు. లోకబాంధవుడు. ఆదిత్య హృదయం సౌరశక్తిని

గూర్చి ఆవిధంగా ఆవిష్కరించింది.

శ్రీ కృష్ణుడు గ్రహణ సమయంలో గంగాస్నానం చేసి సూర్య ఆరాధన కావించినట్లు భాగవతం తెలుపుతోంది. శ్రీ కృష్ణుని పుత్రుడైన సాంబుడు కుష్ఠువ్యాధి పీడితుడు కాగా సూర్యుణ్ణి వేడుకొన్నాడు. సూర్యుడే స్వయంగా ప్రత్యక్షమై మంత్రం ఉపదేశించాడు. ఆ మంత్రానుష్ఠానం ద్వారా సూర్యానుగ్రహంద్వారా సాంబుడు కుష్ఠురోగ విముక్తుడయ్యాడు. సత్రాజిత్తు సూర్య ఆరాధనద్వారా రోజుకు ఎనిమిది బారువుల బంగారం ఇస్తూ రాజ్యంలో వ్యాధి, అరిష్ట, దుర్భిక్ష, దరిద్రాలు తొలగించే సూర్యకాంతిగల శమంతకమణిని పొందాడు. సూర్యానుగ్రహంవలన, శమంతకమణి ప్రభావంవలన సత్రాజిత్తు శ్రీ కృష్ణుణ్ణి తన అల్లుణ్ణి కావించుకోగలిగాడు. ఆవిధంగా శ్రీరామ కృష్ణులు సూర్యానుగ్రహ పాత్రులయ్యారు. వారు సూర్య ఉపాసనా ప్రయోజనాలను అందుకొన్నారు. సూర్య ఉపాసనాసిద్ధిని ప్రసాదించే వ్రతం సప్తమీ వ్రతం. ఈ సప్తమీ వ్రతాన్ని సూర్యుడే తన రథసారథియైన అనూరునకు ఆదరంతో అనుగ్రహంతో ఆచరించమని ఆదేశించాడు. ఉపదేశించాడు. సంవత్సరంలో ప్రతినెలా శుక్ల,కృష్ణ పక్షాలలో వచ్చే సప్తమి రవికి ప్రీతి పాత్రమైనది. మాఘ శుద్ధ సప్తమి నాడు సూర్యుడు ప్రప్రథమంగా రథం అధిరోహించాడు. అది రథసప్తమిగా సూర్యజయంతిగా గుర్తింపబడింది. అందుచేత రవికి ప్రీతిపాత్రమైన తిథి సప్తమి తిథి. మాఘ, ఫాల్గుణ శుద్ధ సప్తములు అత్యంత ఫలప్రదములైనవి. సప్తములలో జయ, విజయ జయంతి, అపరాజిత, మహాజయ, నందభద్ర అనే సప్త సప్తములు విశేషమైన ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నాయి. శుక్లపక్ష సప్తమీ రవి వారం విజయసప్తమిగా పరిగణింపబడుతుంది. ప్రాతఃకాలంలో స్నానం కావించకొని సూర్యునకు హోమంచేయాలి. ఎర్రగన్నేరు పూవులతో, కుంకుమలేపనంతో, విజయ ధూపంతో సూర్యదేవునకు పూజ కావించాలి. మహాశ్వేతమంత్రం జపించాలి. ఆదిత్య హృదయపారాయణం కావాంచాలి. దీనినే విజయ సప్తమీ వ్రతం అంటారు. మాఘ శుద్ధసప్తమికి నందసప్తమి అని పేరు. అగస్త్యకుసుమాలతో, తెల్ల చందనంతో, గుగ్గుల ధూపం వేసి సూర్యునికి పూజజేసి అప్పాలు నివేదనగా సమర్పిచాలి. భాద్రపద సప్తమి అపరాజిత సప్తమి. అది ఆదివారంనాడు వస్తే భద్ర సప్తమి అవుతుంది. హస్తా నక్షత్రంతో కూడిన సప్తమికూడా భద్రసప్తమిగా పిలువ బడుతుంది. అప్పుడు మాలతీకుసుమాలతో, శ్వేతచందనంతో, విజయధూపంతో సూర్యుని అర్చించాలి. పాయసం నివేదించాలి. మార్గశిర శుద్ధ సప్తమి జయంతి సప్తమి. ఆరోజు ఆదివారమైతే అది కామదసప్తమిగా పిలువబడుతుంది. గన్నేరుపూలతో, రక్తచందనంతో, నేతి ధూపంతో సూర్యుని ఆరాధించి జంతికలు నైవేద్యంగా సమర్పించాలి. దక్షిణ, ఉత్తరాయణ సంక్రమణాలు

భానువారంనాడు వస్తే అది సూర్యారాధనకు పరమ పవిత్రమైనది. ఆవిధంగా వచ్చే భానువారాలకు జయ, జయంతులని పేరు. మహాజయమాఘ బహుళ సప్తమి కూడా ఆదిత్య ఆరాధనకు ప్రధానమైనది. భానువారంనాడు గాని, సప్తమినాడుగాని సూర్యునికి గంధోదకం, ఆవుపాలు, ఆవునెయ్యి, కుశోదకంతో అభిషేకం కావించుకోవడం సద్యోఫలప్రదం. సూర్యుని పూజకు మాలతి, మల్లిక, గన్నేరు, జపా, కుందం, పద్మం, కేశుకం వంటి సుగంధ భరితమైన పుష్పాలు నిర్దేశంపబడ్డాయి. బిల్వ, శమీ, తమాల, తులసి పత్రాలు సూర్యదేవుని పూజకు అర్హమైన పత్రాలుగా నిర్ణయింపబడ్డాయి. రక్త చందనం విధిగా సూర్యునికి అర్పించాలి. జిల్లేడు పూలతో ఆకులతో స్నానం కావించి సూర్యారాధన చేయాలి సూర్యపురాణం చదవాలి. అరుణపారాయణం చేయాలి. ఆదిత్య హృదయం పఠించాలి. సూర్యనారాయణ దండకం చదవాలి. ఆవిధంగా సూర్యనారాయణుని పూజించి పాయసం అప్పాలు, జంతికలు, పండ్లు నివేదనగా సమర్పించాలి. సూర్యోపాసన వలన వ్యాధులు, చర్మవ్యాధులు, నేత్రవ్యాధులు నివారింపబడతాయి. భాగ్యం ఆయుర్భాగ్యం కలుగుతాయి.

ఛాందోగ్య బృహదారణ్యక ఉపనిషత్తులందు అక్షి పురుషవిద్యా ప్రకరణంలో చక్షుర్మండల సూర్య మండలాలయందు అభేద దృష్టి నిలిపి ఉపాసన కావించే విధానం ప్రతిపాదింపబడింది. దాని ప్రాతిపదికపై చాక్షుషోపనిషత్తు నిర్మితమై చక్షుష్మతీ విద్యా ప్రభావాన్ని ప్రపంచానికి అందించింది. బత్తీసాయంత్రంతో సూర్య ఉపాసన నిర్దేశింపబడింది. చక్షుష్మతీ విద్యాపాఠ జపం, హోమం నిత్యం చేస్తూ, ఆదివారం నాడు విశేషంగాచేయడంద్వారా అంధత్వాన్ని నిర్మూలించుకొని నివారించుకోవచ్చును. నేత్ర దృష్టిని సంపూర్ణంగా పొందవచ్చును. సర్వలోకచక్షువైన సూర్యభగవానుడే పిండమందు చక్షుశక్తిరూపంలో ప్రవేశిస్తునాడు. అందువలన సూర్యుడు ప్రాణుల దృష్టి శక్తికి కారకుడైన అభీష్టానదైవంగానిర్ణయింపబడ్డాడు. ఈ సూత్రం ఆధారంగా చక్షుష్మతీ విద్య పాఠజప, హోమాదులు కావించడం వలన ప్రాణులకు నేత్రావరోధాలు తొలగిపోతున్నాయి. నేత్రదానాన్ని మించిన సూర్యోపాసనలేదు. నేత్రదానయం చేసినవారు సూర్యానుగ్రహానికి పాత్రులై ఉత్తమగతులు పొందుతారు. ఈవిధమైన సూర్య ఉపాసన తిరుచానూరులోని శ్రీ సూర్యనారాయణస్వామి దేవాలయంలో చేస్తే అతిసులభంగా, శీఘ్రంగా సూర్య ఉపాసనాసిద్ధిని భక్తులు పొందవచ్చును.

కాశ్మీరంలోని శ్రీనగర్ వద్దగల భవాన్ యందలి మార్తాండ దేవాలయం, ఒరిస్సాలో కోణార్కులోని సూర్యదేవాలయాలు ప్రసిద్ధాలు. ఉత్తర ప్రదేశ్‌లోని అల్మోడాలో గయలో (దక్షిణార్క మందిరం), రాజస్థాన్‌లోని రణక్‌పూరులో,

మధ్యప్రదేశ్‌లోని ఖజూరాహూలో, బెల్గాం సమీపంలోని మల్‌తగాలో సూర్యమందిరాలు కూడా సుప్రసిద్ధమైనవే. క్రీ.శ. 4వ శతాబ్దంనుండీ ఆంధ్ర దేశంలో సూర్య ఆరాధన ఉన్నట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. ఆంధ్రదేశాన్ని పాలించిన శాలంకాయనుల కాలంలో వారి రాజధానియైన వేంగీ పట్టణంలో దేవాలయం ఉండేదట. వారికుల దైవం చిత్రరథస్వామి (శ్రీ సూర్యనారాయణస్వామి). 'చిత్రరథ స్వామి' శ్రీరథోత్సవములో తెలుగుపిల్లలు పత్తితిప్పిరెపుడో అంటూ తమ ఆంధ్రప్రశస్తిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వేంగీ చిత్రరథ స్వామిని కీర్తించారు. పశ్చిమచాళుక్యులు, వేములవాడ చాళుక్యులు, గణపతిదేవ చక్రవర్తి వరకు గల కాకతీయులు సూర్యప్రతిష్ఠలు చేసి, సూర్యనమస్కారాలు చేసిన సూర్యోపాసకులే! ఆంధ్రదేశంలో శ్రీకాకుళం జిల్లాలోని అరసవల్లి, తూర్పుగోదావరిజిల్లాలోని పెద్దాపురం, గొల్లలమామిడాలలోని సూర్యదేవాలయాలు దర్శనీయమైనవి. కాగా తిరుచానూరులో పద్మావతీ పద్మసరోవర తీరంలో శ్రీనివాసుడు ప్రతిష్ఠించిన శ్రీసూర్యనారాయణమూర్తి బహు ప్రాచీనుడు. పురాణ ప్రసిద్ధుడు. అలమేలు మంగాపురంలోని శ్రీ సూర్యనారాయణుడు శ్రీనివాసుడు లక్ష్మీపూజకై పద్మసరోవరంలో దేవలోకంనుండి సేకరింపజేసి నెలకొల్పిన స్వర్ణ కమలాలను పన్నెండు సంవత్సారాలు వికసింపజేసి లక్ష్మీనారాయణుల కృపకు పాత్రుడయ్యాడు. శ్రీనివాసుడు పద్మసరోవరతీరంలో కావించిన పన్నెండు సంవత్సరాల తపస్సుకు ఈ కర్మసాక్షి ప్రత్యక్ష సాక్షి. మూడు పూటలా లక్ష్మీ సహస్ర నామార్చనకు శ్రీనివాసునకు స్వర్ణకమలాలు సమకూర్చిన శ్రీ హరి పాదసేవకుడు తిరుచానూరు శ్రీ సూర్యనారాయణుడు. లక్ష్మీదేవి ప్రత్యక్షం కావడం, లక్ష్మీనారాయణులు సమాగమ సౌఖ్యం పొందడం వంటిలోకొత్తరమైన కార్యాలు నెరవేరడానికి కారకుడు ప్రేరకుడు అలమేలు మంగాపుర మందలి శ్రీసూర్యనారాయణస్వామి! ఆస్వామిని సేవిస్తే ఆదిత్యుని అనుగ్రహం లభిస్తుంది. లక్ష్మీనారాయణుల కటాక్షం ప్రాప్తిస్తుంది. పద్మావతీ శ్రీనివాసుల దయ కలుగుతుంది. మయూరుడు ప్రాచీన సంస్కృత కవి. అతడు సూర్యస్తోత్రాత్మకంగా 'సూర్యశతకమ్' రచించాడు. దీని రచన ద్వారా తన కుష్ఠురోగనివారణ కావించుకొన్నాడట. ఆశతకంలో **102**శ్లోకాలు ఉన్నాయి. ప్రభావర్ణనం, అశ్వవర్ణనం, అనూరువర్ణనం, రథవర్ణనం, మండల వర్ణనం, రవివర్ణనం, అనే వర్ణనలతో సూర్య శతకమ్ నిండి ఉంది. వీనిలో క్రమంగా సూర్యకిరణాలు, అశ్వాలు, సారథి, రథం, మండలం, రవిబింబం వర్ణింపబడ్డాయి. ఈ సూర్య శతకాన్ని ఎందరో తెనిగించగా, దీనిలోని **13**శ్లోకాలను స్వీకరించి శ్రీనాథమహాకవి తన కాశీఖండంలో అనువాదం కావించాడు. కాలమనే మహా సర్పం నోట్లో అన్ని ఇంద్రియాల వ్యాపారాలు స్తంభించిపోయి చైతన్యం

కాని స్థితిలో ఉండగా కేవలం ఊపిరిమాత్రమే ఆడుతూండగా, తమను తామే మరచి నిద్ర నిద్రాముద్రితమైన జీవరాశిని, పాముకాటుకు వశమైన జీవరాశిని విషవైద్యుడు పునరు... చేసినట్లు సూర్యభగవానుడు మేలు కొల్పుతున్నాడు."నిదురలో లేదు సుగతి కనువిచ్చిచూ... ...గతి" అనే సందేశం సూర్యుడు అందిస్తున్నాడు. "ప్రపంచం ఉద్యానవనం. రాత్రి ... వెన్నెల జలం. దాన్ని అమృతంగా తూర్పుకొండ గ్రహించి పాదుగా అంకురించం.. దినం అనే చెట్టు మెలకలే ఉదయభానుని కిరణాలు. అవి ఉజ్జ్వల సంపదలు ప్రసాదించుగాక! ఆకాశం ఉద్యానవనం. చీకటే బురద. దానినుండి ఉద్భవించిన సూర్యుడే పద్మం. రాహువు తుమ్మెద. సూర్యకిణాలు పద్మదళాలు. అవి కల్యాణ పరంపరలు కల్గించుగాక" అంటూ మయూరుడు తన సూర్యశతకంలో సూర్యుణ్ణి ప్రార్థించాడు. మనంకూడా మయూరకవి ఎలె రవిని ప్రార్థించి భోగమోక్షాలను పొందుదాము.

## కృష్ణం వందే జగద్గురుమ్

అలవేలు మంగాపురం చేరుకుని పద్మసరోవరంలో స్నానం చేసి శ్రీసూర్యనారాయణ స్వామిని దర్శించి, పూజించిన పిమ్మట భక్తులు పద్మావతీ దేవి దేవాలయ ప్రాంగణంలోనికి ప్రవేశిస్తారు. అసువిశాలమైన దేవాలయ ప్రాంగణంలోనికి సమున్నతమైన ముఖద్వార గోపురంగుండా చేరుకుంటారు. అదివ్య ప్రాంగణంలో బలరామకృష్ణుల దేవాలయం. సుందరరాజస్వామి దేవాలయం, శ్రీ పద్మావతీదేవి దేవాలయం నెలకొని ఉన్నాయి. ప్రవేశద్వార గోపురం ఎదురుగా శ్రీ కృష్ణబలరాముల దేవాలయముంది. అది రాజద్వార గోపురం ఎదురుగా ఉన్న శ్రీకృష్ణ మందిరం, మహాభారతం, భాగవతం, అష్టాదశపురాణాలు రచించిన వేద విభాగం కావించిన వేద వ్యాసమహర్షి తనయుడు శ్రీశుకుడు. పద్మావతీ శ్రీనివాసుల కల్యాణ నిర్వహణ కారకుడు శ్రీ శుకుడు. బ్రహ్మసభనుండి వేంకటాచలానికి వచ్చి పుణ్య తీర్థాలను సేవించి ఆకాశవాణి ఆదేశం శిరసావహించి పద్మావతీ పద్మ సరోవర తీరంలో శ్రీశుకుడు తపస్సు కావించాడు. తపోభంగం చేయడానికి ఇంద్రుడు ప్రయత్నించగా శ్రీనివాసుని రక్షణను పొందాడు. శ్రీనివాసుడు ప్రత్యక్షంకాగా శ్రీశుకుడు ఆనందనర్తనం కావించాడు. పిమ్మట భరద్వాజాది ఆరుగోత్రాలతో కూడిన 108 మంది బ్రాహ్మణులను సృష్టించి వారికి శ్రీశుకపుర అగ్రహారం ప్రతిష్ఠించాడు. తాను తపస్సు కావించిన స్థలంలో, శ్రీనివాసుడు ప్రత్యక్షమై మోక్షం ప్రసాదిస్తానన్న దివ్య స్థలంలో దేవకీవసుదేవులకు యశోదా నందగోపులకు ఆనంద వర్థకులైన శ్రీ బలరామకృష్ణులను

శ్రీ ... ప్రతిష్ఠించి ధన్యుడయ్యాడు.

"వైకుంఠే యథావాసః క్షీరాంభోధౌయథా విభో
...సోయథాంతరాదిత్యే యోగినాం హృదయేయథా
...దాకురుష్వాత్ర సన్నిధిం కమలేక్షణ"

"శ్రీ పుండరీకాక్షా! వైకుంఠంలోను, క్షీరసముద్రంలోను, శ్వేద్వీపంలోను, సూర్యమండలంలోను, యోగులహృదయ మందిరంలోను నీవు ఏవిధంగా అధివశిస్తున్నావో ఆవిధంగానే ఈ శ్రీ శుకపురంలో, పద్మావతి ఆవిర్భవించిన దివ్య క్షేత్రంలో నీ నిత్య నివాసంతో భక్తులకు నీ నిత్య సాన్నిధ్యం, సాన్నిహిత్యం ప్రసాదింపుమని ప్రార్థిస్తూ శ్రీ శుకుడు బలరామకృష్ణులను సుప్రతిష్ఠులను కావించాడు. ఈ శ్రీకృష్ణమందిరం ఆవిధంగా పౌరాణిక ప్రసిద్ధిని సంతరించుకొంది. ఇది బహుప్రాచీనమైన దేవాలయంగా పరిగణింపబడుతోంది. ఈ కృష్ణాలయం వెలసిన స్థలంలో ఒకనాటి 'బాలాజీ తెరువిలాన్ కోవిల్' నెలకొంది అన్నది ఒకవాదన. తిరుమలలో శ్రీవరాహస్వామి ప్రథమ దర్శనం, ప్రథమ అర్చనం, ప్రథమనివేదనం జరిగిన పిమ్మటనే శ్రీవేంకటేశ్వర స్వామికి దర్శన, అర్చన, నివేదనాలు జరుగుతాయి. అదేవిధంగా పూర్వకాలంనుండి శ్రీ బలరామశ్రీకృష్ణులకు నివేదన పిమ్మటనే పద్మావతీదేవికి నివేదన జరిగే ఆచారం నేటికీ కొనసాగుతోంది. చరిత్రలో శ్రీ కృష్ణమందిరం ఆలజియ్యా పెరుమాళ్ళు ఆలయంగా వ్యవహరింపబడింది. ఈ దేవాలయపు ప్రశస్తి క్రీ.శ.**1221** సం.ములో కనపడుతోంది. ఈగుడికి సంబంధించిన చివర శాసనం క్రీ.శ. **1552**సంవత్సరములో నెలకొల్పబడింది. అందుచేత బలరామకృష్ణులు దేవాలయం క్రీ.శ. **12**వ శతాబ్దంనాటికే ప్రాముఖ్యం వహించినట్లు క్రీ.శ. **1221**సం.ము నాటి శాసనం వలన మనం నిర్ధారించుకొనవచ్చును. తిరుచానూరు శ్రీకృష్ణమందిరం క్రీ.శ. **12-16**శతాబ్దుల మధ్య విశేషమైన ప్రాముఖ్యం పొందింది. క్రీ.శ. **15** శతాబ్దంలోసాళ్వనరసింహరాయులు, కందాడైరామానుజయ్యంగార్ శ్రీకృష్ణ స్వామికి విశేషమైన సేవలు కావించే యేర్పాట్లు చేసి శ్రీ కృష్ణభక్తుల ప్రశంసలు అందుకొన్నారట. శ్రీ కృష్ణాలయం గర్భగృహం, అంతరాలయం, ముఖ మండపంతో చూపురలను ఆకర్షిస్తూంటుంది. వీని నిర్మాణంలో చోళ, విజయనగర శిల్ప రచనా సమ్మేళనం కనపడుతుంది.

పద్మావతీ దేవాలయపు ప్రాంగణంలో మొత్తం మూడు గుడులు ఉన్నాయి. రాజ గోపురం ఎదురుగా ఉన్నది శ్రీకృష్ణుని గుడి. శ్రీ కృష్ణుని దేవాలయం ఉంది. శ్రీకృష్ణుని దేవాలయానికి దక్షిణంగా శ్రీ సుందరరాజ స్వామిదేవాలయం ఉంది. శ్రీ సుందరరాజస్వామివారి ఉత్సవ విగ్రహం మాత్రం **1905**సం.ము వరకు శ్రీ పద్మావతీదేవి

సన్నిధానంలో ఉంచి పూజాదికాలు నిర్వహించేవారట హాత్తీరాంజీ మఠానికి చెందిన శ్రీమాన్ మహంతు ప్రయాగ దాస్‌జీ వారు తిరుమల తిరుపతి దేవాస్థానాలకు విచారణ కర్తగా క్రీ.శ.**1901** నుండి **33** సంవత్సరాలు వ్యవహరించారు. వారి కాలంలో గోపురాలు, సోపానమార్గాలు బాగుచేయబడ్డాయి. వారే ఆనంద నిలయ విమానానికి ఆరవసారి **1908** వ సం.లో బంగారుపూత వేయించారు. వారి నిర్వహణలో ఎంతో అభివృద్ధి జరిగింది. వారి కాలంలో జూన్ **1905** సం.ములో శ్రీదేవీ, భూదేవీ సమేత శ్రీ సుందరరాజస్వామి వారి విగ్రహాలు ప్రతిష్ఠింపబడ్డాయి. ఈనాటి సుందరరాజస్వామి వారి దేవాలయపుస్థలం శ్రీవరదరాజస్వామి దేవాలయమని కొందరి ఊహ. శ్రీదేవి, భూదేవి సమేత శ్రీ సుందర రాజ స్వామి విగ్రహాల ముందు ఆస్థానంలో శ్రీ వరదరాజ స్వామి విగ్రహం పూర్వం ఉండేదట. ఆ విగ్రహం నేడు శ్రీ సూర్యనారాయణస్వామి దేవాలయ సమీపానకు చేర్చ బడినట్లు స్థానికుల భావన. వరదరాజ స్వామి కారణంగానే శ్రీ శుకపురం నాడు వదిరాజపురంగా, వరదరాజపురంగా పిలువబడింది. క్రీ.శ. **1541, 1547** నాటి శాసనాలలో శ్రీ వరదరాజస్వామి వైభవం, ఉత్సవ వైభవం వర్ణింపబడ్డాయి. క్రీ.శ. **1541**సం.ము నాటి శాసనంలో శ్రీవరదరాజస్వామి రథోత్సవపు వేడుకలు వివరింపబడ్డాయి. క్రీ.శ.**1547**వ సం.ము నాటి శాసనం శ్రీ వరదరాజస్వామి వారి బ్రహ్మోత్సవం, అధ్యయనోత్సవం గూర్చి ఉగాది, దీపావళి ఉత్సవాలను గూర్చి వర్ణించింది. శ్రీ వరదరాజస్వామి శ్రీదేవి, భూదేవి సమేతుడై శంఖ చక్రధారుడై వరదముద్రాలంకారుడై భక్తులను అనుగ్రహించినట్లు అభివర్ణింపబడ్డాడు. తిరుచానూరు వెళ్ళిన తిరుపతి యాత్రికులు శ్రీ సూర్యనారాయణ స్వామిని, శ్రీ బలరామకృష్ణులను శ్రీసుందర రాజస్వామిని, శ్రీవరదరాజస్వామిని దర్శించుకొని పూజించుకొని తరిస్తారు. ఆదేవతామూర్తుల అనుగ్రహానికి పాత్రులవుతారు. పిమ్మట అలమేలు మంగాంబకాదేవి దివ్య దేవాలయ ప్రాంతంలోనికి అలమేలు మంగమ్మను దర్శించుకోవడానికి ప్రవేశిస్తారు. "కృష్ణంవందే జగద్గురుమ్" అనుకుంటూ అలమేలు మంగను సేవించడానికి భక్తులు ముందుకు సాగుతారు.

## పద్మావతీ పద్మ సరోవరం

శ్రీ పద్మావతీ దేవి దేవాలయానికి పశ్చిమోత్తర భాగంలో ఉన్న తీర్థం పద్మావతీ పద్మ సరోవర తీర్థం. వరాహపురాణంలోని తొమ్మిదవ అధ్యాయం పద్మాసరోవరపు మహిమను ప్రస్తావించింది. పద్మపురాణమందలి **34**వ అధ్యాయంకూడా పద్మాసరోవరపు

వైభవాన్ని ఆవిష్కరించింది. పద్మసరోవరం శ్రీహరి చేత నిర్మితమైంది. పద్మ సరోవరతీరంలోనే శ్రీ మహావిష్ణువు పన్నెండు సంవత్సరాలు లక్ష్మీ కటాక్షం కోసం, మహాలక్ష్మీ దర్శనంకోసం తపస్సు కావించాడు. ఆపద్మ సరోవరంలోనే మహాలక్ష్మి పద్మావతిగా ఆవిర్భవించింది. మహాలక్ష్మిని పొందిన శ్రీనివాసుడు "ఓ పద్మ సరోవరమా! నీతీరంలో 12 సంవత్సరాలు తపస్సు చేసి, నీ సరోవర జలంలోని మహాపద్మంలో పద్మావతీ సాక్షాత్కారం పొందాను. కనుక నేటి నుండి ముల్లోకాలలో పద్మావతీ పద్మసరోవరంగా సుప్రసిద్ధమవుతావు. నీలో క్రుంకులిడినవారి పాపాలను హరిస్తావు. వారి సకల కోరికలు నెరవేరుస్తావు" అని వరం ప్రసాదించాడు. ఆపద్మ సరోవరాన్ని శ్రీ శుకుడు సేవించి ఆసరోవరతీరంలో తపస్సు కావించి శ్రీనివాసుని అనుగ్రహానికి పాత్రుడై మోక్షం పొందేవరం అందుకొన్నాడు. మహర్షులు పద్మసరోవరాన్ని సేవించి దాని పవిత్రతను గూర్చి ప్రశంసలు కావించారు.

"పద్మ సరోవరంలో స్నానం కావించిన వాడు సప్త జన్మల పాపాలను హరింపచేసికొని సప్తగిరీశునివలె నిర్మలుడవుతాడని" నారద మహర్షి కీర్తించాడు.

"స్వర్ణముఖరీనదీతీరంలోని కాంచన పద్మ సరోవరంలో స్నానం చేసిన వారు కోటి జన్మల పాపాలనుండి విముక్తులై సకల భోగభాగ్యాలను పొందుతారని"వసిష్ఠ మహర్షి పద్మసరోవర ప్రశంస కావించాడు. "అత్రి మరీచులు స్నానం కావించిన క్షణమాత్రంలోనే పాతకాలను హరించే శక్తిగల తీర్థం పద్మ సరోవర తీర్థమని" వర్ణించారు "పదవీ భ్రష్టుడైనవాడు నలభైరోజులు దీనిలో స్నానం చేస్తే పదవీలాభం, రాజ్యలాభం పొందుతాడని అంగీరసుడు ప్రవచించాడు. కర్మ, ధర్మ, మంత్ర భ్రష్టులైనవారు దీన్ని సేవిస్తే పరమ పవిత్రులవుతారని" పులస్తుడు ప్రకటించాడు. వంచకులు దీని స్నానం వలన ధార్మికులుగా మారుతారని పులహోడు అభివర్ణించాడు. " పరులను ద్వేషంతో దూషించే వారు దీనిలో స్నానం కావిస్తే వారు శాంత స్వభావులై పరోపకారపరాయణులై, జీవకారుణ్యంతో ప్రవర్తించే వారుగా మార్పు చెందుతారని" క్రతువు వాక్రుచ్చాడు. ఈ పద్మ సరోవరం లక్ష్మీ, లక్ష్మీనాథుల ప్రణయ కలహనివృత్తి స్థానం. ఆ ప్రణయ దంపతుల ఆనందానుభవ, రస, భావ ప్రవృత్తి స్థానం. ఆపద్మ సరోవర తీరం అష్టమహర్షులకు సభాస్థానం. ముక్కోటి దేవతలకు సభావేదిక. శ్రీశుకుని తపోభూమి. పద్మసరోవర స్నానం వలన నిత్యానందం. శాశ్వత భాగ్యం, ప్రశాంత చిత్తం, సర్వ పాపక్షయం, మోక్షసాధనం కలుగుతాయని వరాహ, పద్మ పురాణాలు వివరించాయి. మహర్షులు వాక్కులు నిర్ధారించాయి.

పూర్వకాలాన ఆగ్రహావేశపరవశుడైన దుర్వాసమహర్షి శాపఫలితంగా లక్ష్మీ

నారాయణులు వైకుంఠాన్ని వదలి వెళ్ళిపోయారు. తిరుచానూరులోని పద్మ సరోవరం పరిపూర్ణమైన పద్మాలతో ప్రకాశిస్తూ వారిని ఆకర్షించి వారికి స్వాగతం పలికింది. ఆదివ్య మనోహరమైన సరోవరతీరంలో వారు విడిది చేసారు. శ్రీనాథుని సమక్షంలో శ్రీదేవి పద్మసరోవరతీరంలో అనేక సంవత్సరాలు తపస్సు కావించింది. దేవతలు సమస్త్యైశ్వర్య ప్రదాతలైన లక్ష్మీనారాయణులను కానలేక వారిని ఇంద్రుని నాయకత్వంలో అన్వేషించడానికి బయలుదేరారు. సమస్త ప్రపంచాన్ని వారికోసం వెదకి చివరకు పద్మసరోవరతీరానికి చేరుకున్నారు. ఆమహా లక్ష్మిని దర్శించిన దేవతలు చతుర్వింశతి నామాలతో స్తోత్రం కావించి పూజించారు. జగన్మాత పద్మావతీ మహామాత దేవతల అర్చనలు అందుకొని వారిని అనుగ్రహిస్తూ" ఈ పద్మ సరోవరం నాకు పరమప్రీతి ప్రాత్రమైనది. శ్రీనివాసునకు ప్రేమ పాత్రమైనది. శ్రీ సతినైన నన్ను స్తుతిస్తూ, ధ్యానిస్తూ, పూజిస్తూ ఈపద్మ సరోవరంలో స్నానం కావించేవారు సకల సంపదలు, సమస్త భోగాలు, ఆయుర్భాగ్యాలు పొంది దేహానంతంలో నిత్యానందం పొందుతారని" వరప్రదానం కావించింది. అట్టి పద్మ సరోవరాన్ని సేవించి పద్మావతీదేవిని ధ్యంచడం సర్వశ్రేయోదాయకం.

# పద్మావతి చరిత్ర

శ్రీపద్మావతీ పద్మసరోవరం సేవించిన పిమ్మట యాత్రికులు శ్రీ పద్మావతీదేవిని దర్శిస్తారు. శ్రీ పద్మావతీదేవి ఆలయ ప్రాంగణంలో శ్రీ సుందరరాజ, శ్రీబలరామకృష్ణ పద్మావతీ దేవాలయ సముదాయం నెలకొంది. రాజగోపురానికి ఎదురుగా ఉన్న శ్రీ బలరామకృష్ణ దేవాలయానికి ఉత్తరంగా శ్రీ పద్మావతీ దేవి దేవాలయం ఉంది. తిరుచానూరులోని దేవాలయాలను ప్రాచీన కాలంలో చోళరాజులు పాలించి, పోషించి, అభివృద్ధి కావించినట్లు శాసనాధారాలు కనిపిస్తున్నాయి. తిరుచానూరు తిరుపతి పట్టణం కన్న ప్రాచీనమై పల్లవ చోళరాజుల కాలంలో ప్రాభవం పొందినట్లు, ప్రాముఖ్యం వహించినట్లు తెలుస్తోంది. తిరుమల దేవాలయాన్ని కూడా తిరుచానూరు సభ పాలించింది.

తిరుచానూరులోని పద్మావతీ దేవాలయ సముదాయ ప్రాంగణం ఒకనాడు తిరుచానూరు సబైయ్యార్ల ముట్టాజియమట. తిరుచానూరు సభవారి ధనాగారాన్ని, ధాన్యాగారాన్ని సబైయ్యార్లు ముట్టాజియంగా మార్చినారట. అలమేలుమంగాపురం చుట్టు ప్రక్కల పడిపోయిన ఆలయ శిథిలాలతో ఒక పెద్దకోట వలె [illegible] రూపొందించారు. తిరుచానూరు సన్నిధికి తూర్పుగల శిథిలాలయాల [illegible]

బలరామకృష్ణుల విగ్రహాలను మ్యూజియమునకు తరలించి దానిలో నెలకొల్పారు. ఆనాటి తిరుపతి గ్రామదేవత తిరుపతమ్మను తిరుచానూరు మూజియమునకు సబైయ్యార్‌లు తీసికొనివచ్చారు. తిరుపతి గ్రామదేవత తిరుపతమ్మ స్థానంలో అంకాలమ్మను నిలిపి అంకాలమ్మను తిరుపతి గ్రామదేవతను కావించారు. తిరుపతమ్మ తరలింపు విషయంలో ఎదురైన తిరుపతి ప్రజల ప్రతిఘటనను, నిరసనను అంకాలమ్మను తిరుపతమ్మ స్థానంలో నెలకొల్పడంద్వారా తిరుచానూరు సబైయ్యార్‌లు శాంతింపజేసారు. ఉపశమింపజేశారు. తిరుచానూరు సబైయ్యార్‌లు ప్రజల వ్యతిరేకతనుండి బయటపడినా చంద్రగిరినవాబు విచారణ నుండి తప్పించుకోలేకపోయారు. చంద్రగిరి నవాబు తిరుచానూరు సబైయ్యార్‌లను మూజియమునిర్మాణం, విగ్రహాల తరలింపు వ్యవహారాలను గూర్చి నిలదీసి నిజానిజాలను వివరించమన్నాడు. వారు స్థానిక దేవాలయాలు భిన్నమై శిథిలమైపోయినవని వానిలోని దేవతామూర్తులకు అర్చనలు నివేదనలు నిలిచిపోయాయని అందుచేత ఆదేవతామూర్తులకు సక్రమంగా నిత్యధూపదీపనైవేద్యలు కావించాలనే సత్సంకల్పంతో మ్యూజియము నిర్మాణం కావించనట్లు, దానిలోనికి దేవతామూర్తులను తరలించినట్లు వారు సమాధానం చెప్పుకొన్నారు. చంద్రగిరినవాబు ఆమ్యూజియమును దేవాలయసముదాయంగా మార్చి దేవతామూర్తులకు నిత్యార్చనలు, ధూపదీపనైవేద్యాలు సమర్పించమని ఆదేశించాడు. ఆవిధంగా తిరుచానూరు పద్మావతీ దేవాలయసముదాయం రూపు దాల్చింది. తిరుపతి గ్రామ దేవతనే తిరుచానూరులో పద్మావతిగా సబైయ్యార్‌లు నెలకొల్పారట". ఇది తిరుచానూరు పద్మావతీ దేవాలయ సముదాయం గూర్చి, పద్మావతిని గూర్చిన శ్రీ గోపీకృష్ణ కథనం, ఈకథనాన్ని "శ్రీనివాసమంగాపురం మరియు మన ఆలయముల చరిత్ర"లో శ్రీ గోపీకృష్ణ అందించారు.

వెయ్యి తిరుపతి శాసనాలలో ప్రప్రథమంగా శ్రీ అలమేలుమంగనాచ్చియార్ సన్నిధి క్రీ.శ. **1477** సం.పు శాసనంలో ప్రస్తావింపబడింది. అందుచేత క్రీ.శ.**15** వ శతాబ్దం చివర పద్మావతీ దేవాలయం నిర్మాణమైనట్లు భావింపవలసివస్తోంది. నైజాము కర్ణాటక దండయాత్ర సమయంలో క్రీ.శ. **1743**వ శ్రీ పద్మావతీ దేవాలయం కూల్చబడినదట. నిజాము సైన్యాల వలన అమ్మ వారి విగ్రహం విరగకొట్టబడిందట. ఆ ఉత్సవ విగ్రహం మాత్రం తిరుపతిలోని నమ్మాళ్వారు కోవెలలో ఆశ్రయం పొంది రహస్యంగా రక్షింపబడింది. ఈ సంఘటన జరిగిన తరువాత పద్మావతీదేవి ఆలయనిర్మాణానికి, విగ్రహ ప్రతిష్ఠకు సుమారు **25**సంవత్సరాలు పట్టింది. ఉదారచరితుడు, పరమ ధార్మికుడు, స్థానిక వైద్యుడైన శ్రీతిరుమలరావు, మద్రాసులోని దుబాషీ అయిన ఓచ్చు నారాయణపిళ్ళై తమ సంయుక్త కృషి ద్వారా పునాదులు వేసి ప్రాకారం నిర్మించారు. తదుపరి స్థానికులైన జమీందారులు, భూస్వాములు, ధనవంతులు ఆర్థిక సహకారం అందించి ఆలయనిర్మాణం పూర్తి కావించి శ్రీ పద్మావతీ దేవిని సుప్రతిష్ఠితం

కావించారు. సుమారు క్రీ.శ. **1773** వ సంవత్సరంలో అమ్మవారు ప్రతిష్ఠింపబడ్డారు. ఈవిషయం తూర్పు ఇండియా కంపెనీవారి సవాల్– ఇ– జవాబ్ పట్టిక వలన తెలుస్తోంది. ఈదేవాలయానికి దేవాదాయం సమకూర్చే భూములు లేవు. భక్తుల పూజలవలన, కానుకల వలన మాత్రమే ఆదాయం వచ్చేది. క్రీ.శ. **1818**సం.ములో **5** వరహాలు అంటే **13**రూపాయల రెండు అణాలు కాని అంతకుపైన వచ్చే ఆదాయంగాని అర్చకులకు చెందెడిది. దాని కంటే తక్కువగా వచ్చే కానుకలు దేవస్థానానికి లభించేవి. **1914** సం.ములో అర్చనలకు, హారతులకు, సేవలకు టిక్కట్లు ప్రవేశపెట్టబడి వానిద్వారా వచ్చే ఆదాయం అర్చకులు, దేవస్థానం వాటాలుగా పంచుకొనే యేర్పాటు చేయబడింది. నేడు తిరుచానూరు శ్రీ పద్మావతీ దేవాలయం సుప్రసిద్ధమై తిరుమలతో సమానమైన యాత్రాస్థలమై, పుణ్య క్షేత్రమై భారత దేశంనుండి, ప్రపంచం నలుమూలలనుండి యాత్రికులను భక్తులను ఆకర్షిస్తోంది. ఒకనాటి ఉదయం అనగా క్రీ.శ.**1750** సం.ము ప్రాంతంలో అలమేలుమంగ కరివేపాకు కోసం మంగాపురం వచ్చి అక్కడే ఉండిపోవడంవలన మంగాపురం అలమేలు మంగాపురమైనదని ఒకకథ ప్రచారంలో ఉంది. అమ్మవారు తిరుమల నుండి మంగాపురానికి వస్తూండగా దారిలో వాన వచ్చిందట. ఆమె అచ్చట ఒకపేటి క్రింద నిలబడింది. ఆ పేటిని చారల పేటి అంటారు. దాని మీద భక్తాంజనేయ శిల్పం రమణీయంగా సాక్షాత్కరిస్తూంటుంది. దీని సమీపంలోనే భాష్యకారుల సన్నిధి ఉంది. మేనమామ తిరుమలనంబి వద్ద శ్రీరామానుజులవారు రామాయణ పాఠం నేర్చుకొన్న స్థలమది. అది సాలగ్రామ శిలామయమైన మోకాలి మెట్టు పై ప్రాంతం. అచ్చటకు సమీపంలోనే అలమేలు మంగ మంగాపురానికి కరివేపాకుకు వెడుతూ వానలో తడవకుండా నిలచిన తావు ఉంది. అలమేలుమంగాదేవి పరమపవిత్రమైన పాదస్పర్శతో పునీతమైన చారలపేటి మనకు సదా దర్శనీయం. సమార్చనీయం.

## పద్మావతీ దర్శనం

శ్రీనివాసుడు తపస్సుకావించగా పద్మ సరోవరంలో మహాలక్ష్మీదేవి పద్మావతి దేవిగా ప్రత్యక్షమై శ్రీనివాసుని వక్షస్థలాన్ని అలంకరించింది. పద్మ సరోవర ప్రాంతంలో మహాలక్ష్మీదేవి తపస్సు కావించింది. శ్రీనివాసునకు సాక్షాత్కరించిన శ్రీ మహాలక్ష్మిని పద్మ సరోవర తీరంలో తపస్సుకావించిన మహాలక్ష్మిని, పద్మావతీదేవిగా అలమేలుమంగాపురంలో సుప్రతిష్ఠితం కావించి పూజిస్తున్నారు. శ్రీనివాసుని దేవేరి పద్మావతీదేవి. చరిత్ర ఏవిధంగా

ప్రతిపాదించినా పురాణ ప్రమాణంగా శ్రీనివాస ప్రభుని దివ్య దేవేరిగా పద్మావతీ దేవిని అలమేలు మంగా పురంలో భక్తులు నిలుపుకోని, పద్మావతిగా, అలమేలుమంగగా పిలుచుకొంటూ కొలుచుకొంటున్నారు. శ్రీ పద్మావతీదేవి దేవాలయానికి రాజగోపురంనుండి ప్రవేశిస్తూ శ్రీకృష్ణమందిరానికి ఉత్తరంగా వెళ్ళాలి. శ్రీపద్మావతీదేవి దేవాలయ సముదాయ ప్రాంగణం సువిశాలంగా ఉంటుంది. తూర్పు భాగంలో కల్యాణ మండపం ఉంది, దాని సమీపంలోనే ముఖ మండపం ఉంది. ముఖమండపాన్ని చేర్చి అంత రాలయం కనపడుతుంది. అంతరాలయ సమీపంలో అలమేలు మంగాదేవి గర్భాలయం[illegible]రి ఉంది. గరుడుడ, విష్వక్సేనుడు భక్తులకు దర్శనమిస్తారు. బంగారు ధ్వజస్తంభం అమ్మవారి భక్తులను ఎంతగానో ఆకర్షిస్తుంది. ఆనంద పరవశులను కావిస్తుంది. నాలుగు మూలలా నాలుగు సింహపు విగ్రహాలు దేవీభక్తులను ఆహ్వానిస్తాయి. రామాయణ, భారత, భాగవత కథా శిల్పాలు యాత్రికుల్ని ముగ్ధులను కావిస్తాయి. రామకృష్ణావతార గాథలు మనలను ఉత్తేజితులను చేస్తాయి. ఈవిధంగా గోచరించే రమణీయమైన కమనీయమైన, మహనీయమైన దృశ్యాలను తిలకిస్తూ పద్మావతీదేవాలయ విమానపు ప్రదక్షిణం చేసి అమ్మవారి ఆలయంలో ప్రవేశించింతనే పద్మావతీ దేవి దివ్య దర్శన మహాభాగ్యం మనకు లభిస్తుంది. మననోముల పంటగా, మన పుణ్యముల ఫలంగా, జన్మ జన్మల సుకృతాల శుభఫలితంగా పద్మావతీ దేవి దర్శనం మనకు ప్రాప్తిస్తుంది. పద్మాలయా, పద్మాసనా, పద్మవదనా, పద్మనయనా, పద్మకిరీటధారిణే, పద్మప్రియా, పద్మహస్తా, పద్మపాదా, పద్మవర్ణా, పద్మ మాలాధరా, పద్మప్రభా, పద్మగంధినీ, పద్మినీ, పద్మసుందరీ, పద్మావతీ మహామాతా" అని స్తుతిస్తూ, ప్రస్తుతిస్తూ, నుతిస్తూ ఆలయంలో పద్మావతీదేవి అభయ వరద ముద్రలతో అనుగ్రహించే వరాలను భక్తులు అందుకొంటారు. ఆమె దర్శనంతో చిత్త శాంతిని పొందుతారు. ఆత్మానందాన్ని అనుబవిస్తారు. మనస్సులో తేనెవాన, అమృత వర్ష కురిసిన అనుభవం భక్తులు పొందుతారు.

"అగ్రే భర్తుః సరసిజమయే భద్రపీఠే నిషణ్ణాం
అంభోరాశే రధిగత సుధా సంప్లవదుత్థితాం త్వాం
పుష్పాసార స్థగితభువనైః పుష్కలావర్తకాద్యైః"
క్లప్తారంభాః కనకకలశైరభ్యషించన్ గజేంద్రాః

——————శ్రీవేదాంతదేశికులు

"భృగు మహర్షి వృత్తాంతం కారణంగా ఆవేదనతో ఆగ్రహించి అంతర్ధానమైన మహాలక్ష్మీదేవి శ్రీనివాసుని తపస్సువలన భర్తముందర పద్మమయమైన ఈతిరుశుకనూరు

పద్మ సరోవరంలో ఉద్భవించిన శుభసమయంలో పుష్కలావర్తక మేఘాలు పుష్ప వర్షం కురిపించగా చూచిన గజేంద్రాలు కనక కలశాలతో ఓ పద్మావతీదేవీ! నీకు అభిషేకం కావించాయి" అని శ్రీవేదాంతదేశికాచార్యవరులు పద్మావతీదేవిని వర్ణించారు. వేదాంతదేశికులు ఆవిష్కరించిన పద్మావతీదేవి దృశ్యం భక్తుల హృదయాలలో అమ్మ దర్శన సమయంలో ప్రతిఫలించి, ప్రతిబింబిస్తుంది.

## నిత్య సేవలు – ఆర్జిత సేవలు

ఉదయం **5** గం. లకు సుప్రభాత సేవతో ప్రారంభం అవుతుంది. శ్రీ పద్మావతీదేవి నిత్య సేవాకార్యక్రమం ఆర్జిట అమ్మవారికి ఉదయం **5.30** గంటల నుండి **6** వరకు సహస్రనామార్చన జరుగుతుంది. ఉదయం **6** గం. నుండి **11.30** గం. వరకు మరల **12** గం. నుండి సాయంత్రం **6** గం. వరకు సర్వ దర్శనభాగ్యం భక్తులకు లభిస్తుంది. మరల సాయంత్రం **6.30** గం. నుండి రాత్రి **8.40** గం. వరకు పద్మావతీదేవి ఉచిత దర్శనం ఉంటుంది. రాత్రి **9** గం. నుండి **9.30** గం. వరకు జరిగే ఏకాంత సేవతో పద్మావతీదేవి నిత్య సేవా కార్యక్రమం పరిసమాప్తమవుతుంది. పాంచరాత్రాగమ విధేయంగా అర్చనలు నివేదనలు ఉత్సవాలు నిర్వహింపబడతాయి.

అమ్మవారికి అష్టోత్తార్చన, హారతి కావించుకొని సేవించుకొనవచ్చును. దేవస్థానానికి నిర్ణీత రుసుము చెల్లించడంద్వారా గృహస్థులు పద్మావతీదేవికి తిరుచ్చి ఉత్సవం, గజవాహన సేవ కావించుకొని తమ జీవితాలు ధన్యమైట్లు భావిస్తూంటారు. గురువారం నాడు అమ్మవారికి తిరుప్పావడా సేవ ఉదయం **11** గం. నుండి మధ్యాహ్నం **12** గం. మధ్య జరుగుతుంది. స్వామివారికీ గురువారం నాడే తిరుప్పావడాసేవ జరుగుతుంది. శ్రీవారి తిరుప్పావడా సేవలో పాల్గొనడానికి **5,000** రూ. చెల్లించాలి. పద్మావతీదేవికి జరిగే ఆర్జిత తిరుప్పావడా సేవలో పాల్గొనే గృహస్థులు **3,000** రూ. చెల్లించాలి. శుక్రవారాలలో మాత్రమే ఆర్జితడోలోత్సవ కార్యక్రమం పద్మావతీదేవికి నిర్వహింపడుతుంది. నిర్ణయింపబడిన పైకం చెల్లించి భక్తులు అమ్మవారికి డోలోత్సవ సేవ నిర్వహింపచేసికొంటారు. దేవస్థానానికి నిర్ణయించిన ద్రవ్యం చెల్లించి భక్తులు చేయించుకొనే సేవలకు ఆర్జిత సేవలని పేరు. అమ్మ వారికి భక్తులు దోసె, దధ్యోదనం, పలిహోర, పొంగలి, చక్కెరపొంగలి, కేసరిబాత్, శాకరి బాత్, సీరా వంటి ఆర్జిత ప్రసాద నివేదన సేవలు కావించు సౌకర్యం అమలు జరుగుతోంది.

శ్రీవారికి గురువారంనాడు సుమారు **450** కిలోల బియ్యంతో తయారు చేయబడిన

పులిహోరను బంగారు వాకిలి ముందు రాసిగాపోసి మధ్య శిఖరం చేసి ఎనిమిది దిక్కులలో ఎనిమిది శిఖరాలు చేసి పుష్పాలతో అలంకరిస్తారు. భోగ శ్రీనివాసమూర్తి దృష్టి దిశలో పులిహోర రాశి యేర్పాటు చేసి విశేషనివేదనలతో నీరాజనాదులతో నివేదిస్తారు. దీనికే అన్నకూటోత్సవం అనిపేరు. **15**వ శతాబ్దం పూర్వంనుండి తిరుమలేశునకు తిరుప్పావడాసేవ జరిగేది. శ్రీవారికి జరిగినట్లుగానే వారి దేవేరి యైన శ్రీపద్మావతీదేవికి కూడా మధ్యాహ్నం **11** గం.నుండి **12** గం.లమధ్య తిరుప్పావడా సేవ ఆర్జిత సేవగా జరుగుతోంది. సకలజీవుల ఆకలిదప్పికలు తీర్చే తల్లియైన ఆ పద్మావతీదేవికి అన్నకూటోత్సవం (తిరుప్పావడా సేవ) కావించడం భక్తుల భాగ్యం. "దేవికి పులిహోర నివేదన చేసిన వారికి బ్రహ్మ ఇంద్ర లోకాలలోని సుఖానుభవాలు సులభంగా లభిస్తాయి. అట్టి అన్న ప్రసాదనివేదనం కావించిన భక్తుల దర్శన విశేషంవలన యోగిజన దుర్లభమైన అణిమాది అష్టసిద్ధులు అప్రయత్నంగా లభిస్తాయి. అన్న ప్రసాదనివేదన పరులకు జన్మాంతంలో వైకుంఠంలోని అనంతగరుడ, విష్వక్సేనాదుల గోష్ఠిలో ప్రవేశం కలుగుతుంది. వారికి జననమరణరూపమైన సంసారభయం కలుగదు." పద్మావతీదేవికి అన్న ప్రసాద నివేదన (తిరుప్పావడాసేవ) వలన ఇట్టి మహత్తరఫలితాలు కలుగుతాయి. పైన పేర్కొనిన ఉత్తమఫలాలు లభిస్తాయని వరాహపురాణం ప్రకటిస్తోంది..

పద్మావతీదేవికి ప్రతి శుక్రవారం ఉదయం **9-10** గంటల మధ్య అభిషేకం జరుగుతుంది. ప్రతి శుక్రవారం ఉదయం తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి కి వైభవంగా అభిషేకం జరుగుతుంది. పరిమళం, గంబూరా, జాఫ్రా, పునుగు, కస్తూరి ఆదిగాగల ద్రవ్యాలతో, చందనం, పసుపు వంటివస్తువులతో, క్షీరం, బంగారు బావిజలంతోను పంచసూక్తాలు, దివ్యప్రబంధాల పారాయణం జరుగుతూండగా కన్నుల పండువగా శ్రీవారికి అపూర్వంగా అభిషేకం నిర్వహింపబడుతుంది. స్వామివారికి తిరుమలలో అభిషేకం అయిన పిమ్మట పరిమళ ద్రవ్యాలతో పవిత్ర జలంతో మంగళతూర్య వాద్యాలు మారుమ్రోగుతూండగా శ్రీసూక్త, భూసూక్త, నీళాసూక్తాలు ఆచార్యపురుషులు పఠిస్తూండగా ప్రధాన ఆచార్య స్వామి ఆధ్వర్యంలో పద్మావతీదేవికి నేత్ర పర్వంగా అభిషేకం జరుగుతుంది. పాలు, పెరుగు, తేనె, కొబ్బరి తీర్థం పసుపు,పరిమళజలంతో అమ్మకు అభిషేకం కావింపబడుతుంది. నిర్ణీత ప్రవేశపు రుసుము చెల్లించిన వారు మాత్రం అభిషేక నిర్వహణములో భాగ స్వాములై పాల్గొనే అవకాశం పొందుతారు. అభిషేక సమయంలో ప్రత్యేక టికెట్టుపై పద్మావతీదేవి దర్శనానికి అనుమతింపబడతారు. పద్మావతీ దేవికి జరిగే వారోత్సవాలలో తప్పక చూడవలసిన ఉత్సవం అభిషేక మహోత్సవం. ఆ ఉత్సవ దర్శనం భక్తులకు మరువలేని ఒక మధురభావనన

కలిగిస్తుంది. దివ్యమైన దేవీదీవెనను అందిస్తుంది.

నిర్ణీత ద్రవ్యం చెల్లించిన భక్తులకు ప్రతి శుక్రవారం మధ్యాహ్నం శ్రీ అమ్మ పద్మావతీదేవికి జరిగే ఆర్జిత డోలోత్సవ సేవలో పాల్గొనే భాగ్యం లభిస్తుంది. డోలోత్సవ ప్రార్థనా పరులు తిలకించే భాగ్యంకోసం అమ్మవారిని బంగారు డోలలో నిలిపి డోలోత్సవం కావిస్తారు. అమ్మవారికి విహారోచిత ఉపచారాలు కావించి, మధురపదార్థనివేదనంచేసి, ముఖావాసం (తాంబూలం) సమర్పిస్తారు. వేద, నాదాలు, సామగానాలు, దివ్య ప్రబంధ పారాయణములు, మంగళవాద్యాల మధ్య పద్మావతీదేవి డోలావిహారం కావిస్తుంది. ఆమె దివ్యదీప్తులను, సౌందర్య కాంతులను ఆ డోలామందిరం నుండి దశ దిశలలో వ్యాపింపజేస్తుంది. ఆదృశ్యం తిలకించే భక్తజన హృదయాలు పరవశించి పరమానంద భరితమవుతాయి. పద్మావతీ దేవి దయతో, అనుగ్రహంతో భక్తుల హృదయాలు నిండిపోతాయి. భక్తులకు ప్రసాద వితరణంతో డోలోత్సవం పరిసమాప్తమవుతుంది. పద్మావతీదేవికి భక్తులు తిరుచ్చి ఉత్సవం, గజవాహనోత్సవం వంటి ఆర్జితసేవలు చేయించుకొనే యేర్పాటు నేడు అమలు జరుగుతోంది. తిరుచ్చి ఉత్సవం అంటే అమ్మవారికి పల్లకీ సేవ అన్నమాట. గజ (ఏనుగు) వాహనంపై అమ్మవారికి ఊరేగింపు చేసేసేవకు గజవాహనోత్సవమనిపేరు. భక్తులు దేవస్థానానికి నిర్ణీతమైన పైకం చెల్లించి పై ఆర్జిత సేవలు అమ్మవారికి చేయించుకొనవచ్చును. ఎన్నోజన్మల పుణ్యఫలం వలన పద్మావతీదేవి దర్శన భాగ్యం భక్తులకు కలుగుతుంది. అమ్మకు ఆసేవలు కావించుకోవడం వలన నేటి వారి జన్మలకు ధన్యత లభిస్తుంది.

## వసంతోత్సవం

"నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధోత్సవ కృతానందః శ్రీమదానందనిలయ విమానవాసః సతతపద్మాలయా పద పద్మరేణు సంచితవక్షస్థల పటవాసః శ్రీశ్రీనివాసః సుప్రసన్నో విజయతామ్, శ్రీఅలమేల్మంగా సమేత శ్రీశ్రీనివాస స్వామీ సుప్రీతః సుప్రసన్నో వరదో భూయాత్."

-------శ్రీనివాసగద్యమ్ నుండి.

కొండలపై నెలకొన్న ఏడుకొండల వానికి నిత్య కల్యాణంగా, పచ్చతోరణాలతో, మంగళవాద్య విశేషాలతో సంవత్సరం పొడవునా వివిధోత్సవాలు జరుగుతూంటాయి. ఏడుకొండలవాని పట్టపురాణియైన అలవేలుమంగాంబికకు మంగాపట్టణంలో

రంగరంగవైభవాలతో సంవత్సరం పొడవునా భక్తులను అలరించే ఎన్నో ఉత్సవాలు నిర్వహింపబడుతూంటాయి.

"తిరుమలపైన నిన్నుగని దీవెనలందియు భక్తకోటి యా
తురతను మంగపట్టణము తోరపుభక్తిని జేరి తల్లి ఇం
దిరయగు మంగతాయిగని తృప్తి వహింతురు సర్వవేళలన్"
కరములు మోడ్చి మ్రొక్కులిడి కామితదాయక! వేంకటేశ్వరా

----మధురకవి మందరపు సత్యాచారకవి.

తిరుమల యాత్ర చేసి, తిరుమలేశుని దర్శించి, తిరుమలరాయునకు జరిగే ఉత్సవాలు, సేవలు తిలకించి పులకించిన భక్తులు మంగాపట్టణానికి ఆతురతతో అతి ఉత్సాహంతో అలమేలుమంగను సేవించడానికి, ఆతల్లికి జరిగే సేవలను, ఉత్సవాలను చూడాలని తరలివస్తారు. వారి తనువులలో, మనసులలో, అణువణువులలో అలమేలు మంగపై భక్తి ఉరకలు వేస్తూంటుంది. పరవళ్ళు త్రొక్కు తూంటుంది. వారి చూపులలో కదలేది పద్మావతీదేవి. వారి మనస్సులో నిలచేది పద్మావతీదేవి. వారి పిలుపుతో పలికేది తేనెపలుకుల తల్లి పద్మావతీదేవి. పద్మావతీదేవికి ప్రతి సంవత్సరంలో ఎన్నో ఉత్సవాలు జరిగినా వానిలో ప్రధానములైన వసంతోత్సవం, ప్లవోత్సవం బ్రహ్మోత్సవం, సువాసినీ పూజామహోత్సవంఆదిగా గలవి పేర్కొనదగినవి. అవి పరిగణనీయమైనవి. అవి మహోన్నత స్థాయిలో నిర్వహింపబడే ఉత్సవాలు. ఆ ఉత్సవాలు అశేష భక్త జనాలను విశేషంగా ఆకర్షిస్తూ వారికి అవ్యక్త మైన ఆనందానుభవ పరంపరలను కల్పిస్తున్నాయి. కలిగిస్తున్నాయి.

ఆశ్వయుజ శుక్ల పాడ్యమినుండి శారదనవరాత్రులు, చైత్ర ఉగాది నుండి శ్రీరామనవమి వరకు వసంతనవరాత్రులు జరుగుతాయి. వసంత శరత్ ఋతువులు ప్రాణుల పాలిట యముని కోరలుగా పరిగణిపబడ్డాయి. ఆరోగ్య ప్రదాత సూర్యుడు. శక్తి ప్రదాత కుజుడు. వీర్యపుదాత శుక్రుడు. బుద్ధిప్రదాత, బుధుడు. విద్యాప్రదాత గురుడు. మనోప్రదాత చంద్రుడు. ఈ గ్రహాల వృద్ధి క్షయాలు, ఉచ్ఛనీచలు, ఋజు వక్రగతులు, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, శత్రు క్షేత్రాల వంటి షడ్బలముల వలన ప్రాణులకు ఆయాగుణాలు కలుగుతాయి. సూర్యుడు వసంత ఋతువులో మేషరాశిలో ఉచ్ఛలో ఉంటాడు. సూర్యుని తేజోవృద్ధివలన జీవులకు వ్యాధి బాధలు కలుగుతాయి. సూర్యుడు శరత్ ఋతువులో తులారాశిలో నీచలో ఉంటాడు. అందుచేత రోగాలు అధికమవుతాయి. వసంతఋతువులో తేజోతత్త్వం ప్రకోపించడంవలన, శరత్ ఋతువులో పృథ్వీతత్త్వం ప్రకోపించడంవలన

ప్రాణులకు వ్యాధుల బాధలు అధికమవుతాయి. గ్రీష్మ ఋతువులో వాయు తత్త్వపు ప్రకోపం. వర్షఋతువులో జలతత్త్వపు ప్రకోపం, హేమంత ఋతువులో ఆకాశతత్త్వపు ప్రకోపం అధికంగా ఉంటాయి. శిశిర ఋతువులో పంచభూతాలు సమత్వంలో ఉంటాయి. శక్తి ఆరాధనం, శివారాధనంవలన మానవులకు శరత్కాలపు దోషాలు హరిస్తాయి. వసంతఋతుదోషాలు వైష్ణవారాధన మూలంగా నిర్మూలితమవుతాయి. ఇటువంటి ఉత్తమ ప్రయోజనాలు మానవాళికి అందించడానికి శారదానవరాత్రులు, వసంతోత్సవాలు ఉపదేశింపబడ్డాయి. నిర్దేశింపబడ్డాయి.

శ్రీరామ, పరశురామ, బలరాములు వసంతఋతువులోనే ఉద్భవించారు. మత్స్య, కూర్మ, నృసింహావతారాలను వసంతఋతువులోనే శ్రీహరి ధరించాడు. హనుమంతుడు ఉద్భవించింది వసంత ఋతువులోనే! శంకర, విద్యారణ్య, రామానుజాచార్యాది ఆచార్య పురుషులు ప్రభవించింది వసంత ఋతువులోనే! నమ్మాళ్వారు, మధురకవి ఆళ్వారు జన్మించింది వసంత ఋతువులోనే: భద్రాచలంలో సీతారామ కళ్యాణం, సింహాచలంలో చందనోత్సవం, వసంత ఋతువులోనే జరుగుతాయి. మహావీరజయంతి బుద్ధజయంతి, అన్నమయ్య జయంతి వసంత ఋతువులోనే జరుగుతాయి. వాడపల్లి తీర్థం, అన్నవరం సత్యదేవుని కళ్యాణం, ద్వారకాతిరుమల వేంకటేశ్వరుని వసంత కళ్యాణం, వాసవీ జయంతి. శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి ఆరాధనోత్సవాలు వసంతకాలంలోనే జరుగుతాయి. అవతారపురుషుల, మహాపురుషుల, ఆచార్యపురుషుల జననాలతో సాన్నిహిత్యం సంతరించుకొన్న కాలం వసంత కాలం. వసంతోద్యానవనాలే పార్వతీ కళ్యాణం, శ్రీనివాసకళ్యాణం జరగడానికి దోహదం కావించాయి. అవి గోదాకళ్యాణానికి దారి చూపాయి. వసంతోత్సవం ఋతుసంబంధమైన ఉత్సవం. పరిమితంగా మాత్రమే మాఘ శుక్ల పంచమికి వసంతోత్సవం చేసినట్లు తెలుస్తోంది. అందరూ వసంతోత్సవాన్ని వసంత ఋతువులోనే చేస్తారు. చేస్తున్నారు.

పూర్వం రాజులు వసంతోత్సవం ఉపవనంలో జరిపేవారు. ఇది పురాణప్రసిద్ధమైన ఉత్సవం. ఈ ఉత్సవం ఒక వ్రతంగా జరపబడేది. తోటలో తియ్యని మామిడి చెట్టు నీడలో మండపం నిర్మించి రంభాస్తంభాలతో అలంకరించి, తోరణాలతో, రంగవల్లులతో తీర్చిదిద్ది పూర్ణకుంభ స్థాపన కావించి వసంతుని, రతీమన్మథులను, లక్ష్మీనారాయణులను, గౌరీశంకరులను, శచీపురందరులను ఆవాహనకావించి ఆరాధించే ఉత్సవమే వసంతోత్సవం. కాళిదాసు, శ్రీహర్షాది మహాకవులు వసంతోత్సవ వైభవాన్ని వర్ణించారు. రెడ్డిరాజులు, విజయనగర రాజులు వసంతోత్సవాన్ని అపూర్వంగా నిర్వహించారు. రెడ్డిరాజులలో

కుమారగిరిరెడ్డి, విజయనగర చక్రవర్తులలో శ్రీకృష్ణదేవరాయులు వసంతోత్సవ శోభలు విశ్వవ్యాప్తంకావించడంలో సుప్రసిద్ధులయ్యారు. కొమరిగిరి కర్పూర వసంతరాయునికి అవచిదేవయ తిప్పయ అనే సింహపురి వైశ్యశిఖామణి "ప్రతి సంవత్సరోత్సవమునకుం గగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమదోపాహాంబు కాలాగరు గంధ సారప్రభృతి సుగంధ ద్రవ్యంబులొడగూర్చె" డి వాడు. కుమారగిరి రెడ్డి కాలంలోని వసంతోత్సవం కోటను పేటను సన్నిహితంకావించింది. సమసమాజ భావనకు నాందీగీతం పాడింది. వసంతోత్సవ సమయంలో ప్రదర్శించడానికి జాంబవతీకళ్యాణాన్ని శ్రీకృష్ణ దేవరాయలు రచించాడు. వసంతోత్సవాసక్తి కారణంగా వసంతరాజీయం, వసంతానురాగం, సంగీతసూర్యోదయం, స్వర మేళకళానిధి వంటి ఉత్తమ రచనలు వెలువడడానికి ప్రేరణ కలిగింది. ఇట్టి పౌరాణిక, చారిత్రక ప్రాముఖ్యత, ప్రఖ్యాతి సంతరించుకొన్న ఉత్సవం వసంతోత్సవం.

తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారికి ఫాల్గుణ మాసంలో ఉత్తరాభాద్రా నక్షత్రంలో వసంతోత్సవానికి అంకురార్పణ జరిగింది. మొదట విలంబి అనేవ్యక్తి శ్రీవారికి వసంతోత్సవం కావించి, ధన్యత చెందాడు. ఆనాటి వసంతోత్సవం నాలుగు దినాలు జరిగింది. వెండి రథంపైన స్వామివారికి ఊరేదింపు కూడా జరిగినదట. ఇది ఆర్జిత సేవగా కూడా జరుగుతుంది. ఇది మూడునాళ్ళు జరిగే సేవ. సేవాపరుల, దేవస్థానం వారల అవకాశాన్నిబట్టి అంతకంటే తక్కువ దినాలలో కూడాజరుపబడుతుంది. శ్రీవేంకటేశ్వరస్వామి వారికి ప్రతిసంవత్సరం వార్షిక వసంతోత్సవం చైత్ర శుద్ధత్రయోదశి, చతుర్దశి, పూర్ణిమా దినాలలో మూడు రోజులు వసంత మండపంలో నిర్వహింపబడుతుంది. శ్రీదేవి, భూదేవి సమేతుడైన ఉత్సవమూర్తి మలయప్ప స్వామికి ఆ ఉత్సవం జరుగుతుంది. చైత్రశుద్ధ చతుర్దశినాడు శ్రీవారికి రజితరథోత్సవం కన్నులపండువుగా జరుగుతుంది. చైత్ర పూర్ణిమనాడు శ్రీవారికి, శ్రీకోదండరామస్వామి వారికి, శ్రీకృష్ణ స్వామివారికి వసంతోత్సవం నిర్వహింపబడడంతో ఆమహోత్సవం పరిసమాప్తమవుతుంది. తిరుమలలో అయ్యవారికి ప్రతి సంవత్సరం ఏవిధంగా వార్షిక వసంతోత్సవం జరుగుతుందో అదేవిధంగా తిరుచానూరులో అమ్మవారికి వసంతోత్సవం జరుగుతుంది. పద్మావతిదేవికి కూడా స్వామివారికి జరిగినట్లే మూడునాళ్ళు వసంతోత్సవం జరుగుతుంది శ్రీవారు వసంతోత్సవం జరిగిన మరుసటి రోజున వెండిరథంలో ఊరేగినట్లే పద్మావతీదేవి వెండి రథంలో ఊరేగి భక్తులకు నేత్రపర్వం కావిస్తుంది. తల్లికి మూడవనాడు కూడ వసంతోత్సవపువేడుకలు జరగడంతో ఆమహోత్సవం సమాప్తమవుతుంది. ఈ

ఋతుసంబంధమైన ఉత్సవంలో పాల్గొన్న భక్తులకు పద్మావతీ శ్రీనివాసుల చల్లని దీవెనలు లభించి ఆయురారోగ్యభాగ్యాలు సిద్ధిస్తాయి. వారివారి జీవితాలలో వసంత శోభలు ప్రసరిస్తాయి. వెల్లివిరుస్తాయి. వారి మనోవాంఛలు ఫలిస్తాయి. వారికి కల్యాణ పరంపరలు కలుగుతాయి.

# (తెప్పతిరునాళ్ళు) ప్లవోత్సవం

శతపథ బ్రాహ్మణం నాలుగునెలల కాలాన్ని ఒక ఋతువుగా నిర్ణయించింది. మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసాలను వసంతఋతువుగా శతపథ బ్రాహ్మణం ప్రతిపాదించింది. ఫాల్గుణ పౌర్ణమి కామునిపున్నమి. హోళికా పూర్ణిమ మన్మథుని పండుగ. మన్మథుడు వసంతుడు అతడే వసంతఋతుకారకుడు. శ్రీస్వామి పుష్కరిణిలో ప్లవోత్సవ సమయంలో శ్రీదేవి, భూదేవి సమేత మలయప్పస్వామిని నిలపడానికి సాళ్వనరసింహ సార్వభౌముడు ఒక వసంతవిహారమంటపం నిర్మింపజేశాడు. సాళ్వ నరసింహుడు శ్రీవారికి వసంతోత్సవం, దానిలో భాగంగా చివరి మూడు రోజులలో ప్లవోత్సవం కావించడానికి క్రీ.శ. 1468సం.ములో యేర్పాటు కావించాడు. నాడు మూడురోజులు జరిగే ప్లవోత్సవాన్ని దేవస్థానం వారు ఐదురోజులు చేస్తున్నారు. ప్రతిసంవత్సరంలో వార్షిక ప్లవోత్సవం ఫాల్గుణ శుద్ధ ఏకాదశీ పర్వదినాన ప్రారంభమై ఫాల్గుణ పౌర్ణమి వరకు ఐదు రోజులు మహావైభవంగా స్వామివారికి జరుగుతుంది. మొదటి రోజున ఏకాదశినాడు శ్రీరామునకు, మరుసటిరోజు ద్వాదశినాడు శ్రీకృష్ణునకు ప్లవోత్సవం జరుగుతుంది. మిగిలిన మూడు దినాలలో శ్రీవారి ఉత్సవరులకు తెప్పతిరునాళ్ళ వేడుకలు జరుగుతాయి. ఈవార్షిక ప్లవోత్సవం భక్తులు నిర్వహించే ఆర్జిత సేవగా ప్రతిమంగళవారం సాయం సంధ్యా సమయంలో జరుగుతుంది. శ్రీదేవి, భూదేవి సమేతుడైన శ్రీ మలయప్పస్వామి ఉయ్యాల సేవలో పొందిన శ్రమను ఉపశమింపజేసికోవడానికి జలవిహారంలో చల్లని పిల్ల వాయువులు పీల్చుకోవడానికి ఈ ప్లవోత్సవం పొందుతాడు. ఆసేవ చేయించుకునేవారికి, దానిని భావించుకొనేవారికి, తిలకించేవారికి శ్రీలక్ష్మీ వేంకటేశ్వరుల నిత్యానుగ్రహం లభిస్తుంది.

"శ్రీవైకుంఠ విరక్తాయ స్వామి పుష్కరిణీ తటే
రమయారమమాణాయ వేంకటేశాయ మంగళమ్"

ప్రతి సంవత్సరం శ్రీవారికి ఫాల్గుణ శుక్ల ఏకాదశి నుండి పౌర్ణమి వరకు ఐదు రోజులు ప్లవోత్సవం తిరుమలలో శ్రీస్వామి పుష్కరిణిలో జరిగినట్లుగానే తిరుచానూరులో.

పద్మసరోవరంలో శ్రీపద్మావతీదేవికి ప్రతిసంవత్సరం వార్షికంగా జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నుండి పౌర్ణమి వరకు పంచాహ్నికంగా ప్లవోత్సవం అతిలోకరమణీయంగా జరుగుతుంది. జ్యేష్ఠశుద్ధ ఏకాదశినాడు శ్రీకృష్ణ స్వామికి తెప్ప ఉత్సవం జరుగుతుంది. ద్వాదశినాడు శ్రీసుందర రాజస్వామికి ప్లవోత్సవం జరుగుతుంది. చివర మూడు రోజులు శ్రీపద్మావతీదేవికి ప్లవోత్సవం అతిమనోహరంగా నిర్వహింపబడుతుంది.

శ్రీమన్నారాయణుడు సదా సనకసనందనాది యోగి పుంగవుల చేత ధ్యానింపబడుతూంటాడు. మరుద్గణముల సేవలు పొందుతూంటాడు. కుముద కుముదాక్ష విష్వక్సేన గరుడాది దేవతల స్తుతులు అందుకుంటూంటాడు. అట్టి శ్రీ భూసహితుడైన శ్రీమన్నారాయణుడు పాలకడలిలో శేష శయనుడై ప్రాణికోటిని సృష్టిస్తూ, పోషిస్తూ, లయం కావిస్తూ వినోదిస్తూంటాడు. అట్టి శ్రీమన్నారాయణునకుగాని, శ్రీదేవికి గాని, భూదేవికిగాని, క్షీరార్ణవ ఉత్సవం అత్యంత ఆవశ్యకమని విశ్వామిత్ర సంహిత (4-39)నిర్దేశిస్తోంది. శ్వేత ద్వీపం కన్న, వైకుంఠం కన్న పాలకడలికే ప్రాముఖ్యం. అందుచే క్షీరార్ణవ ఉత్సవం ప్రత్యేకతను, ప్రాధాన్యతను సంతరించుకొంది. ఆక్షీరార్ణవ ఉత్సవానికే ప్లవోత్సవం, తెప్పోత్సవం అన్నవి పర్యాయ పదాలు.

"శైశిరే గ్రీష్మకాలేవా
శుక్ల పక్షే శుభదినే
మాసపూర్ణిమాయాం వా
కర్తవ్యస్తు ప్లవోత్సవః"

శ్రీప్రశ్న సంహిత (39-2)

గ్రీష్మ కాలంలోగాని, శశిర ఋతువులో గాని, శుక్లపక్ష శుభదినమునగాని, మాసనక్షత్ర పూర్ణిమాదినమునగాని ప్లవోత్సవాన్ని నిర్వహించాలని ఆగమశాస్త్రం ప్రకటిస్తోంది. ఈ ఆగమ శాస్త్ర ప్రమాణాన్ని అనుసరించి గ్రీష్మ ఋతువులో జ్యేష్ఠమాసంలో శుద్ధ ఏకాదశినుండి పౌర్ణమి వరకు పంచాహ్నికంగా శ్రీపద్మావతీదేవికి సాయం సంధ్యా సమయంలో పద్మ సరోవరంలో ప్లవోత్సవం వైభవంగా జరుపబడుతోంది. ఈ తెప్పతిరునాళ్ళ వేడుకను ధ్వజారోహణతో కూడ చేయవచ్చును. ఈ ఉత్సవం చేయడానికి సరోవర సమీపంలో తీర మండపాన్ని నిర్మించాలి, దానిని అరటి చెట్లతో, మామిడాకులతోరణాలతో, చిత్ర వస్త్రాలతో, పూలమాలలతో అలంకరించాలి. [illegible] మూల విగ్రహంలోని

శక్తిని ఉత్సవ విగ్రహంలోనికి ఆవాహన చేయాలి. అభిషేకం చేయాలి. ఆభరణాలు అలంకరించాలి. విధి విధానంగా వేద ఘోషలతో, మంగళ వాద్యాలతో చతుర్వీధులందు దేవతామూర్తిని ఊరేగించి తీర్థమండపంలో స్థాపించాలి. విశేషమైన పూజలు కావించాలి, పానకం, నారికేళసలిలం, ఏలాలవంగ జాజీ ఫలాదులతో కూడిన భక్ష్య భోజ్యాది హవిస్సు నివేదన చేయాలి. పుణ్యాహజలంతో శిల్పి నిర్మించి అలంకరించిన ప్లవాన్ని (తెప్పను) పరిశుద్ధం చేయాలి. తటా కోదకాన్ని అభిమంత్రించి తెప్పలోనికి భూమిని, విమానంలోనికి శేషుని ఆవాహనం కావించాలి. తటాకంలోనికి వరుణదేవుని ఆహ్వానించాలి. అప్పుడు సాయం సమయంలో తుర్య, శంఖ, వేదఘోషల మధ్య ఆనిర్దేశిత పుష్కరిణిలో దేవతాసహిత ప్లవాన్ని ప్రదక్షిణ క్రమంగా మూడు సార్లు గాని, లేక ఐదు సార్లుగాని చలింపజేయాలి. పిమ్మట ఆదేవతను విధివిధానంగా దేవాలయంలో యథాస్థానంలో స్థాపించాలి. ఇది ఆగమ శాస్త్రం విధించిన ప్లవోత్సవ విధానం.

ఆగమ శాస్త్ర సమ్మతంగా, పాంచ రాత్ర ఆగమ విధేయంగా శ్రీపద్మావతీదేవికి పంచాహ్నికంగా ప్లవోత్సవం జరుగుతుంది. చాంద్రమాన ప్రయుక్త జ్యేష్ఠమాస పూర్ణిమకు పంచాహ్నికంగా అలమేలు మంగకు తెప్పతిరునాళ్ళ వేడుకలు కావించడం అనూచానంగా వస్తూన్న ఆచారం. శ్రీపద్మావతీదేవి అధిష్ఠించిన తెప రంగురంగుల విద్యుద్దీపాలతో అలంకృతమై ఒప్పారుతుంది. మంగళ తూర్యనాదాలు వేదగానాలు, ప్రబంధ పారాయణాలు, సాగుతూండగా అఖిలజగన్నాయకి అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకి ఆర్తత్రాణపరాయణి, దీన జన సంరక్షిణి, విష్ణువక్ష స్థలవాసిని, పద్మోద్భవి అయిన అలమేలుమంగాదేవికి తెప్పోత్సవం జనరంజకంగా, భక్తజనరంజకంగా నిర్వహింపబడుతుంది. ప్రతి రోజు ప్లవం సంచరించే సమయంలో పద్మావతీదేవి తెప్పతిరునాళ్ళవేడుకలను చూడడానికి వేలాది యాత్రికులు భక్తజనులు పుత్రమిత్ర కళత్ర పరివార సమేతంగా పద్మావతీదేవి పద్మసరోవరానికి నాలుగు దిక్కులలో ఉన్న సరోవర సోపానాలపై ఆశీనులై అవ్యక్తమైన ఆనంద పారవశ్యం అనుభవిస్తారు. అట్టి దేవీ దర్శనంతో దివ్యమైన అనుభూతిని అందుకుంటారు. ప్రతి భక్తుడు పద్మావతీదేవి ప్లవోత్సవదృశ్యాన్ని దర్శిస్తూ తన మనస్సును పద్మసరోవరంగా భావించుకొంటూ తన మానసపద్మ సరోవరంగా పద్మావతీదేవి ప్లవోత్సవ విహారం కావిస్తూన్నట్టు తలచుకొని పులకించి పోతాడు.

# బ్రహ్మోత్సవం

"కాల శ్రద్ధానిమిత్తాఖ్య ఉత్సవాః త్రివిధాః" అన్నది భృగువచనం, కాలోత్సవం, నిమిత్తోత్సవం వంటిఉత్సవాలు మూడు విధాలు. అసంఖ్యాకులైన మానవులు అసంఖ్యాకములైన కోరికలతో ఉంటారు. ఈవిషయాన్నే వ్యాసభగవానుడు సహస్ర నామాధ్యయన ఫల శ్రుతిలో వివరించాడు. భక్తులు కావించే మ్రొక్కుబడి సేవలు. ప్రార్ధనోత్సవాలు శ్రద్ధోత్సవాలు. గ్రహణం, సంక్రమణం, అనావృష్టి, ఉత్పాతం నిమిత్తంగా వాని దోషనివారణకు కావించే ఉత్సవాలు నిమిత్తోత్సవాలు. కాలోత్సవానికి విధివపబడిన ధ్వజారోహణం, నవసంధి, దేవతలఆహ్వానం; బలి ప్రదానం అనే మూడు క్రియలు . శద్ధ, నిమిత్త ఉత్సవాలకు వర్తించవు. మిగతా కాలోత్సవ విధులు, వాహన సేవలు శ్రద్ధ నిమిత్తోత్సవాలలో నిర్వహించే భక్తులకు అశ్వమేధయాగ మహాఫలం లభిస్తుంది. లౌకిక పారలౌకిక సుఃఖ శాంతులు కలుగుతాయి. ఇది ఫలాభి సంధి కల భక్తులకు కలిగే ఫలం. కామ్యంలేని వారి కైంకర్యానికి దేవతాను గ్రహ ఫలం సిద్ధిస్తుంది.

వేదాలలో విధింపబడిన యజ్ఞాలు రెండువిధాలు. అవి అమూర్తయజనాలు. సమూర్త యజనాలు. అమూర్త యజనానికి సంవత్సరానికి ఒకసారి సవం (సోమయాగం) విధింపబడింది. సమూర్తయజనంలో సంవత్సరానికి ఒకసారి ఉత్సవం (బ్రహ్మోత్సవం) విధింపబడింది. రెండూ కూడ అవ భృతంతో సమాప్తమవుతాయి. సవం ఒక వ్యక్తికి మాత్రమే పరిమితం. ఉత్సవం భక్త జనావళికి ప్రయోజనకరం. ఈ కాలోత్సవాన్ని30 లేక 25 లేక 21 దినాలలో నిర్వహించాలనేది కాశ్యపుని మతం. (మంగళం, గౌణం, భౌతికం, సాభద్రం,సావిత్రం, అనే 11విధాలుగా కాలోత్సవం నిర్వహింపవచ్చునని భృగువు ప్రకటించాడు). వానిని వరుసగా 1.3,5,7,9,11,13,15,17,19,21 దినాలలోజరుపవచ్చునన్నాడు. ఈ నిత్యోత్సవం ధ్వజారోహణకు ముందురోజున చేసే అంకురార్పణతో ప్రారంభమవుతుంది. గరుడపతాకావిష్కరణతో ధ్వజా రోహణం జరుగుతంది. దేవాది దేవులను, మానవులను, భక్తులను ఆహ్వానించడానికి ధ్వజారోహణం ఉద్దేశింపబడింది. పిమ్మట ఆలయ ద్వారదేవ, ద్వారపాల లోకపాలాదులను సమంత్రికంగా ఆవాహనకావించాలి. విష్వక్సేన, అనన్త, సుదర్శన, పాంచజన్య, నందకీ, కౌమోదకీ, శార్ఙ, గరుడ, బ్రహ్మ, ఇంద్ర, అగ్ని, యమ, నైఋతి, వరుణ, వాయు, కుబేర, ఈశాన, జయవిజయ, చండప్రచండ, కుముద, కుముదాక్ష, పుండరీక వామన, శంఖుకర్ణ, సర్వనేత్ర, సుముఖ ఆదిగాగల సుప్రతిష్ఠిత దేవతలనే గాక గ్రామాది అష్టదిక్పాలురకు బలితర్పణం కావించి

అవశేషం బలిపీఠం వద్ద ఉంచాలి. సర్వశుభప్రదమైన నృత్తగీత భేరీ వాద్యాలతో దేవతాహ్వానం చేయాలి.

ఈవిధమైన ధ్వజారోహణ దేవతాహ్వాన దినంనుండి ధ్వజావరోహణం వరకు దివ్య వాహన సేవలతో సంబంధిత దేవతకు ఉత్సవం కావించాలి. చతురంగ బలాలు, మంగళ ద్రవ్యధారులు, చిత్రవిచిత్ర తోరణ ధారులు, పతాకధారులు, శంఖ, భేరీ, మృదంగ, ఝల్లరీ కాహళ వాద్యకారులు, వివిధ తూర్యధారులు, సుస్వర మధుర గాయకులు వేదవేదాంగ పారగులు, శ్రీపాంచరాత్రాగమతత్త్వపారంగతులు అగ్రగాములై వాహనోత్సవాలను ముందుకు నడిపించాలి. దీక్షవహించిన ఆచార్యుడు ఉత్సవదినాలలో నిత్యపూజలు చేసి, బలివేసి విధివిధానంగా దేవతలకోసం హోమం చేయాలి. నిర్ణీత దినాన సాయం సమయంలో గజవాహనోత్సవం కావించాలి. బ్రహ్మోత్సవంలో రథోత్సవవిధి నిర్వచింపబడింది. అర్చక స్వామి యథోక్తంగా దాన్ని కావించాలి. నిశ్చిత సుముహూర్త సమయంలో మహాకుంభజలంతో యథాశాస్త్రీయంగా రథశిఖరమందు వాసుదేవుని అంగదేవతలతో ఆవాహన చేయాలి. అదేవిధంగా ఉపకుంభజలంతో ఇంద్రాది దేవతల్ని, శం, ఖ, కుముద, పురహూతాదాలను యథోచితస్థానాలకు ఆహ్వానించాలి. రథస్తంభాలలోని ధర్మాధర్మాదులను, తృతీయ పంక్తిలో అధోక్షజాద్యష్ట మూర్తులను, ద్వితీయ పంక్తిలో మత్స్యాదులను, ఆధారపంక్తిలో, కేశవాదులను, ఆధారపీఠకోణాలలో సత్యాదులను, ఆధారస్థానంలో పన్నగాధీశుని తదాధారంలో కూర్మని, రథాక్షాలందు మాయను, చక్రాలలో శశిభాస్కరులను, అశ్వస్థానమున వేదాలను, సారథిస్థానంలో బ్రహ్మను, ధ్వజమందుగరుడని, ఛత్రంలో శేషుని దేవతామూర్తిని వేదనాద శంఖ ఘంటానాదాలతో రథమందలి ఉయ్యాలపై అధివశింపజేసి నాలుగువీధులలోను ఊరేగింపు ఉత్సవం కావించాలి. తదుపరి తీర్థస్నానం, ధ్వజావరోహణంతో బ్రహ్మోత్సవం పరిసమాప్తమవుతుంది. అర్చనలో ద్రవ్యమంత్ర క్రియా సంబంధమైన లోపాలను సవరించే ప్రాయశ్చిత్యవిధి ఈ బ్రహ్మోత్సవ మహోత్సవం. ఈ విధంగా బ్రహ్మోత్సవ మహోత్సవం నిర్వహింపబడాలని ఆగమ శాస్త్రాలు ప్రతిపాదించాయి. ప్రమాణీకరించాయి.

వైఖానసపాంచరాత్ర ఆగమాలు నాకు రెండు కన్నులు (నేత్ర ద్వయంమమ) అని మహావిష్ణువు ప్రకటించాడు. శ్రీవిష్ణువాక్యాన్ని అమలు కావించడానికా అన్నట్లుగా శ్రీనివాసుని దేవాలయంలో వైఖానస ఆగమం ప్రకారం పూజా విధానం జరుగుతూండగా తిరుచానూరులో పద్మావతీదేవి ఆలయంలో పాంచరాత్ర ఆగమ విధేయమైన పూజా విధానం అనుసరింపబడుతోంది. శ్రీవారి బ్రహ్మోత్సవం దేవీ నవరాత్రులలో నిర్వహింపబడుతుంది. నవరత్న ఖచిత భూషిత సర్వాంగ సుందరాంగి, సకల భువన రక్షకి, సర్వజన సంరక్షకియైన

అలమేలు మంగా పట్టణ సువిలసిత శాంతి విమానాంతర్గత పద్మావతీ దేవి కార్తీక శుక్ల పంచమీ శుక్రవారంనాడు ఉత్తరాషాఢా నక్షత్రయుక్త అభిజిల్లగ్నమందు అవతరించింది. ఆసిరుల తల్లి ఆవిర్భవించిన అవతార తిథి పంచమి తిథి కావున తిథి ప్రాధాన్యతను పరిగణించి పంచమీతీర్థం అనే పేరుతో అవభృథం నిర్ణయింపబడింది. కార్తీక శుద్ధపంచమీ తిథి తీర్థవారిగా సంకల్పించి ఆదినంతో కూడిన తొమ్మిది రోజుల ముందుగా పద్మావతీదేవి బ్రహ్మోత్సవానికి ధ్వజారోహణం జరుగుతుంది. దానికి ముందురోజున అంకురార్పణ జరుగుతుంది. ఆవిధంగా అమ్మవారి బ్రహ్మోత్సవాలు పదిదినాలు జరుగుతాయి.

శ్రీ పద్మావతీదేవి బ్రహ్మోత్సవం సేనాపతి ఉత్సవంతో అంకురార్పణంతో ప్రారంభమవుతుంది. రెండవరోజున పగలు తిరుచ్చా ఉత్సవం, ధ్వజారోహణం, రాత్రి చ్చిన్న శేషవాహనం పైన అమ్మవారికి చతుర్వీధి భ్రమణోత్సవం జరుగుతుంది. మూడవ రోజున దేవికి పగలు టాంజాన్ ఉత్సవం, రాత్రి హంస వాహనంపైన ఊరేగింపు జరుగుతుంది. మంగాంబికకు నాల్గవ దినాన పగలు ముత్యపుపందిలి వాహన సేవ, రాత్రి సింహవాహనంపైన అమ్మవారికి విశేషమైన ఉత్సవాలు నిర్వహింపబడతాయి. ఆరవ రోజున పగలు పల్లకీ ఉత్సవం, సాయంత్రం వసంతోత్సవం, రాత్రి గజవాహనోత్సవం జరుగుతాయి. ఏడవనాడు పగలు సర్వభూపాలవాహనంపైన ఊరేగింపు, రాత్రి గరుడోత్సవం అమ్మకు కన్నుపండువగా జరుగుతాయి. ఎనిమిది రోజున పగలు సూర్య ప్రభ వాహనంపైన, రాత్రి చంద్ర ప్రభ వాహనంపైన అలమేలు మంగాదేవికి ఊరేగింపుసేవలు భక్తులు కావిస్తారు. తొమ్మిదవ రోజున పగలు రథోత్సవం, రాత్రి అశ్వవాహనోత్సవం జరుగుతాయి. సర్వసాధారణంగా అన్నిచోట్లా ఇట్టి ఉత్సవాలు రథోత్సవంతో ముగుస్తాయి. తీర్థవారికి అంత ప్రాధాన్యత ఉండదు. కాని తిరుచానూరులో పద్మావతీదేవి బ్రహ్మోత్సవానికి ముగింపుగా జరిగే తీర్థవారి మాత్రం ఒక ప్రత్యేకతను, విశిష్టతను సంతరించుకొన్నది.

పద్మావతీ అమ్మవారికి జరిగే బ్రహ్మోత్సవంలో గరుడోత్సవం, రథోత్సవం, అవభృథోత్సవం మా.తం మహోవైభవంగా జరుగుతాయి. వానిలో తీర్థ వారి అమ్మవారి అవతార మహోత్సవవైభవాన్ని సహస్రాధికం చేస్తూ జరుపబడుతుంది. ఈ ఉత్సవం తిథిప్రధానమై పద్మావతీ జయంతిగా, పంచమీ తీర్థంగా ప్రాచుర్యం వహించింది. ఈ పంచమీ తీర్థానికి ముందురోజున తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామి వారికి అధ్యయనోత్సవాలలో రాపత్తు చివర దినం రాత్రి జరుగుతుంది. ఆ మరునాడు పంచమి రోజున శ్రీ వారి చెంత నుండి

పసుపు, తులసి, పీతాంబరం, అన్న ప్రసాదాలు ఛత్రచామరాలతో వేదగాననాదాలతో, మంగళవాద్యాలతో, ఆలయమర్యాదలతో తిరుమలలో తిరుపతి పట్టణంలో ఊరేగించి ఏనుగుపై తీసికొని వచ్చిన ఆమంగళద్రవాలను తిరుచానూరునకు తీసికొని వస్తారు. ఆ సంభారాలు చేరుకొనే వేళకు ముందుగా ఉదయాన్నే శ్రీ పద్మావతీదేవికి ఫల్లకీ సేవ కావించి ఆలయంలో అర్చనం చూర్ణాభిషేకం ముగిస్తారు. శ్రీ చూర్ణం, మంచినెనె శ్రీవారికి ఉపయోగించిన పిమ్మట శ్రీ సుదర్శన చక్రాళ్వారు సహితంగా శ్రీదేవికి వినయోగిస్తారు. ఆవిధంగా చూర్ణాభిషేకం ముగుస్తుంది. అప్పుడు తిరుపతి నుండి శ్రీవారి దివ్య సన్నిధినుండి ఆలయమర్యాదలతో ఏనుగుపైతరలివచ్చే మంగడళద్రవ్యాలను అందుకోవడానికి ఎదురేగి వానిని స్వీకరించి శ్రీపద్మావతీదేవి సన్నిధిలో సమర్పిస్తారు. తిరుపతి మార్గంలో నిర్ణీత స్థలంలో కైంకర్య పరులు ఛత్ర చామరాలతో వేద ఘోషలతో, మంగళతూర్యనాదాలతో ఎదురేగి శ్రీవారి నుండి వచ్చిన సంభారాలు గ్రహించి పద్మ సరోవర తీరంలో అష్టస్తంభమంటపంలో శ్రీసుదర్శ చక్రాళ్వారు సహితంగా విడిది చేసిన పద్మావతీదేవి దివ్య సన్నిధానంలో తిరువీధి ప్రదక్షినానంతరం సమర్పిస్తారు. తురువాత పద్మసరోవరంలో స్నపనము, చక్ర స్నానం జరుగుతాయి. ఆనాడు పద్మసరోవరంలో వేలకోలది భక్తులు స్నానం చేస్తారు. ఆసమయంలో ఎవరు స్నానం చేస్తారో వారు పాపవిముక్తులవుతారని విశ్వామిత్ర మహర్షి ప్రకటించాడు. సాయంకాలం అమ్మవారికి వస్త్రాలంకారం, పుష్పమాలాలంకారం కావించి గంగుండ్ర మంటపంలో విశేషమైన ఆస్థాన సేవకావిస్తారు. తిరువీధి ప్రదక్షణ కావించి గుడిలో నిలుపుతారు. రాత్రి పుష్ప యాగోత్సవం తరువాత ధ్వజారోహణం జరుగుతుంది. ఆనాడు తిరుమలనుండి శ్రీవేంకటేశ్వరుడు మంగాపురానికి తప్పక తరలివస్తాడని ఐతిహ్యం ఉంది. ఇచ్చట చక్ర స్నానం అయ్యేవరకు శ్రీవారికి అర్చనలు తిరుమలలో జరుగవు. పంచమీ తీర్థంలో శ్రీనివాసుడు పాలు పంచుకుంటాడన్ పై నిదర్శనం నిరూపిస్తోంది. భక్తుల అట్టి నమ్మకాన్ని బలపరచి, ధృవపరుస్తోంది. ఈ పంచమీ తీర్థం నాడు మాత్రమే తిరుమలలో స్వామి వారి భక్తులకు తులసి లభిస్తుంది. సంవత్సరంలో ఏనాడూ తులసి భక్తులకు అలభ్యమే.

"పద్మాస్యవక్షః పరమసుపుణ్యాః
పద్మాజనిత్రీ పరమస్యవాసః"

# సువాసినీ పూజలు

ఫాల్గుణమాసంలో ఉత్తర ఫల్గుణీ నక్షత్రమందు శ్రీ లక్ష్మీదేవి ప్రాదుర్భవించింది. అందుచేత ఫాల్గుణ మాసంలోని ఉత్తర ఫల్గుణీ నక్షత్రయుక్త శుభదినాన్ని శ్రీ లక్ష్మి జయంతిగా జరుపుకొనే ఆచారం అనూచానంగా అమలు జరుగుతోంది. జ్ఞాన శ్రీకాములైనవారు, శ్రీ కాములైనవారు, రాజశ్రీకాములైనవారు శ్రీలక్ష్మీజయంతి పురస్సరంగా శ్రీ దేవికి చతుర్విధ సమారాధనతో అర్చన ప్రక్రియలు కావిస్తున్నారు. ఆరాధనావిధానాలు అమలు కావిస్తున్నారు. ఈ శ్రీలక్ష్మి జయంతి నాటి శ్రీలక్ష్మి సమారాధనం జపం, హుతం, అర్చనం, ధ్యానం అని నాలుగు విధాలుగా ఆచరింపబడుతోంది. శ్రీదేవి ధ్యేయరూపం సర్వపద్మమయమై సర్వాంగాలు పద్మస్వరూప సుందరములై , పద్మతేజో విరాజితాలై గోచరిస్తాయని సంహితలు, పురాణాలు ప్రతి పాదిస్తున్నాయి. శ్రీకాములైన భక్తులు శ్రీలక్ష్మీ దేవిని

పద్మాలయగా, పద్మాసనగా, పద్మాననగా, పద్మప్రియగా, పద్మహస్తగా, పద్మపాదగా, పద్మవర్ణగా, పద్మమాలాధరగా, పద్మప్రభగా, పద్మగంధిగా, పద్మినిగా, పద్మసుందరిగా సంభావిస్తూ ఆలక్ష్మీదేవి రూపాన్ని, శ్రీదేవి ధ్యేయ స్వరూపాన్ని మనోగతం, బుద్ధిగతం కావించుకొని చతుర్విధ సమారాధన చేయాలి. శ్రీసూక్తం, ఏకాక్షరమంత్రం లేక చతురాక్షం మహామంత్రం యథా భక్తితో, యథాశక్తితో లక్షల కొలది జపం కావించాలి. శ్రీ సూక్తంతోను, ఏకాక్షర చతురక్షరాది మహామంత్రాలతోను, కమలాల్ని, బిల్వఫలాల్ని పౌండరీ కాగ్నిలో లక్షసంఖ్యాక్రమంతో హోమం కావించాలి. ధ్యేయ రూపంతో ప్రకాశిస్తూ, ప్రతిమారూపంగా ఉన్న శ్రీదేవిని శ్రీ సూక్తంతో ఏకాక్షర, చతురాక్షరాది మహామంత్రాలతో కమలాలను బిల్వదళాలను లక్షలాది సమర్పిస్తూ అర్చన కావించాలి. బ్రహ్మశ్రీ కాములైనవారు కమలాలతో , రాజశ్రీకాములైనవారు బిల్వ ఫలాలతో, బిల్వదళాలతో హోమం, అర్చనం విధివిధానంగా నిర్వహించాలి. ఏకాగ్రచిత్తంతో, నిశ్చలబుద్ధితో అచంచలమైన భక్తిభావంతో శ్రీదేవి ధేయరూపధ్యానానికి సాధకుడు అగ్రతరమైన ప్రాధాన్యతను క్రియారూపంలో అమలుపరచాలి. ఇట్టి చతుర్విధ సమారాధనతో కరుణాయత్త చిత్తమైన జగన్మాత శ్రీదేవి పరమదయతో బ్రహ్మశ్రీకాములైన వారికి సర్వక్రతు సిద్ధిని, అణిమాద్యష్టైశ్వర్య సిద్ధిని ప్రసాదిస్తుంది. రాజశ్రీ కాములైన వారికి ధనధాన్యరాజ్యాది సకల సంపదలను అనుగ్రహిస్తుంది. శ్రీలక్ష్మి జయంతికి శ్రీ లక్ష్మి ఉపాసనాసిద్ధిని భక్తులకు సన్నిహితం కావించే ఉత్తమ నక్షత్రం ఉత్తర ఫల్గుణీ నక్షత్రం. అట్టి ఉత్తమ ఆర్థిక, పారమార్థిక ప్రయోజనాలు,

లౌకిక, పారలౌకిక సుఖశాంతులు భక్తులకు అందిస్తున్న మాసం ఫాల్గుణమాసం. గృహిణుల మాంగళ్యరక్షణకు ఫాల్గుణ మాసలక్ష్మి, ఫాల్గుణమాసంలో అవతరించిన శ్రీ లక్ష్మి వరదానం చేస్తున్నారు. అభయప్రదానం కావిస్తున్నారు.

సర్వసాధారణంగా ఫాల్గుణమాసం ఫిబ్రవరి మార్చినెలలో వస్తూంటుంది. ద్రావిడ సంప్రదాయంలో ఈమాసం సువాసినులకు మంగళ ప్రదమైన మాసంగా పరిగణింపబడుతోంది. ఏ దేవీ ఆలయంలో లేని ఒక ప్రత్యేకమైన కార్యక్రమం పద్మావతీదేవి దేవాలయంలో ఫిబ్రవరి–మార్చి నెలలో నిర్వహింపబడుతోంది. అదే సువాసినీ పూజా మహోత్సవం. అదే సుమంగళీ ఆరాధనోత్సవం. వీని నిర్వహణకు శ్రీమంతులు, సంపన్నులు ధర్మ నిధులు యేర్పాటు చేసారు. ఆ మాసాలలో వచ్చే శుక్రవారాలలో ఈనిధుల నుండి ఖర్చుచేసి కార్యక్రమం నిర్వహిస్తారు. దాతలు, దాన ప్రదాతలు ఆయా శుక్రవారాలలో ఉదయం శ్రీపద్మావతీ దేవి పాద సన్నిధానంలో అసంఖ్యాకంగా పసుపు తాళ్ళు సమర్పిస్తారు. పద్మావతీదేవి పవిత్ర పాదాల మ్రోల సమర్పితమైన వానిని అమ్మకు విశేషమైన అర్చనలు కావించడం ద్వారా అర్చక స్వాములు పవిత్రవంతం కావిస్తారు. దేవీ అనుగ్రహ ప్రభావంతో వానిని మహా మహిమాన్వితమైన వానిగా రూపొందిస్తారు. అట్టి మంగళప్రదమైన తాళి బొట్లను, ఫలపుష్పాదులను పసుపుకుంకుమలను, కాటుక భరిణలను, గాజులను తాంబూలాలను శ్రీపద్మావతీదేవి దివ్య సన్నిధానంలో పుణ్య స్త్రీలకు కానుకలుగా సమర్పిస్తారు. ఆవిధంగా సమర్పించడం, స్వీకరించడం తమకు కలిగిన అపూర్వమైన మహాభాగ్యంగా ముత్తైదువులు భావిస్తారు. దేశంలోని పలు ప్రాంతాలనుండి సువాసినులు తరలివచ్చి శుక్రవారాలలో జరిగే సువాసి పూజలలో తమకు అమ్మ అనుగ్రహించిన అపూర్వమైన అవకాశంగా భావించుకుంటూ పాల్గొంటారు. శుక్రవారపుసువాసినీ పూజలలో భాగ స్వామ్యం పొందిన గృహిణులకు మధ్యాహ్నం సమీపంలోని సత్రవులలో విందు పసందుగా జరుగుతుంది. ఇల్లాలి చదువు ఇంటికి వెలుగు. స్త్రీ విద్య సమాజ ప్రగతికి దోహదకారి. ఇల్లాలికి ఆరోగ్య సూత్రాలు తెలిస్తే ఇంటిలో ఆరోగ్యం నెలకొంటుంది. సమాజం ఆరోగ్య ప్రదంగా ఉంటుంది. రోగ కారక క్రిమి సంహారకమైన, వ్యాధి నిరోధక ప్రేరకమైన పసుపు ప్రయోజనం, వినియోగం మహిళా లోకంలో బహుళ ప్రచారం కావించడానికి ఉద్దేశింపబడిన ఉత్సవం సువాసినీ పూజామహోత్సవం. ఆవిధంగా తిరుచానూరులోని పద్మావతీదేవి సన్నిధానం వ్యాధినిరోధక పీఠంగా ప్రాథమిక ఆరోగ్యకేంద్రగా సువాసినీపూజా కార్యక్రమంతో విరాజిల్లుతోంది.

# పద్మావతీ పరిణయోత్సవం

కలియుగపు తొలిదినాలలో అంటే సుమారు ఐదు వేలయేండ్ల క్రితం ఆకాశరాజు తన పుత్రికను వకుళమాల అభిమాన పుత్రుడైన శ్రీనివాసునకిచ్చి వివాహం కావించాడు. ముక్కోటిదేవతలు, సర్వపుణ్య చరితులు పాల్గొన్న ఆపద్మావతీ పరిణయం నారాయణపురంలో కలియుగాన విళంబి సంవత్సర వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారంనాడు ఉత్తరఫల్గుణ నక్షత్ర యుక్త శుభసమయంలో ప్రొద్దుగుంకిన 13ఘడియలకు జరిగింది. ఇటు తిరుమలలోకాని, అటు తిరుచానూరులో కాని ఎటువంటి ప్రాముఖ్యత ఆపద్మావతీపరిణయముహూర్తానికి నేటివరకు ప్రతిపాదింపబడలేదు. ఆముహూర్తానికి ప్రతిసంవత్సరం మూడు రోజులపాటు పద్మావతీపరిణయమహోత్సవం నిర్వహించాలని దేవస్థానం పాలకమండలి తీర్మానించింది. దానిప్రకారం ప్రప్రథమంగా 1992 వ సంవత్సరంలో మే నెలలో 10,11,12తేదీలలో ఆవైవాహికోత్సవపు వేడుకలు నిర్వహింపబడినవి. తదాదిగా ప్రతిసంవత్సరం వైశాఖ శుద్ధ నవమినుండి ఏకాదశి వరకు మూడు రోజులపాటు తిరుమలలో నారాయణగిరి ఉద్యానవనంలో పద్మావతీ పరిణయమహోత్సవం మహావైభవంగా జరుపబడుతోంది. ప్రతిసంవత్సరం వైశాఖ శుద్ధనవమినాడు తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారు నవవరునిగా అలంకరింపబడతారు. శ్రీవారికి నూతన వస్త్రాలు ధరింపజేస్తారు. సర్వాభరణాలు అలంకరిస్తారు. ప్రత్యేక పుష్పాలంకారాలు, పుష్పమాలలు ధరింపజేస్తారు. సకలరాచమర్యాదలతో శ్రీవారిని గజవాహనారూఢులను కావిస్తారు. పెద్దజియ్యంగారు అర్చక స్వాములు, వేదపారాయణదారులు, దేవాలయానికి చెందిన ప్రధాన అధికారులు, వాద్య కళాకారులు ముందు నడుస్తూ శ్రీవారిని దేవాలయంనుండి మహద్వారం వద్దకు తీసికొని వచ్చి ఆగుతారు. శ్రీనివాస చక్రవర్తి ఇంకొక చక్రవర్తి ఆకాశ రాజు పుత్రిక పద్మావతీదేవి రాకకోసం మహద్వారం వద్ద నిరీక్షిస్తాడు. సముచిత సేవలు పిమ్మట శ్రీవారికి మంగళహారతి సమర్పింపబడుతుంది. అదే సమయానికి శ్రీదేవి, భూదేవి సాలంకృత విగ్రహులై, క్రొత్త పట్టువస్త్రాలు, పుష్పమాలలు,మేలిముసుగులు ధరించి పూలపల్లకీలో ఆసీనులై రాచమర్యాదలతో, దేవాలయమర్యాదలతో తరలివస్తారు. వరుడు వారిని క్రీగంట చూస్తాడు. నునుసిగ్గు దొంతరలలో శ్రీ, భూదేవులు చిరుదరహాసాల ప్రణయ దృక్కులు శ్రీ వారిపై ప్రసరిస్తారు. వారు డోలోత్సవ మంటపం అలంకరించి ఆసీనులవుతారు. ఆ నూతన వధూవరులు మంగళహారతులు అందుకొని

నయనాభిరామంగా తీర్చ బడే నారాయణగిరి ఉద్యానవనానికి ఊరేగింపుగా తరలి వెళతారు. ముందు వేదపారాయణం, ప్రబంధ పారాయణం చేస్తూ ఆచార్యులు సాగుతూంటారు. పెద్ద జియ్యరు స్వామి, అర్చక స్వాములు అనుసరిస్తూంటారు. మంగళతూర్యనాదాలు కావిస్తూ కళాకారులు నడుస్తూంటారు. వృష, గజ, తురగ పదాతి దళాలతో సార్వభౌమ అధికారాలతో శ్రీనివాస చక్రవర్తి ఊరేగింపులో పాల్గొంటాడు. ముగ్గురు దేవస్థానపు ప్రధాన అధికారులు మూడు వెండి పళ్ళాలలో క్రొత్త పట్టువస్త్రాలు, పుష్పమాలలు, పూలబంతులు తీసికొని భక్తి ప్రపత్తులతో పాదచారులై పాల్గొంటారు.

అదే నయనాభిరామంగా విరాజిల్లే నారాయణగిరి ఉద్యానవనం. పద్మావతీదేవి పెండ్లి జరిగే పూలవనం. ఆవనం– ఆవనంలో ఒక తామరకొలను – కొలను మధ్యలో పూల మండపం – ఆపూలమండపంలో ఒక సమున్నతమైన వేదిక – ఆవేదికే నవవధూవరులకు కళ్యాణ వేదిక. నవవధూవరులు ఆకళ్యాణవేదికను అలంకరిస్తారు. విద్యుద్దీపాలంకారాలు భక్తులను ఎంతగానో ఆకర్షిస్తాయి. ఆకులతో చేసిన నిలువెత్తు వివిధ దేవతామూర్తులు దివినుండి భువికి దిగి వచ్చి తిరుమలకు పద్మావతీ పరిణయాన్ని చూడడానికి తరలివచ్చినట్లు, వచ్చిన భక్తుల్ని దీవిస్తూన్నట్లుగోచరిస్తాయి. ఆకులతో చేసి ఆ పూలవనంలోనిలిపిన ఏనుగులు, జింకలు, నెమళ్ళు, కుందేళ్ళు అలనాటి ఆకాశరాజుకు చెందిన నారాయణవనంలోని పద్మావతీ పరిణయోద్యానవనాన్ని తలపిస్తాయి.

కల్యాణ వేదికపై ఇరువైపులా ఆసీనులైన స్వామివారికి, అమ్మవార్లకు అర్ఘ్యపాద్యాచమనాలు ఇవ్వబడతాయి. తిరుమల శ్రీపెద్దజియ్యంగారు అర్పించిన పట్టుపీతాంబరాలను అర్చక స్వాములు గ్రహించి శ్రీవారికి దేవేరులకు సభక్తికంగా, సగౌరవంగా సమర్పిస్తారు. పిమ్మట జియ్యంగారు సమర్పించిన పుష్పమాలలను అర్చక స్వాములు అయ్యవారికి, అమ్మవార్లకు అందిస్తారు. నవ వధూవరులకు వస్త్రాలంకరణ, పుష్పాలంకరణ వేద, ప్రబంధ పారాయణాలమధ్య ఛత్ర, చామర, మంగళవాద్య సమేతంగా, సకల రాచమర్యాదలతో జరుగుతాయి. శ్రీవారు ప్రేమపురస్సరంగా అనుమతించగా శ్రీవారికి అలంకృతమైన రెండు పూలమాలలను తీసి పెద్దజియ్యరు స్వామి అందజేస్తారు. జియ్యరు స్వామి వానిని వెండి పళ్ళెంలో ఉంచి భక్తితో ఆపళ్ళాన్ని తలపై పెట్టుకొని వెళ్ళగా అర్చక స్వాములు ఛత్ర చామరమంగళవాద్య మర్యాదల మధ్య ఆకల్యాణమాలలను నవవధూవరులైన దేవేరులకు అలంకరిస్తారు. భక్తుల సాక్షిగా శ్రీవారు పంపిన పూలదండలను దేవేరులు అంగీకరించి ధరిస్తారు. శ్రీవారు పంపిన పద్ధతిలోనే రాచమర్యాదలతో, దేవాలయమర్యాదలతో వారివద్ద ఉన్న రెండు పూలమాలలను పంపగా నిత్యనూతన వరుడైన

శ్రీనివాస ప్రభుడు ప్రేమతో అంగీకరించి స్వీకరిస్తాడు. ఇదే క్రమంలో వేద, ప్రబంధ పారాయణాల మధ్య, ఛత్ర, చామరమంగళవాద్యమర్యాదలతో నూతనవధూవరులు మూడుసార్లు కల్యాణ మాలలు మార్చుకుంటారు. అప్పుడు పెండ్లి కుమారుడు, పెండ్లికుమార్తెల మధ్య పూలబంతులాట ప్రారంభమవుతుంది. ఈ వేడుక ఎంతో ముచ్చటగా జరుగుతుంది. మొదట స్వామి వారే పూలబంతులాటకు ఉపక్రమిస్తారు. శ్రీవారి పక్షాన అర్చకస్వాములు అమ్మవార్లపై పూలబంతులు విసురుతారు. తరువాత అమ్మవార్ల తరపున అర్చకులు శ్రీవారిపై పూల బంతులు విసురుతారు. కొంతసేపు బంతులాట ఆవిధంగా జరుగుతుంది. వైవాహిక జీవితంలో సతీపతులు తమ సహజీవన యాత్రను పూలబంతులాటవలె సాగించాలనే సందేశాన్ని పద్మావతీ పరిణయోత్సవంలోని పెండ్లిబంతులాట భక్తులకు అందిస్తుంది. పిమ్మట బంగారు పీఠంపైన స్వామివారికి ఇరువైపులా అమ్మవార్లను ఆసీనులను కావిస్తారు. క్రొత్త పట్టు బట్టలు నూతన వధూవరులకు సమర్పిస్తారు.

"పెట్టని కోటిందరికి పెండ్లి కొడుకు బొమ్మ
పెట్ట నసురుల కెల్ల పెండ్లికొడుకు"
"పేరుగల జవరాలు పెండ్లి కూతురు పెద్ద
పేరుల ముత్యాలమేడ పెండ్లికూతురు,
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు, విభు
చేరుకుచ్చ సిగ్గుపడే పెండ్లికూతురు".

––––అన్నమయ్య

ఆవిధంగా అన్నమాచార్యుల వారి సంకీర్తనలు గానం కావింప బడతాయి. కళ్యాణ సుందర మూర్తులైన నవవధూవరులకు ధూప;దీప నైవేద్యాలు మంగళహారతులు సమర్పింపబడతాయి. అప్పుడు కొలువు లేక దర్బారు సేవ కళ్యాణ దంపతులకు జరుపబడుతుంది. శ్రీవారు, దేవేరులు కొలువుతీరి ఉండగా, ప్రధాన అర్చక స్వాములు "దేవదేవోత్తమ! దేవతాసార్వభౌమ,! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక, శ్రీశ్రీనివాస స్వామిన్ ఋగ్వేద ప్రియః ఋగ్వేద పఠనం అవధారయ అంటూ బహుపరాకులు వినిపిస్తూ ఆదేశించగా వేద పండితులు ఋగ్వేదం వినమ్రంగా వినిపిస్తారు. ఆవిధంగా చతుర్వేదాలు, పురాణాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు, గీతాలు, సంగీతాలు వినిపిస్తారు. సర్వోపచారాలు కావిస్తారు. అప్పుడు నవదంపతులకు అపూర్వంగా డోలోత్సవం జరుగుతుంది.

"అలర చంచలమైన ఆత్మలందుండ నీ
యలవాటు సేసె నీ ఉయ్యాల

పలుమరునుఛ్ఛ్వాస పవనమందుండ నీ
భావంబు దెలిపెనీ – ఉయ్యాల
పదిలముగ వేదములు బంగారు చేరుపై
పట్టి వెరపై తోచె –నుయ్యాల
వదలకిటు ధర్మదేవత పీఠమై మిగుల
వర్ణింప నరుదాయ – నుయ్యాల
కమలాసనాదులకు కన్నులకు పండుగై
గణుతింప నరుదాయ నుయ్యాల
కమనీయ మూర్తి వేంకటశైలపతి నీకు
కడువేడుకై యుండె నుయ్యాల"

––––అన్నమయ్య

శ్రీవారి, దేవేరుల డోలావిహార మహోత్సవం విశ్వలీలావిలాసాన్ని భక్తుల ఊహల కన్నుల ముందు ఆవిష్కరిస్తుంది. జగతి శ్రీవేంకట పతికి ఉయ్యాలలూచగా జనతికి కలుగుతుంది దివ్యానుభూతి. పెద్ద ఎత్తున బాణసంచా కాల్చబడుతుంది. వినోదకార్యక్రమాల పిమ్మట శ్రీవారు, దేవేజులీలు నారాయణగిరి ఉద్యానవనంనుండి బయలుదేరి ఆలయానికి ప్రదక్షిణంగా పశ్చిమ, ఉత్తర మాడవీధుల్లో ఊరేగుతూ, భక్తులకు దర్శన భాగ్యం అనుగ్రహిస్తూ ఆలయ ప్రవేశం కావించడంతో పద్మావతీ దేవి పరిణయోత్సవపు తొలినాటి వేడుకలు పరిసమాప్తమవుతాయి. రెండవరోజున వైశాఖ శుద్ధ దశమి నాడు శ్రీవారు అశ్వవాహనంపైన మూడవ నాడు ఏకాదశి నాడు గరుడవాహనంపైన ఊరేగి రాగా దేవేరులు పూలపల్లకీలో ఊరేగిరాగా తొలినాడు జరిగినట్లుగానే నారాయణగిరి ఉద్యానవనంలో పెండ్లి వేడుకలు జరుగుతాయి. క్రొత్త పెండ్లికూతురి సింగారం తో అలమేలు మంగమ్మ పూల పల్లకిలో ఊరేగి కల్యాణవేదికలను చేరిన విధానాన్ని అన్నమయ్య వర్ణిస్తూ సంకీర్తనం కావించాడు. అన్నమయ్య అమ్మవారి పల్లకిని ఆడవాళ్ళచేతనే మోయించాడు. పద్మావతీదేవి పెండ్లి కుమార్తెయై పల్లకిలో ఊరేగుతూ వెళ్ళే ఆవింతసొగసులను వినూత్న సోయగాల్ని గడసరి పోకడలతో అన్నమయ్య మన కన్నులలో తాండవింపజేసాడు.

"కులుకక నడవరో కొమ్మలాలా
జలజలరాలీని జాజులు మాయమ్మకు
ఒయ్యనే మేను గదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీపాదతాకు కాంతలారా

పయ్యెద చెఱగుజారీ భారపు గుబ్బల మీద
అయ్యో చెమరించె మాయమ్మకు నెన్నుదురు
చల్లెడి గందవొడియై జారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దు పణతులాల
మొల్లమైన కుందనపు ముత్యాలకుచ్చులదర
గల్లనుచు కంకణాలు గదలీమాయమ్మకు
జమళి ముత్యాల తోడిచమ్మాళిగలిడరో
రమణికి మణుల నారతులెత్తరో
అమరించి కౌగిట నలమేలుమంగనిదె
సమకూడె వేంకటేశ్వరుడు మాయమ్మకు"

------ అన్నమయ్య

ఈవిధంగా పద్మావతీ పరిణయ మహోత్సవం 1992 సం.ము నుండి ప్రతి సంవత్సరం వైశాఖ శుద్ధ నవమి నుండి ఏకాదశివరకు మూడు రోజులు జరుగుతోంది. కలియుగం తొలి దశలో అంటే 5వేల సంవత్సరాలకు పూర్వం విళంబి వైశాఖ శుద్ధ దశమినాడు పద్మావతీ శ్రీనివాసులు పెండ్లి జరిగింది. ఆ పెండ్లి రోజుకు గుర్తుగా వివాహ దినోత్సవం పద్మావతీ పరిణయ మహోత్సవ రూపంలో జరుగుతోంది.

## శ్రీపద్మావతీ చతుర్వింశతి నామపూజ

తిరుచానూరులోని పద్మావతీదేవి ఒక ప్రత్యేకమైన ప్రతిపత్తిని కలిగి ఉంది. అమె ప్రధాన దేవతామూర్తిగా, అద్వితీయ అర్చనా స్వరూపిణిగా పూజలు , అర్చనలు, నివేదనలు, ఉత్సవాలు పొందుతోంది. ప్రత్యేక ఏకైక స్వతంత్ర దేవతామూర్తిగా సుప్రభాత, సహస్రనామ,, ఏకాంత సేవాది నిత్య సేవలు, శుక్రవార అభిషేకాది వారోత్సవాలు, మాసోత్సవాలు, బ్రహ్మోత్సవ, అవతారోత్సవ, డోలోత్సవ, ప్లవోత్సవాది వార్షికోత్సవాలు స్వీకరిస్తోంది. వాహన సేవలు, రథసేవలు, పంచమీతీర్థసేవలు అందుకొంటూంది. దేవాలయంలో వేంకటేశ్వరస్వామి విగ్రహం పూరుకు ఉన్నా స్వామి ప్రమేయం, లేకుండానే పద్మావతి మూలమూర్తిగా అన్నిపూజలు, సేవలు, ఉత్సవాలు పొందుతూంది. ఏ దేవతామూర్తికి ఇట్టి ప్రత్యేకప్రతిపత్తి నిర్దేశింపబడలేదు. ఉద్దేశింపబడలేదు. మధురమీనాక్షి కూడ సుందరేశ్వర స్వామి సమేతంగానే ఊరేగుతుంది. కాని పద్మావతీ

దేవి మాత్రం పద్మావతీదేవిగానే శ్రీనివాసుని తోడు లేకుండానే వాహనయాత్రలు, రథయాత్రలు కావిస్తుంది. శ్రీనివాసుడు మహాలక్ష్మిని ఉద్దేశించి తపస్సు కావించగా శ్రీమహాలక్ష్మి శ్రీనివాసునకు సాక్షాత్కరించింది. శ్రీ మహాలక్ష్మి ప్రత్యక్షమై పద్మావతీదేవి స్వరూపంతో తన స్థాయిని, స్థితిని, ఉనికిని ఋజువు చేసికొంది. స్థిరపరచుకొంది. కల్హార మాలతో శ్రీనివాసుని అలంకరించి శ్రీనివాసుని వక్షస్థలాన్ని స్వర్ణ సింహాసనంగా మార్చుకొని అధివసించి ఆసీనురాలైంది.

శ్రీపద్మావతీదేవి శ్రీ మహాలక్ష్మీదేవి. శ్రీమహాలక్ష్మీదేవియే శ్రీపద్మావతీదేవి. ప్రతిమంగళ శుక్రవారాలలో, ప్రత్యేకంగా శ్రావణ మంగళ శుక్రవారాలలో నవరాత్రులలో, నరక చతుర్దశి దీపావళి పండుగదినాలలో పవిత్ర ధనుర్మాసదినాలలో, ఇతర లక్ష్మీ ప్రీతికర పుణ్య తిథులలో శ్రీపద్మావతీదేవిని పూజించడం సర్వార్థ సిద్ధిప్రదం.

'శ్రీ వేంకటేశ మహిషీ మహాలక్ష్మీ ప్రీత్యర్థం శ్రీవేంకటేశ మహిషీ మహాలక్ష్మీ చతుర్వింశతి నామభిః శ్రీవేంకటేశ మహాలక్ష్మ్యర్చనం కరిష్యే.

అస్య శ్రీమహాలక్ష్మీ చతుర్వింశతి నామమంత్రస్య బ్రహ్మా ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీమహాలక్ష్మీ దేవతాః శ్రీవేంకటేశ మహిషీ మహాలక్ష్మీ ప్రీత్యర్థే జపే వినియోగః అని భావించి, సంకల్పం కావించుకొని దేవిని--

" ఈశానాం జగతోస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్కాంతి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్.

అంటూ ధ్యానించి క్రింది చతుర్వింశతి నామాలతో (24నామాలతో) బిల్వ (మారేడు) పత్రాలతో శ్రీ పద్మావతీదేవిని విధివిధానంగా పూజించి ముఖ్యంగా బియ్యపు పరమాన్నం, పులిహోర నివేదన కావించాలి. ఇది మహామహిమాన్వితమైన పద్మావతీదేవి పూజావిధానం.

ఓం శ్రియైనమః
ఓం లోకధాత్ర్యై నమః
ఓం బ్రహ్మమాత్రే నమః
ఓం పద్మ నేత్రాయైనమః
ఓం పద్మ ముఖ్యై నమః
ఓం ప్రసన్న ముఖ పద్మాయై నమః

ఓం పద్మ కాంత్యై నమః
ఓం బిల్వవన స్థాయైనమః
ఓం విష్ణుపత్న్యై నమః
ఓం విచిత్ర క్షౌమధారిణ్యై నమః
ఓం పృథు శ్రోణ్యై నమః
ఓం పక్వబిల్వఫలాపీన తుంగస్తన్యైనమః
ఓం సురక్త పద్మ పత్రాభకర పాదతలాయై నమః
ఓం శుభాయైనమః
ఓం సరత్నాంగద కేయూర కాంచీనూపుర శోభితాయైనమః
ఓం యక్ష కర్దమ సంలిప్త సర్వాంగాయై నమః
ఓం కటకోజ్జ్వలాయై నమః
ఓం మాంగల్యాభరణైశ్చిత్రై ర్ముక్తాహారైర్విభూషితాయైనమః
ఓం తాటంకై రవతంసైశ్చ శోభమానముఖాంబుజాయై నమః
ఓం పద్మ హస్తాయైనమః
ఓం హరివల్లభాయైనమః
ఓం ఋగ్యజుస్సామరూపాయైనమః
ఓం విద్యాయైనమః
ఓం అబ్ధిజాయై నమః

ఏవం చతుర్వింశతి నామభిః బిల్వ పత్రై లక్ష్మ్యర్చనం కుర్యాత్ తేన సర్వాభీష్ట సిద్ధిర్భవతి. వరాహ పురాణ ఉత్తర భాగాంతర్గత మైన తొమ్మిదవ అధ్యాయంలోని దేవాది కృత శ్రీలక్ష్మీ స్తుతిలో స్మరించిన ఇరువది నాల్గు లక్ష్మీ నామాలనే పద్మావతీదేవి చతుర్వింశతి పూజానామాలుగా స్వీకరించి పూజించే విధానం పైవిధంగా భక్తులకు అందించబడింది. ఆనామాలతో నిత్యం పద్మావతిని పూజించడంగాని ఆనామాలే ఉన్న పద్మావతి స్తుతి నిత్యం కావించుకోవడంకాని భక్తులకు మిక్కిలి ప్రయోజనకరం. వరాహపురాణాంతర్గత దేవాదికృత శ్రీలక్ష్మీ స్తుతితో అష్టలక్ష్మీస్తుతికూడ నిత్యం కావించుకోవడం భక్తులకు బహుళార్థ ప్రయోజన ప్రదం. భక్తుల నిత్య పారాయణంకోసం దిగువన శ్రీ మహాలక్ష్మి (పద్మావతి) చతుర్వింశతి నామ స్తుతి, అష్టలక్ష్మీ స్తుతి ప్రకటింపబడ్డాయి.

శ్రీపద్మావతీ చతుర్వింశతి నామస్తుతి.

నమః శ్రియైలోకధాత్రై బ్రహ్మమాత్రే నమోనమః
నమస్తే పద్మనేత్రాయై పద్మ ముఖ్యై నమోనమః
ప్రసన్న ముఖ పద్మాయై పద్మకాంత్యై నమోనమః
నమో బిల్వవనస్థాయై విష్ణు పత్న్యై నమోనమః
విచిత్ర క్షౌమధారిణ్యై పృథు శ్రోణ్యై నమోనమః
పక్వ బిల్వ ఫలా పీనతుంగస్తన్యై నమోనమః
సురక్త పద్మపత్రాభకర పాదతలే శుభే
సురత్నాంగద కేయూర కాంచీనూపుర శోభితే
యక్షకర్దమ సంలిప్త సర్వాంగే కటకోజ్జ్వలే
మాంగళ్యాభరణైశ్చిత్రై ముక్తాహారై విభూషితే
తాటంకైరవతంసైశ్చ శోభమానముఖాంబుజే
పద్మహస్తే నమస్తుభ్యం ప్రసీద హరివల్లభే
ఋగ్యజుః సామరూపాయై విద్యాయైతే నమోనమః
ప్రసీదాస్మాన్ కృపాదృష్టిపాతైరాలోకయాబ్ధిజే
యే దృష్టాస్తే త్వయా బ్రహ్మరుద్రేంద్రత్వం సమాప్నుయుః"

——————వరాహపురాణం రెండవ భాగం లోమిదవ అధ్యాయం నుండి.

**అష్టలక్ష్మి స్తుతి.**

"రథ మధ్యామశ్వపూర్వాం గజనాదప్రబోధినీం
సామ్రాజ్యదాయినీం దేవీం గజలక్ష్మీం నమామ్యహమ్
ధనమగ్నిర్ధనం వాయుః ధనం భూతాని పంచచ
ప్రభూతైశ్వర్య సంధాత్రీం ధనలక్ష్మీం నమామ్యహమ్
పృథ్వీగర్భ సముద్భిన్న నానావ్రీహి స్వరూపిణీం
పశుసంపత్స్వరూపాంచ ధాన్యలక్ష్మీం నమామ్యహమ్
నమాత్సర్యం నచక్రోధో నభీతిర్నచ భేదధీః
యద్భక్తానాం వినాతాసం ధైర్యలక్ష్మీం నమామ్యహమ్
పుత్ర పౌత్ర స్వరూపేణ పశుభృత్యాత్మనా స్వయం
సంభవన్తీంచ సంతాన లక్ష్మీం దేవీం నమామ్యహమ్
నానావిజ్ఞాన సంధాత్రీం బుద్ధి శుద్ధి ప్రదాయినీం
అమృతత్వ ప్రదాత్రీంచ విద్యా లక్ష్మీం నమామ్యహమ్

నిత్యం సౌభాగ్య శౌశీల్యం వరలక్ష్మీం దదాతి యా
ప్రసన్నాం స్త్రైణసులభాం ఆదిలక్ష్మీం నమామ్యహమ్
సిద్ధిశక్తి స్వరూపాంచ సర్వశిదిధ ప్రదాయినీం
సర్వేశ్వరీం శ్రీవిజయలక్ష్మీం దేవీం నమామ్యహమ్
అష్టలక్ష్మి సమాహార స్వరూపాం తాం హరిప్రియామ్
మోక్షలక్ష్మీం మహాలక్ష్మీం సర్వలక్ష్మీం నమామ్యహమ్
దారిద్ర్య దుఃఖహరణం సమృద్ధి రపి సంపదామ్
సచ్చిదానంద పూర్ణత్వం అష్టలక్ష్మి స్తుతేర్భవేత్"

ఈఅష్టలక్ష్మి స్తుతిని ప్రతిరోజు ఎనిమిది సార్లు భక్తి శ్రద్ధలతో పఠించిన వారికి ఆయురారోగ్యాది సకల సంపదలు సంప్రాప్తమవుతాయి.

## విశ్వశాంతియాగం

కలియుగం వయస్సు 4,32,000 సంవత్సరాలు. నేటికి కేవలం 5,095 సంవత్సరాలు మాత్రమే గడచాయి. కలియుగ దోషాలను నివారించడానికి, లోకానికి సుఖశాంతులు ప్రసాదించడానికి "విశ్వశాంతి సహస్రకుండాత్మక శ్రీ మహావిష్ణుయాగం" 14-10-94 నుండి 28-10-94 వరకు తిరుమలలో నిర్వహింపబడింది. అదేవిధంగా తిరుచానూరులో శ్రీ పద్మావతీదేవి దివ్య సన్నిధానంలో శ్రీయాగం 13-3-95 తేది నుండి 17-3-95 తేది వరకు నిర్వహింపబడింది. యజ్ఞ గ్రామం తిరుమలలో గోగర్భండాము వద్ద నిర్మితమైంది. ఒక ప్రధాన యాగశాల, ప్రధాన మండపం, శ్రీమహావిష్ణు ఆసనం కట్టబడ్డాయి. 74 యాగశాలలు నిర్మితమయ్యాయి. ప్రధాన మండపంలో మధ్యామహామండపం చుట్టూ తొమ్మిది కుండాలు కట్టబడినవి. చక్రాభ్యం, శంఖం, గద పద్మం, గరుడం, కూర్మ, దశాస్త్రం, చక్రం అదిగాగల పేర్లతో ఇవి పిలువబడ్డాయి. ఇక సహస్ర హోమకుండాలను ఎనిమిది నమూనాలతో సిద్ధపరిచారు. చతురస్రం, త్రికోణం, అర్ధ చంద్రాకారం, యోని, పద్మం, వృత్తం అష్టాస్రమం అనే ఆకారాలలో ఇవి నిర్మితమయ్యాయి. నెలదినాలు శిక్షణ పొందిన మూడువేల మంది ఋత్విక్కులు యాగమార్గదర్శక సూత్రాలను విధేయంగా పాటిస్తూ 35వేల కిలోల స్వచ్ఛమైన ఆవునేతిని వినియోగించి విశ్వశాంతి సహస్రకుండాత్మక శ్రీమహావిష్ణు యాగం

నిర్వహించారు. వ్యక్తిహితం కోసం ద్వాదశ ఇష్టుల ను 17-10-94నుండి 28-10-94తేది వరకు ప్రత్యేకంగా నిర్వహింపబడ్డాయి. ఏనాడు ఏ ఇష్టి ఎందుకోసం నిర్వహింప బడినది క్రింద తెలుపబడింది.

| తేదీ | ఇష్టి పేరు | కలిగే ఫలితం |
|---|---|---|
| 17-10-94 | సుదర్శన ఇష్టి | సర్వవ్యాధి నివారణం – సదా ఆరోగ్య ప్రాప్తి |
| 18-10-94 | వాసుదేవ ఇష్టి | దీర్ఘాయువు విఘ్ననివారణం |
| 19-10-94 | వైష్ణవ ఇష్టి | స్వచ్ఛత, స్థానబలం, పావనత్వం, యాజమాన్యపు అర్హత |
| 20-10-94 | వైభవ ఇష్టి | పెద్దలు తరించడం–పిల్లలకు ఆశీస్సులు |
| 21-10-94 | వైనతేయేష్టి | పుత్రకామేష్టి ఫలితం |
| 22-10-94 | లక్ష్మీనారాయణేష్టి | దారిద్ర్య నివారణం, ఐశ్వర్య ప్రాప్తి |
| 23-10-94 | హయగ్రీవ ఇష్టి | ఉత్తమ విద్య |
| 24-10-94 | నృసింహ ఇష్టి | దుష్ట గ్రహనివారణం |
| 25-10-94 | పుత్రకామేష్టి | సర్వరోగ నివారణం |
| 26-10-94 | విష్వక్సేన ఇష్టి | శత్రునాశనం, విజయ ప్రాప్తి |
| 27-10-94 | వైయూహి ఇష్టి | అతివృష్టి అనావృష్టి నివారణం, ప్రకృతి విపరీతాల ఉపశమనం |
| 28-10-94 | శ్రీమన్నారాయణ ఇష్టి | సర్వపాతక ఉపపాతక ఉపశమనం, విశ్వశాంతి |

తిరుమలపై జరిగిన పెద్దయాగాలలో ఇది మూడవది. మొదట 1972లో అనావృష్టి నివారణకు, త్రాగునీటి సమస్య పరిష్కారానికి పెద్దజియ్యరు స్వామి సామూహికయజ్ఞం నిర్వహించారు. 1980లో 108వ స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞం నిర్వహింప పెద్ద జియ్యరు స్వామి సంకల్పించగా శ్రీ[illegible]దండి చిన్నజియ్యర్ స్వామి ఘనంగా నిర్వహించారు. 1972 వ సంవత్సరంలో పెద్ద [illegible] స్వామి విశ్వశభూంతి సహస్ర కుండాత్మక శ్రీ మహావిష్ణు యాగ నిర్వహణకు ఆగమ [illegible] ప్రమాణంతో రచన, ప్రణాళిక సిద్ధ పరచారు. దాన్ని శ్రీ చిన్నజియ్యర్ స్వామి తిరుమలలో ఆచరించారు. ఈ 15దినాలలో జరిగిన యాగంలో దినానికి 50 వేల మంది భక్తులకు తదియారాధన జరిగింది. దినానికి భక్తుల యాగ సందర్శనం కోసం అదనంగా 150బస్సులు నడుపబడ్డాయి. యాగ సందర్శనం కోసం భక్తులకు 60క్లోజ్డ్ సర్క్యూట్ టి.వి.లు యేర్పాటు చేయబడ్డాయి. జియ్యర్ ఎడ్యుకేషనల్ ట్రస్టుకి అనుబంధంగా ఉన్న 'వికాశ తరంగిణి' కి చెందిన నాలుగు వేలమంది స్వచ్ఛంద సేవా

కార్యకర్తలు ఈయాగం విజయవంతం కావడానికి ఉచిత స్వచ్ఛంద సేవలు అందించారు. చతుర్వేద పారాయణానికి రామాయణ, భారత, భాగవత, విష్ణుపురాణ, వేంకటాచలమాహాత్మ్య, భగవద్గీత, విష్ణు సహస్రనామ పారాయణలకు మహోన్నతి స్థానం కల్పించబడింది. ఆత్మ కల్యాణం, సమాజ కల్యాణం, రాష్ట్ర కల్యాణం, దేశ కల్యాణం, లోకకల్యాణం సాధించడం కోసం విశ్వశాంతి యాగం తిరుమలలో నిర్వహింపబడింది. శ్రీనివాసుని చల్లని దీవెనలతో విశ్వశాంతి లభిస్తుంది.

కామధేనుః కల్పవృక్షః
చింతామణిరితి త్రయమ్
వేంకటేశ త్వమేవాసి
శేషాగే సర్వదానతః

ఓ శ్రీనివాస ప్రభూ! దేవలోకమే (స్వర్గమే) నాకు తెలియదు స్వర్గలోకంలోని కామధేనువు, కల్పవృక్షం, చింతామణి అన్నీ కోరికల్ని తీరుస్తాయట. ఇది ఎంతవరకు నిజమోకాని, నీవు మాత్రం భక్తులపాలిట కామధేనువువై కల్పవృక్షమై, చింతామణివై శ్రీవేంకట శైలంపైన ప్రత్యక్షంగా దర్శనమిస్తూ నీ నిదర్శనాలు చూపుతూ సంపూర్ణంగా అనుగ్రహిస్తున్నావు. అభయ ప్రదానం కావిస్తున్నావు. జానకిని చెట్టపట్టిన రాముడు సీతారాముడై అలరించినట్లు శ్రీనివాసుడు పద్మావతీ ప్రియవల్లభుడై, పద్మావతీ హృదయ నాథుడై భక్తులకు ప్రశాంతిని, లోకాలకు శాంతిని ప్రసాదిస్తున్నాడు.

## శ్రీయాగం

శ్రీ పద్మావతీ ప్రియవిభుని దయతో విశ్వశాంతిని సాధించడం కోసం విశ్వశాంతి సహస్రకుండాత్మక శ్రీ మహా విష్ణుయాగం తిరులలో 14-10-94 నుండి 28-10-94 వరకు నిర్వహింపబడింది. సిరుల దేవియైన శ్రీపద్మావతీ దివ్య సన్నిధానంలో సర్వశుభ శ్రీ పరంపరలు లోకాలోకాలకు వరాలుగా అందాలనే సత్సంకల్పంతో శ్రీయాగం 13-3-95నుండి 17-3-95వరకు 'నభూతో నభవిష్యతి' అన్న ఉత్తమ పద్ధతిలో నిర్వహింపబడింది. తిరుచానూరు చరిత్రో మహోన్నతస్థాయిలో ఇట్టి శ్రీయాగం జరగడం ఇదే ప్రప్రథమమ్ము. తిరుచానూరులోని తోళప్ప తోటలో తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యంలోని ధర్మప్రచార పరిషత్ ఆధ్వర్యంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన జీయ్యరు స్వామివారి ప్రత్యేకమైన ప్రతిభావంతమైన పర్యవేక్షణలో శ్రీయాగం రూపురేఖలు దిద్దుకొని భక్తులను ఎంతగానో అలరించింది.

శ్రీ భావనామసంవత్సర ఉత్తరాయణ పుణ్యకాలంలో ఫాల్గుణ శుద్ధ దశమీ భానువారం సాయం సంధ్యా సమయంలో అంటే 12-3-95 తేదీసాయంకాలం 6.30గం. లకు

దేవాలయ అధికారులు, ప్రముఖులు యాగ నిర్వాహకులు, భక్తులు శ్రీచిన జీయ్యర్ స్వామి శ్రీపద్మావతీదేవిని దర్శించి ప్రధాన అర్చక స్వామి ఆధ్వర్యంలో అమ్మవారికి విశేషంగా పూజలు కావించి శ్రీయాగ నిర్వహణకు అనుమతిని అర్థించారు. శ్రీకృష్ణ మందిరంలోని సుదర్శన భగవానుని యాగ ప్రారంభానికి, రక్షణకు సహకరించమని ప్రార్థించి విష్వక్సేనపూజ కావించి శ్రీసుదర్శన భగవానుని సారథ్యంలో అంకురార్పణకు అవసరమైన మృత్సంగ్రహయాత్రకు బయలుదేరారు. వేద ప్రబంధ పారాయణలతో, ఛత్ర చామర మంగళవాద్య ఆదిగాగల రాచమర్యాదలతో వారు ముందుకు సాగి శ్రీపద్మావతీ ఆలయానికి సమీపంలో దక్షిణంగా ఉన్న శుక్రవారపు తోట అని పిలువబడే వసంత మండపం వద్దకు చేరుకున్నారు. వసంత మండపం సమీపంలోని అశ్వత్థ నారాయణస్వామి వృక్షాల మూలంలో ఉన్న పుట్టమట్టిని సేకరించి స్వీకరించి వారు రాత్రి 8.30 గంటల సమయంలో యాగశాలలోనికి ప్రవేశించారు.

యాగశాల మామిడాకుల తోరణాలతో, స్వాగత తోరణాలతో దివ్యకాంతులు ప్రసరించే పద్మావతీ శ్రీనివాసుల జ్యోతి స్వరూపాలతో ఒక పండుగ కళను సంతరించుకొని కళ కళలాడిపోతోంది. శ్రీపద్మావతీదేవి దివ్య దేవాలయ ప్రాంగణానికి ఆగ్నేయంగా ఉన్న తోళప్పతోటలో ఆగమ శాస్త్ర విధేయంగా శ్రీయాగం కోసం యాగశాల చతుర్వింశాత్మక శ్రీయాగం కోసం అపూర్వమైన పణితిలో అత్యాధునికమైన సొకడలతో తన విన్యాసాలీనే శైలిలో యాగశాలరూపొందింపబడింది. వికసించిన అష్టదళ పద్మాకారంలో ఆవిష్కరింపబడింది. ఆపద్మంలోని ఎనిమిది రేకులు ఎనిమిది దిక్కులకు విస్తరించగా ఒక్కొక్క పద్మదళంలో మూడేసి హోమ కుండాలు లెక్కన మొత్తం ఇరువది నాలుగు హోమకుండాలు నిర్మితమయ్యాయి. ఆ అష్ట దళ పద్మంలోని తూర్పు దిక్కులోని దళంలో మూడు చతురస్ర కుండాలు, దక్షిణదిక్కులోని దళంలో మూడు ధనుష్కుండాలు, పశ్చిమదిక్కులోని దళంలో మూడు వర్తులాకారపు కుండాలు, ఉత్తరదిక్కులోని దళంలో మూడు త్రిభుజాకారపు కుండాలు అతిలోకమనోహరంగా తీర్చిదిద్దబడినవి. ఇక ఆగ్నేదిశలోని దళంలో మూడు యోని కుండాలు, నైఋతి దిశలోని దళంలో మూడు షట్కోణకుండాలు, వాయువ్యదిశలో మూడు పంచాశ్ర కుండాలు, ఈశాన్య దిశలో మూడు అష్టాశ్రకుండాలు రూపొందింపబడ్డాయి. ఆవిధంగా నాలుగు దిక్కులలో పన్నెండు కుండాలు, నాలుగ దిశలలో పన్నెండు కుండాల వంతున మొత్తం ఇరువదినాలుగు హోమకుండాలు అష్ట దళ పద్మంలో నిర్మాణమయ్యాయి. ఈఅష్ట దళాలు కలిగాన పద్మ మధ్యంలోని కర్ణిక (నాభి)పై శ్రీయాగార్చన స్వీకరించడానికి శ్రీపద్మావతీదేవి ఆసీనురాలైంది. ఈప్రధాన యాగవేదికక

ఎదురుగా శ్రీపద్మావతీకి ఆస్థానమండపం, దానికి ఆగ్నేయంగా సుమారు పదిగజాల దూరంలో ప్రత్యేక మైన ఆరు అడుగుల చతురస్రాకారపు ఇష్టి యాగమండపం, నిర్మితమయ్యాయి. దీనిలోనే సుదర్శనహోమ గుండం యేర్పాటు చేయబడింది. దానికి ముదున్న వేదికపై శ్రీమన్నారాయణుడు ప్రతిష్ఠితుడై భక్తులకు దర్శన భాగ్యం ప్రసాదిస్తున్నాడు. ఇక శ్రీయాగశాల ప్రాంగణంలో యాగశాల, ఆస్థానమండపం, ప్రవచన మండపం ఇష్టిమండపం, అన్నదానమండపం, ప్రవేశద్వారాలు, మార్గాలు టిటి. డి. ఇంజనీరింగ్ విభాగం వారు చూడముచ్చటగా రూందించారు. ఇటువంటి శ్రీయాగ ప్రాంగణంలోని యాగశాలలోనికి శ్రీయాగ నిర్వాహకులు పుట్టమన్నుతో ప్రవేశించారు. శ్రీసుదర్శన భగవానుని యాగశాల మధ్య కల వేదికపైన నిలిపి విష్వక్సేన పూజచేసి అంకురార్పణ, యాగ దీక్ష, ఋత్విగ్వరణం, పంచగవ్యప్రాశనం, దీక్షా వస్త్ర సమర్పణం, ఆదిగాగల యాగ ప్రాథమిక విధులు పూర్తికావించారు. చతుర్వేద స్వస్తి, నీరాజన మంత్ర పుష్పాలతో భక్తులకు ప్రసాదవితరణంతో అంకురార్పణ కార్యక్రమం విజయవంతమైంది.

శ్రీయాగార్చన స్వీకరించడానికి 13-3-95 తేదీ సోమవారం ఉదయం సుప్రభాతాది అర్చనలు స్వీకరించి చక్రత్తాళ్వారు పల్లకిపైన, శ్రీ పద్మావతీదేవి హంసవాహనంపైన మహాప్రదిక్షిణ పూర్వకంగా యాగశాలలోనికి ప్రవేశించారు. యాగశాల వేదికపైన స్వర్ణ కలశస్థాపనం జరిగింది. అగ్నిమథనం చేసి అగ్నిదేవుని యాగశాలకు ప్రదక్షిణం చేయించి ముందు పడమటి దిశను కల హోమ కుండంలో ప్రతిష్ఠించి తరువాత అన్ని కుండాలలోనికి అగ్నిని ప్రవేశింపజేశారు. పిమ్మట యాగశాల ముందు ఉన్న ధ్వజస్తంభంపైన గరుడధ్వజం ఆవిష్కరింపబడింది. గరుడనకు పూజలు, నివేదనలు కావించి ప్రధానయాగ శాలలో, ఇష్టి యాగమండపంలో హోమాలు కావించారు. ఆవిధంగా శ్రీయాగం మహావైభవంగా ప్రారంభమైంది.

శ్రీయాగం జరిగిన 13-3-95 నుండి 17-3-95 తేది వరకు శ్రీయాగాన్ని పురస్కరించుకొని నిత్యయాగార్చన కార్యక్రమాలు ఈవిధంగా నిర్వహించబడ్డాయి. నిత్యం ఉదయం సుప్రభాతసేవల పిమ్మట సుదర్శన భగవానుడు, పల్లకిలో పద్మావతీదేవి ఉచితమైన వాహనంలో యాగశాలలోనికి ప్రవేశించేవారు. చక్రత్తాళ్వారునకు, పద్మావతీదేవికి స్నపనతిరుమంజనం రెండు గంటల పాటు జరిగేది. వేదపారాయణం, ప్రబంధ పారాయణం, మంగళవాద్యాల మధ్య ఆ అభిషేక కార్యక్రమం జరిగేది. శ్రీ సూక్తం, భూసూక్తం, నీళాసూక్తం పఠిస్తూండగా పాలు, పెరుగు, తేనె, కొబ్బరితీర్థం

పసుపు, పరిమళం ఆదిగాగల ద్రవ్యాలతో అమ్మ వారికి అభిషేకం జరిగేది. పిమ్మట ప్రవచన మండపంలో సామూహిక లక్ష్మీపూజ, సాయంత్రం సామూహిక శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణం శ్రీ చిన్నజీయ్యర్ స్వామి వారి ఆధ్వర్యంలో నిర్వహింపబడేవి. ఉదయ రాత్రి సమయాలలో హోమాలు యధాశాస్త్రీయంగా నిర్వహింపబడేవి. పండితుల ప్రవచనాలు మధ్యాహ్నం జరిగేవి. రాత్రి చతుర్వేద పారాయణం, నీరాజన మంత్ర పుష్పాలు, దర్బారు సేవలతో నిత్య శ్రీయాగ కార్యక్రమం ముగిసేది. అప్పుడు అమ్మ వురు ఆలయంలోనికి ప్రవేశించేవారు. 17-3-95 తేదీన సర్వభూపాలవాహనం పైన యాగశాల ప్రవేశం కావించారు. 16-3-95 తేదిన మధ్యాహ్నం 3 గంటలకు పద్మావతీదేవి దేవాలయంలోని డోలామండపంలో పద్మావతీ పరిణయం సంప్రదాయ సిద్ధంగా నిర్వహింపబడింది. ప్రధాన అర్చకుల ఆధ్వర్యంలో పద్మావతీ శ్రీనివాసులకు నిశ్చితార్థం, కంకణధారణం, ఎదుర్కోలు ఉత్సవం, పూలమాలలు మార్చుకోవడం, అక్షతారోహణం, పూలబంతులతో ఆడడం మొదలైన వివాహపుతంతు అంతా ఎంతో హుందాతనంతో, శోభాయమానంగా తిరుచానూరులో ప్రప్రధమంగా వేలాదిభక్త సమూహాల సమక్షంలో జరిగింది. ఆపద్మావతీ పరిణయమనో హరదృశ్యం దర్శించడం భక్తులకు ఒకమధురానుభూతి. ఒక దివ్యానుభూతి. 17-3-95 తేదీన మధ్యాహ్నం పూర్ణాహుతి ధ్వజావరోహణం జరిగాయి. ఆస్థానమండపంలో అమ్మవారికి సాయంత్రం స్నపన తిరుమంజనం జరిగిన పిమ్మట అమ్మవారు, సుదర్శన భగవానుడు దేవాలయంలోనికి ప్రవేశించడంతో శ్రీయాగం విజయవంతంగా సమాప్తమైంది. శ్రీయాగం సందర్భంగా చతుర్వేదాలు, భారత, భాగవత, రామాయణ, భగవద్గీత, సుందరకాండ, విష్ణుపురాణాదులు పారాయణం కావింపబడ్డాయి. నిత్యాన్నదాన పథకంలో యాగం జరిగిన ఐదురోజులలో దినానికి సగటున పదివేలు మంది భక్తులకు తదియారాధన జరిగింది. ఆవిధంగా ఏభైవేలమంది భక్తులకు అన్న సమారాధనం యేర్పాటు చేయబడింది. యాగశాలలో హవనయజ్ఞంలో, ప్రవచనమండపంలో మహాయజ్ఞంలో, పారాయణ స్వాధ్యాయ యజ్ఞంలో, సామూహికలక్ష్మి అర్చనలు అనే అర్చనాయజ్ఞంలో, అన్నార్పణ మహాయజ్ఞంలో ఆవిధంగా సర్వేసర్వత్రా యజ్ఞ స్వరూపిణియై యజ్ఞఫల ప్రదాయినియై శ్రీయాగ శుభఫలాలను శ్రీపద్మావతీ మాత చతుర్దశ భువనాలకు అనుగ్రహించింది. భక్తుల ఉత్సవాలను అందుకొంటూన్న ఉత్సవ మూర్తిగ ఆలయంలో భక్తుల పూజలు అందుకొంటూ అనుగ్రహించే అర్చామూర్తిగా, తిరుమలలో శ్రీనివాసుని హృదయంలో వ్యూహాలక్ష్మీమూర్తిగ విరాజిల్లే సిరులదేవి శ్రీపద్మావతీ దేవి. మన దేహాన్ని తిరుచానూరులోని పద్మావతీ పద్మసరోవరంగా భావించుకొంటే, మనహృదయ పద్మంలో పద్మావతీ దేవి అవతరించి

సదా మనకు శ్రీయాగ ఫలాన్ని ప్రసాదిస్తుంది. శ్రీవేంకటాచలం గగనతలం. శ్రీవేంకటాచల ఆకాశంలోని నీలి మేఘం శ్రీనివాస ప్రభువు. ఆ శ్రీనివాసమేఘంలోని మెరపుతీగ శ్రీపద్మావతి. ఆమె భక్తులపాలిట స్థిరసౌదామని. ఆమె కాలతి స్వరూపిణే కాదు. పరమ కరుణారూపిణి. దివ్య ప్రేమ స్వరూపిణి. భక్తులపాలిట మాతృస్వరూపిణి.

అభీష్టదాయనే భక్తానాం కల్పవృక్షాయితారమా
చింతామణి కామధేను కరుణాసాగరాయితా

శ్రీ పద్మావతీ మాత భక్తుల పాలిట కల్పవృక్షం. భక్తుల ఆశ్రిత చింతామణి. భక్తులకు కోరికలు నెరవేర్చే కామధేనువు. ఆ పద్మావతీ దేవి పాద పద్మాలను ఆశ్రయించి, విశ్వసించి, సేవించి మన జీవితాలను ధన్యం కావించుకొందాము.

## అలమేలు మంగ చక్కదనాలకు ముత్యాల రత్నాల నీరాజనాలు

మన అంతరంగంలో పద్మావతీదేవిని నిలుపుకొని, పిలుచుకొని, తలచుకొంటూంటే అంతా పద్మమయమై ఈ జగమంతా దేవీమయమై, పద్మావతీదేవి మయమై మనలను అలరించి ఆనందపరవశులను చేస్తుంది. దేవి ఆవిర్భవించింది, అవతరించింది పద్మంలో. భువిలో వెలసిన పారిజాతం పద్మం. కమలినీ, నళినీ, పద్మినీవంటి 61 పేర్లతో పద్మం సంస్కృతంలో వ్యవహరింప బడుతోంది. కన్నడంలో దీన్ని తావరె అని, తమిళంలో తామరై అని, ఆంగ్లంలో లోటస్ అని, సింహళంలో నెల్యూంబ్ అని పిలుస్తారు. పద్మాన్ని వృక్షశాస్త్రంలో నెల్యూంబియం నెల్యూంబో అని వ్యవహరిస్తారు. సృష్టికి అందాన్ని, దృష్టికి ఆనందాన్ని అందించేది పద్మం. అందుకే అది భువిలో వెలసిన పారిజాతం. చెరువులు, తటాకాలు, నదులు తామరపూవులతో, ఆకులతో, లతలతో అలంకరించుకొని ప్రకృతిరమణీయతకు అదనపు సోయగాల్ని కల్పిస్తూంటాయి. పద్మాలు శీతలాన్ని భరించలేవు. ఉష్ణ ప్రదేశాలలోనే వీని పెరుగుదల హెచ్చు. మనదేశంలోనే కాదు, దక్షిణ ఆసియానుండి ఆస్ట్రేలియా వరకు అన్ని ప్రాంతాలలోను పద్మాలు కలకళలాడుతూ కనపడతాయి. సౌందర్యానికి ప్రతీక పద్మం. సౌష్ఠవానికి ప్రతిబింబం పద్మం. భారతీయ సంస్కృతికి – పద్మానికి మధ్య ఆత్మీయతానుబంధం నెలకొని ఉంది. అవినాభావసంబంధం పెనవేసికొని ఉంది. ఋగ్వేదం పుండరీకాన్ని వర్ణిస్తూ గానం చేసింది. అధర్వణవేదం మానవ హృదయాన్ని పద్మంతో పోల్చింది.

పురాణాలలో 'పద్మ పురాణం' ఒక ముఖ్యమైన పురాణం. పురాణాలలో పద్మగంధం పరిమళిస్తోంది. పద్మసౌందర్యం ప్రకాశిస్తోంది. సృష్టికి ప్రత్యక్ష భగవానుడైన సూర్యభగవానుని కమలభాంధవుని గా పద్మహస్తుని గా పద్మగర్భుని గా పౌరాణిక సాహిత్యం వర్ణించింది. ప్రాచీన సారస్వతం అభివర్ణించింది. శ్రీమహావిష్ణువు పద్మనాభుడు. బ్రహ్మదేవుడు పద్మసంభవుడు. వాణీ హిరణ్యాగర్భుల ఆసనాలు పద్మాసనాలు. శ్రీ మహాలక్ష్మి ఆసనం వికసిత పద్మమే! పరమేశ్వరునకు పద్మాలు ప్రీతి పాత్రాలు. శ్రీమహావిష్ణువు చక్రాన్ని దక్షయజ్ఞ ధ్వంసకాలంలో వీరభద్రుడు చక్కిలంవలె భక్షించాడు. శ్రీహరి భీమనాధుని వేయి తామరలతో నిత్యం పూజించి చక్రలాభాన్ని పొందాడు. లలితాదేవి, శ్రీహరి సుప్రసన్నలయ్యేది తామరపూవుల పూజతోనే. విష్ణు లితా సహస్ర నామాలలో పద్మాల ప్రస్తావన విస్తారంగా గోచరిస్తోంది. 'శ్రీవేంకటేశ సుప్రభాతమ్' లో కూడ పద్మాల ప్రస్తావన గోచరిస్తుంది. 'ఆకాశ సింధుకమలాని మనోహరాణి' 'భాస్వానుదేతి వికచాని సరోరుహాణి, అనే ప్రయోగాలలో పద్మాలు ప్రాముఖ్యత వహించాయి.

ఇటు హిందూ మతంలోనే కాదు బౌద్ధమతంలో కూడ పద్మం ఉన్నత స్థానం అలంకరించింది. బుద్ధభగవానుడు మహాపద్మంలో పద్మాసనుడై దర్శనమిస్తాడు. అష్ట దళపద్మంలోని అష్టదళాలకు ప్రతీకంగా గౌతమబుద్ధుడు అష్టాంగ మార్గాన్ని విశ్వమానవాళికి విశ్వశాంతి కోసం శాంతి బహుమానంగా అందించాడు. గౌతమబుద్ధుని ప్రధాన శిష్యుడైన బోధిసతుడు చేత ప్రపంచ ప్రఖ్యాతుడయ్యాడు. పద్మసౌందర్యం, బౌద్ధమత పరమార్థం చైనా, జపాను, బర్మా, సింహళం, ఆదిగాగల దేశదేశాలకు వ్యాపించాయి. ఈజిప్టువారు సూర్యుని 'హూరస్' అని పిలుస్తారు. 'హూరస్' ప్రతిరోజూ ఉదయం పద్మంనుండి బయల్పడి సాయంత్రం పద్మంలోనికి ప్రవేశించి విశ్రమిస్తాడని వారు విశ్వసిస్తున్నారు.

భావనా ఋషి పురాణాన్ని బట్టి చూస్తే పద్మాలే వస్త్రనిర్మాణానికి శ్రీకారం చుట్టాయని తెలుస్తోంది. పద్మతంతువుల నుండి దారాన్ని తీసి వస్త్రాలుగా నిర్మించి దేవతలకు కానుకలుగా సమర్పించినట్లు భావనాఋషి పురాణం వలన వ్యక్తమవుతోంది. శిల్పకళారంగం పద్మాలంకారాలతో విరాజిల్లుతోంది. నాచుతో కప్పిన పద్మంవలె నారచీరలు కట్టిన శకుంతల ఆశ్రమవాసం చేస్తోందని కాళిదాసు వర్ణించాడు. విశ్వ సాహిత్యంలో స్త్రీవదన సౌందర్యం, నేత్ర సౌందర్యం, పద్మంతో పోల్చబడి వర్ణించబడింది. సాహిత్యంలో సౌందర్యవతి పద్మవదనగా పద్మాక్షిగా కనపడుతోంది. పద్మాలు పవిత్రతను వ్యక్తపరుస్తాయి. మహాత్ముల హస్తాలను, కరకమలాలు, పద్మహస్తాలుగా వర్ణిస్తాము. మహాత్ముల పాదాలను

చరణకమలాలుగా, పాదపద్మాలుగా భావించి పూజిస్తాము. అత్యున్నత ప్రమాణంకల చిత్రాలకు 'రజితకమలం', స్వర్ణకమలం బహుమతులుగా లభిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం విశిష్టమైన సేవలు కావించిన ప్రముఖులను 'పద్మశ్రీ, పద్మ భూషణ్, బిరుదాలతో సత్కరిస్తోంది. యుద్ధవ్యూహాలలో పద్మవ్యూహం ఒకటి.

యోగ శాస్త్రంలో పద్మానికి ప్రత్యేకమైన స్థానం ఉంది. మానవశరీరంలోని గుదస్థానం మొదలు బ్రహ్మరంధ్ర స్థానం వరకు విస్తరించిన స్థానాలను చక్రాలుగా, కమలాలుగా వ్యవహరిస్తారు. అవి ఆధారకమలం నుండి సహస్రార కమలం వరకు విస్తరించినట్లు యోగశాస్త్రం గుర్తించింది. అట్టి ఒక్కొక్క స్థానాన్ని ఒక్కొక్క అధిదేవత పాలిస్తుందని యోగ శాస్త్రం విశ్లేషిస్తోంది. ఆధారకమలంనుండి అజ్ఞేయ కమలం వరకు ఆయాకమలాల మెట్లు అధిరోహిస్తూ సహస్రారకమలాన్ని సమీపించిన మానవుడు యోగసిద్ధుడు, పరిపూర్ణుడు, జ్ఞానపూర్ణుడుగా విజయుడవుతాడని యోగ శాస్త్రం ప్రకటిస్తోంది. యోగాసనాలలో పద్మాసనానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఆవిధంగా పద్మం యోగ ధర్మంతో సన్నిహిత సంబంధం పెంపొందించుకొంది.

పద్మం దివ్యౌషధం. వాతపిత్త రోగాలను హరిస్తుంది. కురుపులను, పుండ్లను మాన్పుతుంది. జ్వరాలను, చర్మ వ్యాధులను నివారిస్తుంది. తామరపువ్వులు, తామర గింజలు, చూర్ణం కేసరాలు మానవజాతి ఆరోగ్యపరిరక్షణకు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఆవిధంగా వైద్యరంగంలో పద్మం ప్రముఖ పాత్ర వహిస్తోంది. తామర ఆరోగ్య కరమైన ఆహారం. పశువులకు పాలిచ్చే పశువులకు పుష్టికరమైన ఆహారం ఏనుగులకు తామరకొలనులో జలక్రీడలు కావించడం అభిమానపాత్రమైన వినోదం. అదేవిధంగా తామరతూడులు తినడం కూడా వాటికి ఎంతో ఇష్టం. నిరుపేదలు తామరగడ్డలు తిని కడుపు నింపుకొంటారు. తామర ఆకులు, పువ్వులు, గడ్డలు అమ్మి కొందరు జీవనయాత్ర సాగిస్తారు.

ఈవిధంగా పద్మం వేదాలలో గుర్తింపబడింది. పురాణాలలో ప్రస్తుతింపబడింది. ప్రపంచ సారస్వతంలో ప్రముఖ స్థానం ఆక్రమించింది. ప్రకృతికి పద్మం ఒకవరం. సూర్యభగవానునితో, త్రిమూర్తులతో, సరస్వతితో, దేవతామూర్తులతో నిత్య సాన్నిహిత్యం సంపాదించుకొంది. సృష్టికర్తతో, సృష్టితో ప్రత్యక్షసంబంధం పెంపొందించుకొంది. హైందవ మతంతో ,హైందవ జీవనంతో, భారతీయ సంస్కృతితో పద్మం బాంధవ్యం యేర్పరచుకొంది. బౌద్ధమతంలో స్థానం సంపాదించుకొంది. ప్రప

తితో వస్త్ర పరిశ్రమతో, యోగశాస్త్రంతో, వైద్య రంగంతో, ఆహారరంగంతో, శిల్పకళారంగంతో, జనజీవనానికి సంబంధించిన అన్ని రంగాలతో విడదీయరాని ఒక సన్నిహిత సంబంధాన్ని కల్పించుకొని పద్మం ప్రఖ్యాతమైంది. జాతీయ, అంతర్జాతీయ స్పష్టంగా గుర్తింపు పొందింది. అట్టి మహాపద్మంలో శ్రీపద్మావతి ఉద్భవించింది. పద్మావతీదేవి ఏపద్మంలో అవతరించిందో, ఆపద్మంలోక హితం కావిస్తూ లోకానికి సన్నిహితమైంది. సృష్టికి మూలం పద్మం. జనతను, జగతిను నడిపిస్తూ, పాలిస్తూ, రక్షిస్తున్నది పద్మంలో అవతరించిన పద్మావతీదేవి. నీటిలో పుట్టిన పద్మం నింగిలోని సూర్యుని చేరాలని ఆరాటపడి, ఆశించి, ప్రయత్నించినట్లే, పుడమిపైజన్మించిన మానవుడు శ్రీనివాసుని చేరడానికి పద్మావతీదేవి దయకు, అనుగ్రహానికి ప్రయత్నించి కృషిచేయాలనే దివ్య సందేశాన్ని పద్మం అందిస్తోంది. మానవాళికి మౌనప్రబోధం కావిస్తోంది పద్మం. పద్మ ప్రబోధంతో పద్మావతీదేవి కృపకు మనం పాత్రులమవుదాం.

"క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని
నీరజాలయమునకు నీరాజనం
జలజాక్షి మోమునకు జక్కవకుచంబులకు
నెలకొన్న కప్పురకు నీరాజనం
అలివేణితురుమునకు హస్తకమలములకు
నిలువు మాణిక్యముల నీరాజనం.
చరణకు సలయముల సఖియరంభోరులకు
నిరతమగుముత్తేల నీరాజనం
అరిదిజఘనంబునకు అతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ నీరాజనం.
పగటు శ్రీవేంకటేశు పట్టపురాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కదనములకెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం"

------ అన్నమయ్య

## ఆధార గ్రంథాలు


| | | |
|---|---|---|
| 1. | వరాహపురాణం | శ్రీవ్యాసభగవానుడు |
| 2. | భవిష్యోత్తర పురాణం | ” |
| 3. | శ్రీపద్మపురాణం | ” |
| 4. | శ్రీ వేంకటాచల మాహాత్మ్యం | తి.తి.దేవస్థానముల ప్రచురణ |
| 5. | శ్రీ వేంకటాచల మాహాత్మ్యం | తరిగొండ వెంకమాంబ |
| 6. | History of Tirupati Volumes 1&2 | శ్రీ టి. కె.టి. వీరరాఘవాచార్య |
| 7. | The Tirumala Temple | Dr. N. రమేశన్ |
| 8. | Tirupathi Sri Venkateswara | శ్రీ సాధు సుబ్రహ్మణ్యం |
| 9. | తిరుపతి చరిత్రము | శ్రీమాన్ దీవి రంగనాధాచార్యులు |
| 10. | శ్రీనివాస మంగాపురం మరియు మన ఆలయాల చరిత్ర | శ్రీగోపీ కృష్ణ |
| 11. | అన్నమాచార్య చరిత్ర పీఠిక | శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రి |
| 12. | అన్నమయ్య శృంగార సంకీర్తనలు 4నుండి 13 వరకు | తి.తి. దే. ప్రచురణములు |
| 13. | తాళ్ళపాక కవుల కృతులు వివిధ సాహితీ ప్రక్రియలు | డాక్టర్ వేటూరి ఆనందమూర్తి |
| 14. | ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము | శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు |
| 15. | సప్తగిరి నవంబరు 76 సంచికలోని శ్రీ వంగీపురపు రంగస్వామయ్యార్ రచన | |
| 16. | సప్తగిరి సంచికలు మే 76 సంచిక శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం నారాయణ వనం అనే వ్యాసం | |
| 17. | Sri Venkateswara | Sri. P. Sitapathi IAS |
| 18. | History of Tirumala Balaji Venkateswara | Sri T. Krishnaswamy Tiruchanoor |
| 19. | T.T.D. Inscriptions & 8Volumes | |

20. శ్రీఅన్నమాచార్య సారస్వత కళారాధనము – సప్తగిరిలో వ్యాసములు శ్రీకామిశెట్టి శ్రీనివాసులు శెట్టి

21. 1980 నుండి 1995 వరకు సప్తగిరిలో శ్రీపద్మావతిపై ప్రచరితమై వ్యాసాలు

22. శ్రీనివాసవైభవమ్ 1,2,3 భాగాలు వెలమకన్ని శ్రీరామమూర్తి

23. శ్రీ వేంకటేశ్వర వైభవమ్ శ్రీ పండిత వేదాంతం జగన్నాధాచార్యులు

23. 16-5-1985 నాటి ఆంధ్రప్రభ దినపత్రికలో చిన్నారికి దేవునితో పెళ్ళి అనే రచన

# రచయిత పరిచయం

## "క్షేత్ర సాహితీ నవ వైతాళిక" "క్షేత్ర చరిత్రోద్ధారక"

## శ్రీ పెలమకన్ని శ్రీరామమూర్తి బి.ఏ.బి.ఇ.డి.,

రిటైర్డు హైస్కూలు హెడ్మాస్టరు

తల్లిదండ్రులు : శ్రీమతి సుబ్బలక్ష్మి శ్రీ వెంకట్రామయ్య

జననం : 14-7-1932 జన్మస్థలం: పిఠాపురం,

విద్యాభ్యాసం : పిఠాపురం రాజా హైస్కూలు, పి.ఆర్.కళాశాల, కాకినాడ. ప్రభుత్వ బోధనాభ్యాసన కళాశాల, రాజమండ్రి.

ప్రేరణ : శ్రీనివాసుని దివ్య ఆదేశం ప్రేరణ 23-5-1958 బ్రాహ్మీముహూర్తంలో లభించగా క్షేత్ర సాహిత్య సృజనకు అంకురార్పణ జరిగింది.
1958 లో క్షేత్రసాహితి (క్షేత్రసాహిత్య చరిత్రల ప్రచురణ సంఘం) స్థాపింపబడింది. క్షేత్ర సాహిత్య వ్యవస్థాపకులు అధ్యక్షులుగా క్షేత్ర సాహిత్య సృష్టి, ప్రచురణ, ఉచితంగా భక్తులకు వితరణ కావిస్తున్నారు.

ప్రవృత్తి : కలంద్వారా, గళం ద్వారా భక్తిప్రచారం, క్షేత్ర సాహిత్య సృష్టి, ప్రచురణం, ప్రచారం. ఆంధ్రప్రదేశంలోని అన్ని ప్రధాన దేవాలయాలలో ధార్మిక ప్రసంగాలు చేసారు.

రచనలు : (1) క్షేత్ర త్రయం (2) గౌతమీ క్షేత్రాలు (3) కృష్ణాపుష్కరం (4) ముకుందమాల (5) ఆంధ్ర క్షేత్రాలు (6) పీఠకాపుర క్షేత్రం (7) అన్నవర క్షేత్రం (8) ద్వారకా తిరుమల క్షేత్రం (9) కోటిఫలి క్షేత్రం (10) మందపల్లి క్షేత్రం(11) కన్యకాపరమేశ్వరీ క్షేత్రం (12) భీమవరం సోమేశ్వరక్షేత్రం(13) క్షీరారామ క్షేత్రం(14) కొప్పు లింగేశ్వర క్షేత్రం (15) కలియుగ కల్పవృక్షం సుందరకాండ

(16) శ్రీషిరిడి సాయి చరిత్ర (పారాయణ గ్రంథము) (17) కృషిక తపస్వి – కీ.శే. గోటేటి జోగిరాజు పంతులు జీవిత చరిత్ర (18) శ్రీనివాసుని పరిశోధన గ్రంథాలు శ్రీవేంకటేశ సుప్రభాతమ్ (19) పూలదో... (20) శ్రీనివాసకల్యాణము (21) తిరుపతి క్షేత్రం (22) అన్నమయ్య (చారిత్రక నాటకము) (23) శ్రీ... వైభవమ్ మెదటి భాగము సుప్రభాత, పూజా తీర్థవైభ... సంపుటము (24) శ్రీనివాస వైభవమ్ 2వ భాగము క... వైకుంఠ సంపుటము (25) శ్రీనివాస వైభవమ్ 3వ భాగము కల్యాణ భక్తి వైభవ సంపుటము (26) శ్రీవిజయదుర్గా వైభవమ్ (27) స్వర్ణకమలం (శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు జీవితచరిత్ర) (28) పద్మావతీ వైభవమ్

అముద్రితములు : శ్రీదక్షారామ క్షేత్రం, భజగోవిందమ్, షిరిడి సాయి నామ వ్యాఖ్యానం సూక్తిముక్తావళి సంపుటం.

పొందిన పురస్కారాలు : 1995 విజయదశమి నాడు శ్రీవిజయదుర్గా పీఠంలో కనకాభిషేక సన్మానం, 26-3-2001 ఉగాదికి వెదురుపాక విజయదుర్గా పీఠంచే ఉగాది సాహిత్య పురస్కారం. శ్రీమాడుగుల నాగఫణి శర్మ, డాక్టర్ కె. విశ్వనాథ్, (చిత్ర దర్శకులు) ప్రభృతుల చే స్వర్ణ కమలం ఆవిష్కరణ సమయంలో 19-1-2002 న ఘన సన్మానం.

నిర్వహిస్తున్న పదవి : వెదురుపాక శ్రీవిజయదుర్గా పీఠం ఆస్థాన కవి.

ప్రస్తుత కృషి : భగవాన్ శ్రీ రమణ మహర్షి జీవితంపై తత్త్వంపై పరిశోధన. జీవిత చరిత్ర రచన

చిరునామా : శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి
శ్రీహరి వాసము
లలితా నగర్,
రామచంద్రపురము– 533 255
ఫోన్:08857 (914) 43353

